శ్రీ వేంకటేశాయ నమః

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము.



పరిశోధకులు, కృతికర్త :

“ విద్యాభూషణ ”

మేరుసోమంచరాజుల దుర్గయ్యశాస్త్రి

# శ్రీ మేరుసోమయాజుల దుర్గయ్యశాస్త్రి గారు రచించిన కొన్ని పాటలు

## హారతిదే జయహారతిదే

కరుణ చూడుమో కాత్యాయనినీ చరణమె గతియని శరణంటిని నిను
మరువక బ్రోవుము మరిమరి వేడితి హారతిదే జయ హారతిదే||

కన్నతల్లి నిను సన్నుతింతు మము కన్నెడశాయక కన్నులకగపడి
మన్నన గ్రన్నన పున్నెములొసగుము హారతిదే జయ హారతిదే||

సంతోషముతో మంగళగౌరి మా ముంగల ముదమారంగను నిలబడి
మంగళమొసగుమ అంగజారిసతి హారతిదే జయ హారతిదే||

కాశీనకురు నివాసిని పార్వతి భాసురాంగి సుహాసిని దుర్గా
దాసుని బ్రోచిన దయజూడుముమము హారతిదే జయ హారతిదే||

*****

## జయహారతిదే

జయహారతిదే గైకొనుమా నీరజనాభా

మారకోటి సుందర సుకుమార శ్రీధరా ||జ||

నందగోప నందన గోబృందపాలనా

వందన మిదె కొనుము యదు వంశభూషణా ||జ||

దంతిపాల భర్మచేల పంతమేల నీపాల

బడితి బ్రోవవేర బాలగోపాల ||జ||

పుండరీక నయన భోగి మండల శయనా

ఖండిత సురవైరి కాండ తాండవ కృష్ణా ||జ||

వ్యసకాశి వాస దుర్గ దాసపోషకా

వాసవాది పూజిత పద పంకజయుగళా ||జ||

*******

# హారతిగొనుమా

హారతిగొనుమా నీరజనాభా నీరద సమగాత్రా
నీలా నీరద సమగాత్రా ||హా||

వందిత సనకస నందన ముఖముని బృందసు పూజితకమలా
నంద యశోదా నందన సుందర మందర నగధర గోవిందా ||హా||

కరివర వరదా కావు మనుచు నిను నిరతము మనమున వేడితిరా
కరుణాలయ మము సరగున బ్రోవగ సరసిజాక్ష యిదె సమయమురా ||హా||

దాసజనావన శాసిత దానవ భాసుర కౌస్తుభదోషహరా
వాసుదేవ మురశాసన దుర్గా దాసవరద భవభయ హరణా ||హా||

*****

# మంగళహారతిదిగో

మంగళహారతిదిగో మాధవాశ్రీకృష్ణా

పరమపావన నామా సురుచిర భవ్యధామా

పరిపూర్ణ నిజకామా సురవైరి గణభీమా ||మం||

ఖగరాజ వాహనా జగదేక మోహనా

నగధర మురహర నిగమాంత గోచరా ||మం||

పాలితా సురగణా భక్తౌఘనాశనా

భవబంధ మోచనా పంకజ లోచనా ||మం||

ఇలమేరు సోమయాజుల దుర్గ దాసావనా

ఖలజన నాశనా సులలిత భాషణా ||మం||

*****

## గోపాలా

గోపాలయిదేమిరా పాపము బాపావేమిరా
మా పాపము బాపవేమిరా ||గో||

ఎంతగా బ్రతిమలినను కాసింతయైనను కరుణారాదే
పంతమేలనయ్యానాపై దంతివర పాలకా కృష్ణా ||గో||

పుండరీక నయన మకర కుండలా మండిత చక్రా
ఖండిత దానవా చక్ర కుండలీశ శయన కృష్ణా ||గో||

వెన్నదొంగా వ్రేపల్లెలో ఉన్నకన్నె మిన్నల మరగి
ఎన్ని విధముల వేడికొన్నను కన్నులకు కాన్పింపవు కృష్ణా ||గో||

వ్యాసకాశీ నామక్షేత్ర భాసురానీరదా కారా
దాసమానోల్లాస చిద్విలాసగోపవేష కృష్ణా ||గో||

సామగానలోలా మేరుసోమయాజుల దుర్గాదాసా
నాముని బ్రోచితివని నీమమున నినుకొల్చితి కృష్ణా ||గో||

*****

# గోవింద పాహిమాం

గోవింద పాహిమాం గోపాల పాహిమాం
రాధాలోల పాహిమాం సాధురక్షక పాహిమాం
మత్స్యరూపా పాహిమాం మాధవకేశవ పాహిమాం
కచ్ఛపరూపా పాహిమాం కరుణాసాగర పాహిమాం
సూకర రూపా పాహిమాం సూనృతభాషణ పాహిమాం
నరహరి రూపా పాహిమాం కరివర వరదా పాహిమాం
వామన రూపా పాహిమాం వాసుదేవా పాహిమాం
భార్గవ రూపా పాహిమాం  బుధవిధేయా పాహిమాం
దశరథ తనయా పాహిమాం దానవ సంహార పాహిమాం
హలధర రూపా పాహిమాం కలుష విదూర పాహిమాం
దేవకీనందన పాహిమాం దేవాధిదేవ పాహిమాం
కల్కి రూపా పాహిమాం కలియుగజనరక్షక పాహిమాం.

****************

శ్రీ వేంకటేశాయ నమః

# శ్రీ వేంకటాచల మాహాత్మ్యము.



ప్రకాశకులు, కృతికర్త :

" విద్యాభూషణ "

మేరుసోమయాజుల దుర్గయ్యశాస్త్రి.

# విషయసూచిక.

---

# పరిచయము.

వ్యాసమహర్షి ప్రణీతమైన స్కాందమహాపురాణములోని "వైష్ణవ ఖండము" ప్రస్తుత "శ్రీ వేంకటాచలమాహాత్మ్యము"నకు మూలము. స్కాందములో తొమ్మిదిఖండములు కలవు- వానిలో వైష్ణవఖండము రెండవది. అందు తొమ్మిదిమాహాత్మ్యములు కలవు. (1) వేంకటాచల మాహాత్మ్యము, (2) జగన్నాథక్షేత్రమాహాత్మ్యము, (3) బదరికాశ్రమ మాహాత్మ్యము, (4) భాగవతమాహాత్మ్యము, (5) అయోధ్యా మాహాత్మ్యము, (6) వాసుదేవమాహాత్మ్యము, (7) వైశాఖ మాహాత్మ్యము, (8) కార్తిక, (9) మార్గశీర్ష మాసమాహాత్మ్యములు అనునవి.

ఈతొమ్మిదిమాహాత్మ్యములను సులభసుందరమైనఆంధ్రభాషలోనికి అనువదించిన బ్ర. శ్రీ. వే. మేరుసోమయాజుల దుర్గయ్యశాస్త్రిగారు "వేగినాటి" శాఖకుచెందిన శ్రోత్రియబ్రాహ్మణులు. వీరి నివాసస్థానము తూర్పుగోదావరిజిల్లా అమలాపురంతాలూకా 'కేశనకుర్రు' (కాశీం న కురు*) గ్రామము. దీనికి "వ్యాసకాశి" అనెడు చరిత్రప్రసిద్ధమైన ప్రశస్తి కలదు. ఈగ్రామములో వ్యాసప్రతిష్ఠితమైన వ్యాసేశ్వరునిగూర్చి శ్రీ శాస్త్రిగారు తాను రచించిన ఒకకృతిలో-

"... వ్యాసకాశివాస దుర్గదాసపోషకా !

వాసవాదిపూజితపదపంకజయుగళా !..."

అని 'కేశనకుర్రు'ను 'వ్యాసకాశి' అని పేర్కొన్నారు.

---

* వ్యాసర్షి కాశీని విడిచివచ్చి ఈ ప్రాంతమును కాశీగా చేయబోగా 'కాశీం న కురు' అనెడు ఆకాశవాణి వినవచ్చెనవియు, ఆవాణియే క్రమముగా "కేశనకుర్రు"గా మారినదనియు ఇచ్చటి స్థలపురాణజ్ఞులు తెలుపుచున్నారు.

ఇక శ్రీశాస్త్రిగారు గర్భాష్టమసంవత్సరమునందు*ఉపనీతులై గురువులసన్నిధిలో కృష్ణయజుర్వేదమును అశీతిద్వయము(82 క్రమాంతముతన పదారవయేటనే పూర్తిగావించి సంస్కృతాంధ్రములలో కూలంకషమైన ప్రజ్ఞనుసంపాదించిన ధీసంపన్నులు. తమ పదునాల్గవయేట తేనెలొలుకు తియ్యని తెలుగుకవిత్వము చెప్పిన ప్రతిభాశాలురు. అనేకమంది శిష్యులకు సంస్కృతాంధ్రములలో చక్కని శిక్షణను ఒసంగినవారు. భక్తిభావభరితములైన అనేకకృతులనుకూడ రచించినవారు. కపిలేశ్వరపురం జమీందారుల ఎస్టేటులో ఉద్యోగముచేయుటకు ముందే వీరు తన యిరువది నాల్గవయేట స్కాందములోని "వైష్ణవఖండము"ను సులభసుందరసుకుమార గ్రాంథికభాషలోనికి పూర్తిగ అనువదించినారు. 224 అధ్యాయములను యథామాతృకముగ ఒక్కచేతిమీదుగ అనువదించుట అనెడు మహాకార్యనిర్వహణము సామాన్యవిషయము కాదు. కాని అప్పుడు శ్రీశాస్త్రిగారిదృష్టి అనువాదము చేయుటవరకే పరిమితమై ఉండుటచేత, వీరి ఏ ఒక్కమాహాత్మ్యముకూడ ఇంతకుముందు ముద్రితము కాలేదు. ప్రస్తుతములో వీరు సుమారు ఎనుబదినాలుగేండ్ల వృద్ధులై అస్వస్థతగా ఉండుటచేత వీరిపుత్రులు- తండ్రిగారి పవిత్రపరిశ్రమను ప్రకాశింపజేయనెంచి మొదట "వేంకటాచలమాహాత్మ్యము"ను మాత్రమే అచ్చొత్తించినారు. వీరి ప్రయత్నము సర్వదా ప్రమోదావహము.

ఇక ఈ "వేంకటాచలమాహాత్మ్యము" నందలి కథాకథనరీతి తెలియుటకై కొంత పూర్వరంగమును సూచించెదను.

వృషభాచలనివాసియైన శ్రీ ఆదివరాహమూర్తి భూదేవికి 'వేంకటాచలమాహాత్మ్యము'నకు సంబంధించిన ప్రాంతపవిత్రతీర్థాదుల యొక్క విశేషములను వివరముగావినుపించును. ఈవిశేషములనే వ్యాస భగవానుడు తనశిష్యుడైన సూతునికి వినుపించును. ఈసూతుడు, శౌన

"*గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత" (ఆపస్తంబశ్రౌతసూత్రము)



కాది మహర్షులకు తనగురువర్యుడు చెప్పిన ఉత్తమ పర్వతతీర్థాదుల విశేషములనే వివరముగ తెలియజెప్పును. సూతునియొక్క ఈ యుపన్యాసములే ప్రస్తుత వేంకటాచలమాహాత్మ్యమునందలి కథాకథనరీతిని తెలియజేయును.

ఇక ప్రస్తుతప్రబంధప్రాశస్త్యమునుగూర్చి "కలౌ వేంకటనాయకః" ఈ కలియుగములో శ్రీ వేంకటేశ్వరస్వామి అందరకును సర్వాభ్యుదయసంధాతయై, ప్రత్యక్షదైవతమై, ఇష్టదైవతముగా నున్నాడు. ఇట్టి దేవదేవుని పరిత్రచరిత్ర పఠనము సర్వజనులకును సర్వాభీష్ట సంధాయకమై ఇహపరసాధకము కాగలదు.

"జ్ఞాత్వా కర్మాణి కుర్వీత"

మనము చేయుచున్న ప్రతిపుణ్యక్రియయు దాని విధివిధానము తెలిసికొని చేసినపిమ్మటనే అది సఫలము కాగలదు. "శ్రీ ఆదివరాహమూర్తిని దర్శించిన పిమ్మటనే శ్రీనివాసుని దర్శించవలెను అప్పుడే వేంకటాచలయాత్ర సఫలమగును" అనెడు ముఖ్యవిధానమును తెలిసికొన్నమీదటనే మన తిరుమలయాత్రకు సాఫల్యము చేకూరునుగదా! ఈవిధముగా కూడ ప్రస్తుత మాహాత్మ్యగ్రంథపఠనము అందరకును ఆవశ్యకమైయున్నది.

ఇక సులభసుందరసుకుమారమైన గ్రాంథికభాషకు కరవైన యీ రోజులలో ఈయనువాదగ్రంథమునకు ఎంతయో ప్రాధాన్యము ప్రాప్తించుచున్నది ఈగ్రంథములోని కవితారీతి నేటి ఆంధ్రవిద్యార్థుల భాషాసాహిత్యాభివృద్ధికిని, ముఖ్యముగా వారి మనఃపరిణతికిని ఎంతేని తోడ్పడును.

ఇక అందరకును తెలియదగిన విశేషములెన్నో కలవనుటకు ఒక యుదాహరణము-

"మేషసంక్రమణమున చిత్రానక్షత్రయుక్త పూర్ణిమాదినంబున స్వామి పుష్కరిణియందు స్నానమొనరించినవారి పుణ్యఫలము 12 సంవత్సరముల కాలము గంగాది పుణ్యనదులయందు స్నానము చేసినవారి పుణ్యఫలముతో సమానము. మొ. (చూ. 184 పేజి)

ఇక మూలముతో శ్రీ శాస్త్రిగారి అనువాదసామ్యము-

"అథేదానీం ప్రవక్ష్యామి వేంకటేశ్వరవైభవమ్ ।
యచ్ఛ్రుత్వా సర్వపాపేభ్యో ముచ్యతే నాఽత్ర సంశయః ॥
శ్రీవేంకటేశ్వరం దేవం యః పశ్యతి సకృన్నరః ।
స నరో ముక్తిమాప్నోతి విష్ణుసాయుజ్యమాప్నుయాత్ ॥
దశవర్షైస్తు యత్పుణ్యం క్రియతే తు కృతే యుగే ।
త్రేతాయామేకవర్షేణ తత్పుణ్యం సాధ్యతే నృభిః ॥
ద్వాపరే పంచమాసేన తద్దినేన కలౌ యుగే ।
తత్ఫలం కోటిగుణితం నిమిషే నిమిషే నృణామ్ ॥
నిస్సందేహం భవేదేవం శ్రీనివాసవిలోకినామ్ ॥"

మీది మూలమునకు శాస్త్రిగారి యనువాదము :-

"తపోధనసత్తములారా! ఏచరితంబు నాలకించినమాత్రంబున పాపసంచయమంతయు నాశమొందునో, అట్టి వేంకటేశ్వరవైభవంబును వచించెద వినుండు. దేవదేవుండగు వేంకటాచలేశు నొకసారి సందర్శించినను విష్ణుసాయుజ్యంబు సంప్రాప్తించును. కృతయుగంబున పది సంవత్సరముల కార్జించిన పుణ్యఫలమయ్యది, త్రేతాయుగంబునం దొక వత్సరంబున సంప్రాప్తంబగును. ద్వాపరంబున నద్దియే యైను మాసంబులకు ప్రాప్తంబగును. అట్టిఫలమే కలియుగంబునం దొక దినంబున సంభవించును శ్రీవేంకటాచలంబును సేవించువారల కట్టిఫలము ప్రతి నిమేషంబునను కోటిగుణితంబై లభ్యంబగును." ఇట్లే వీరి యనువాదమంతయు మూలార్థమును సులభముగా ప్రకాశిత మొనర్చుచుండును.



శ్రీశాస్త్రిగారు భాష్యత్రయశాంతిని గావించిన సార్థకజీవనులు. ఇక వీరి ఉభయకవితారీతులను ఒక్కొక్క యుదాహరణముతో చూపి యిద్దానిని ముగించెదను.

శాస్త్రిగారి ప్రాస్తావికములు-

ఉ. భంబుగదే నఖం బల నభంబుగదే నడు మెన్న పంకజా
భంబుగదే పదంబు కరభంబుగదే తొడసౌరుదంతి కుం
భంబుగదే కుచం బళినిభంబుగదే తలకట్టు శాతకుం
భంబుగదే తనూలత శుభంబుగదే యిది కేళి కబ్బినన్.

మండోదరి రాక్షసరాజుతో ననిన మాటలు :-

కం. మానదు నాకనుమానము
మా నాథుని సాక్షిగాగ మానాథుం డా
మానవనాథుని తనయుడు
నూని యా జానకియును మా మానినియే ॥

మాధవశతకములోనిది-

ఉ. కట్టితి కాంచనాంబరము కౌస్తుభమున్ మెడగట్టినావు నీ
పట్టపురాణి లచ్చి నిను బాయని కామిని రత్నగర్భ నిన్
గట్టిగ గొల్చు భక్తు లిటు గ్రాసము వాసము లేక నేడ్వ న
ట్టిట్టన రావు సంపద లివేటికి నెన్నటికయ్య మాధవా ॥

సంస్కృతభాషామోహను గూర్చి-

మృదుపదలలితా మనోజ్ఞవర్ణా
నవరసభావవిలాసినీ సువృత్తా
బుధజనవినుతా నరేంద్రపూజ్యా
విలసతి సంస్కృతభారతీ జగత్యామ్ ॥

ఇట్లు, విద్వజ్జనవిధేయుడు :
ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి.
24-5-71.

# విజ్ఞప్తి.

స్కాందములోని వైష్ణవఖండము విష్ణుకథావిలసితంబై వీనుల విందుగావించుచుండును. నేనీ ఖండమును ఇప్పటికి నలుబదేండ్లకు ముందే పూర్తిగ అనువదించియుంటిని.

నేను తత్తత్సందర్భములలో సంస్కృతాంధ్రములలో వ్రాసిన వివిధపద్యము లెన్నో యున్నను నా యీ వైష్ణవఖండానువాదమే నాకృషిలో ముఖ్యమైనది.

వైష్ణవఖండములోని కథలలోగల శ్రీవ్యాసభట్టారకుని హృదయమును ఆంధ్రపాఠకులకు సుబోధమొనర్చుతరి నాగ్రాంథికాంధ్రానువాదములో నేను రేఫ, శకటరేఫభేదములను, అర్ధానుస్వారములను, సరళాదేశాదులను పాటించలేదు. కాని ఆంధ్రవచనరీతి, ఆంధ్రబాలబాలికల జ్ఞానాభివృద్ధికిని, వారి భాషోపస్థితికిని తోడ్పడవలెనను విషయము విశేషముగ గమనింపదగినది.

చిరకాలాత్పూర్వమే పూర్తిగావించిన నా ఈ యనువాదములో కొంతభాగమైన ప్రకాశితముగావించవలెనని ప్రస్తుతములో కలిగిన సంకల్పమే ఈ "వేంకటాచలమాహాత్మ్య" ముద్రణమునకు మూలము.

ఏతత్పుస్తకప్రకాశనవిషయములో సర్వదా తగిన కృషిగావించిన చిరంజీవులు నాపుత్రులకును, చి॥ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రికిని నాహృదయపూర్వ కాశీస్సుల నందించెదను.



నా వేంకటాచలమాహాత్మ్యలిఖితప్రతిని అందముగను, శీఘ్రముగను ముద్రించి సకాలములో పుస్తకముల నందజేసిన శ్రీవిజయలక్ష్మి పవర్ ప్రెస్ యజమానులకును, ఓపికతో శ్రద్ధగ ప్రూఫ్‌లు సరిచూచి నిర్దోషముగ పుస్తకము వెలువడుటకు సంపూర్ణముగ సహకరించిన "వ్యాకరణవిద్యాప్రవీణ, భాషాప్రవీణ" చి॥ శ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రిగారికిని నా అభినందనములు తెలిపెదను.

నాలిఖితప్రతిలో కొంతభాగమును పంపి, దానిపై తమ యభిప్రాయమును పంపగోరినంతనే తమ యమూల్యాభిప్రాయమును వ్రాయించి పంపిన విద్వన్మాననీయులు, ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవివర్యులు, విద్యావారిధీత్యాది విశిష్టబిరుదవిరాజితులు, ప్రస్తుతములో కీర్తిశేషులు నగు శ్రీ కాశీ కృష్ణాచార్య డి. లిట్. మహోదయులకును, పండితరత్న బ్ర॥ శ్రీ॥ చతుర్వేది అమరేశ్వరశాస్త్రివర్యులకును నాప్రత్యేకప్రణామశతములను కృతజ్ఞతతో నర్పించువాడను. ఆంధ్రపాఠకలోకమునకు "పరిచయము" గావించిన చిరంజీవి విద్వాన్ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రికి నాహార్దికాశీస్సులు.

ఆంధ్రపాఠకలోకము నా యీ పరిశ్రమలోని సత్ఫలితమును శీఘ్రముగ పొందగలదని ఆశించెదను.

ఇట్లు

గ్రంథకర్త.

---

అవధాని శిరోమణి, విద్యావారిధి,
మహామహోపాధ్యాయ
**కాశీ కృష్ణాచార్యులు, డి. లిట్.**
ఆంధ్రప్రదేశప్రభుత్వాస్థానకవి.

అగ్రహారం,
గుంటూరు-1,
(ఆంధ్రరాష్ట్రము)
1-8-1964

విద్వన్మాననీయులు, వేదమూర్తులు నగు మేరుసోమయాజుల దుర్గయ్యశాస్త్రి మహోదయుల సన్నిధికి సప్రణామము విద్వద్విధేయుడు కాశీ కృష్ణాచార్యులు వ్రాయించు విన్నపములు-

మహాశయా! బ్రహ్మశ్రీ విరాజితులు, వయోవృద్ధులు, జ్ఞాన వృద్ధులు నగు తమరు నాయెడల నెంతో గౌరవాదరప్రచురముగ వ్రాసిన బృహల్లేఖాంశములను, లేఖవెంట దా మోపికతో వ్రాసి పంపిన వైశాఖస్నాన మహిమానువర్ణనాంధ్రానువాదమును జది వించుకొని, విని, చాల సంతసించితిని. మాయేకలవ్యశిష్యరత్నమగు చి. విద్వాన్ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి తమ యల్లుడని తెలి యుటచే నాసంతసము శతగుణితమైనది.

విశ్వశ్రేయోనిదాననుగు స్కాందమహాపురాణాంతర్గత వైష్ణవ ఖండము నామూలాగ్రము యథాతథముగ సరససరళఫక్కి నాంధ్రీక రించు తమ మహోద్యమము విబుధలోకప్రశంసనీయము.

వ్యాకరణశుద్ధమగు తమ రచనవలన నాంధ్రసారస్వతసేవా ఫలము తమకుఁ దప్పక సిద్ధింపగలదు.

ఏవో కొన్ని భాగములను సమగ్రముగ ముద్రింపించి ప్రక టించి, పండిత జనాదరణమును బడసి, తక్కినవానిని గ్రమముగా ముద్రింపించుట యుక్తమని నాయూహ. భగవానుడు తమ ధార్మిక సమారంభమును, నిర్విఘ్నముగఁ గొనసాగించి భవదభీష్టసిద్ధిని సంపూర్ణముగఁ బ్రసాదించుగాతమని మాయిష్టదైవమగు హయగ్రీవ మూర్తిని బ్రార్థించుచున్నాను.

చిత్తగింపగలరు
(సం) కాశీ కృష్ణాచార్య.

**డా. కోరాడ మహాదేవశాస్త్రి,** యం. ఏ., డి. లిట్.,
ఆంధ్రభాషాచార్యులు,
పి. జి. సెంటర్, అనంతపురం.

శ్రీ వేంకటేశ్వరస్వామివారు ఆంధ్రులకూ, దక్షిణదేశీయులకూ, భారతీయులకూ, హైందవప్రపంచానికీ ఇలవేల్పు. స్వామివారి దర్శన పూజాపునస్కారాలతో భక్తులు ముగ్ధులౌతారు; తరిస్తారు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారినిగూర్చి అనేకభాషలలో గ్రంథా లున్నాయి. ఆధునికాంధ్రకవులూ, రచయితలూ పెక్కు రచనలు చేశారు. రచనాజీవితారంభప్రక్రియ శతకరచననుంచి, సాహిత్య చరమ దశ అయిన నాటకం వరకు ఆంధ్రదేశంలోని అన్ని రచనాప్రక్రియలలో తమ ఇష్టదైవాన్ని కవులూ, రచయితలూ స్తుతించారు.

శ్రీ వేంకటేశ్వరా మకుటంతో, గానమాధుర్యంతో పద్నాలుగో శతాబ్దంలో వ్రాయబడ్డ శ్రీ వేంకటేశ్వర వచనాలూ, తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనలూ మొదలైన రచనలు, తాళ్ళపాకవారి కుటుంబంలోనివాళ్ళేకాక, పలువురు భక్తులు భగవన్నామసంకీర్తనం సంగీతసాహిత్యసమాశ్లేషంగా చేశారు.

"శ్రీ వేంకటాచల మాహాత్మ్యము" అనే ప్రస్తుతగ్రంథ రచయిత శ్రీ దుర్గయ్యశాస్త్రిగారు శ్రీనివాసదయాప్రేరితులై, శ్రీవేంకటేశ్వరస్వామి కథలన్నింటిని ఏరి, కూర్చి చక్కని గ్రంథం రచించారు. ఇందులో

స్వామివారు- పద్మావతీదేవి వివాహం, రంగదాసు జీవితం, తొండమన్నరపతి కథ, భీముని వృత్తాంతం మొదలుగా గల అనేక సన్నివేశాలు రసవత్తరంగా రచింపబడ్డాయి. భాష చక్కని గ్రాంథికం, శైలి సుగమం.

ఈగ్రంథరచనకు పూనుకొని కృతకృత్యులైన రచయిత శ్రీ దుర్గయ్యశాస్త్రిగారినీ, ఈగ్రంథం చదివీ, వినీ ఆనందించే ముముక్షువులను భగవానులు శ్రీ వేంకటేశ్వరస్వామివారు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధులతో అనుగ్రహించుగాక!

ఇతి శివం.

మద్రాసు
29—5—71

డా॥ కోరాడ మహాదేవశాస్త్రి.



# అంకితము



శ్రీ వేంకటేశ్వరస్వామి చరణాబ్జములకు.



కృతికర్త:
శ్రీ దుర్గయ్యశాస్త్రి.

సతీమణి:
శ్రీమతి వేంకటలక్ష్మి.

శ్రీః

శ్రీ గణేశాయ నమః

శ్రీ శారదాంబాయై నమః

# శ్రీ వేంకటాచలమాహాత్మ్యము.

పావనంబగు నైమిశారణ్యంబున శౌనకాదిమహామునులు ఒకపుడు లోకసంరక్షణార్థమై ద్వాదశవార్షిక సత్రయాగ మొనర్చుచుండిరి. ఆసమయంబున సకలపురాణకథాకథనసమర్థుండును, వ్యాసశిష్యుండును, రోమహర్షణసంజాతుండును, వినిర్మలధీసమన్వితుండును, ఉగ్రశ్రవసుం డను నామంబున ప్రసిద్ధుడగు సూతుండు విచ్చేసెను. అచటనుండు మునులందరును ప్రత్యుత్థానాభివాదనంబుల గౌరవించి, సముచితాసనంబునం దుపవిష్టుం గావించిరి. పిమ్మట స్కాందమందలి యనేక చరితంబు లాసూతునివలన వినుచు మును లిటు లనిరి. సూత మునీంద్రా ! నీవు సకలపురాణచరితంబుల నెరింగినవాడవు. భూతలంబున గల్గు పర్వతశ్రేష్ఠంబుల విశేషంబుల వినుట కుత్సుకులమై యుంటిమి. దయయుంచి వినుపించు మను వారి పలుకుల నాలకించి, యాసూతుం డామునుల కిట్లనియె. గంగాతీరంబునం దొకసమయంబున మీవలె నేనును అస్మద్గురువర్యుండగు వ్యాసమునీంద్రుం గాంచి, మీర లిపుడు నన్నడిగినటుల నేనును మద్గురువరుని ప్రశ్నించితిని. అంత నాతండు నాకెరింగించిన తెరంగున మీకు వినుపించెద. సావధానంబున వినుండు.

మున్నొకసమయంబున సురమునిశేఖరుండగు నారదుండు వివిధ మణిసంశోభితంబగు మేరుపర్వతశిఖరంబున కరిగి, అందు సకలరత్నప్రభాశోభితంబగు బ్రహ్మాలయముం గాంచెను. దాని కుత్తరభాగంబున వేయి యోజనంబుల యెత్తును, అంతకు రెట్టింపు విస్తీర్ణంబునుగల్గు అశ్వత్థవృక్షముం గాంచెను. ఆపిప్పలవృక్ష మూలంబున, నానారత్న

చ్ఛాయావిలసితంబును, సహస్ర మణిమయస్తంభసమలంకృతంబును, వైడూర్యముక్తామణివిరచిత స్వస్తికమాలికాలంకృతంబును, రత్నప్రభాశోభిత దివ్యతోరణ విభ్రాజితంబును, రత్నమయానేక మృగ పక్షిగణాభిరామంబును, పుష్యరాగద్వారశోభితంబును, వజ్రకవాటద్వయరమణీయంబును అగు దివ్యమంటపముంగాంచి, యందుఁ బ్రవేశించి, యందొక యుత్తుంగవైడూర్యవేదికపై నెక్కి యామంటపాంతర్భాగంబున మరియొక దివ్యమాణిక్యమంటపంబును, దానియం దొక మహోత్తుంగంబగు రత్నసింహాసనముం గాంచెను. అందు సహస్రనిశాకరప్రభాభాసురంబగు పద్మంబున సమాసీనుండును, పూర్ణచంద్రాయుతప్రభాభాసురుండును, కైలాసపర్వతాకారుండును, శంఖ చక్ర అభయ వరదహస్తంబుల శోభిల్లువాడును, పీతాంబరధరుండును, పుండరీకాయతేక్షణుండును, పూర్ణేందుసుందరవదనుండును, స్రుక్తుండుండును, స్రువనాసుండును, వపాగంధివదనాబ్జుండును, యజ్ఞమూర్తియు, క్షీరసాగరసంకాశుండును, కిరీటోజ్జ్వలశిరస్కుండును, శ్రీవత్సవక్షుండును, యజ్ఞోపవీతధారియు, కౌస్తుభమణివిద్యోతితుండును, మహోరస్కుండును, నానారత్నసువర్ణభూషణ భూషితుండగుట విద్యున్మాలావిరాజమాన శరన్మేఘసముజ్జ్వలుండును, పాదపీఠవిరాజమానవామపాదుండు నగు నాదేవదేవుం గాంచెను. పంకజాసనాది నవబ్రహ్మలును, ఇంద్రాద్యష్టదిక్పాలురును, గంధర్వ, విద్యాధర, కిన్నర, కింపురుషాది సురనికరంబులును, వసిష్ఠ, వామదేవ, మార్కండేయాదిమహామునులు సేవింప నొప్పుచున్న దేవదేవుంగాంచి, సాష్టాంగదండప్రణామంబు లాచరించి, ఉపనిషద్వాక్యంబుల బ్రస్తుతించి, యానారదుండు పరమానందభరితుండై యాజగదీశ్వరుని సన్నిధియందు నిలచియుండెను.

అంతలోన శ్రవణానందకరంబగు దుందుభిధ్వానంబొండు వినిపించెను. ఆవెనుక సరత్నరత్నాకర భాసుర దివ్యాంబరధారిణియు, ఉత్తుంగస్తనభారావనమ్రయు, దూర్వాదళశ్యామలాంగియు, సర్వా



భరణభూషితయు అగు భూదేవి, యిళా, పింగళ లనియెడు చెలిమికత్తియలంగూడి యచటికి విచ్చేసెను. ఆసఖురాండ్రచేఁ దేబడిన కుసుమవిసరంబును గైకొని యావరాహదేవుని పాదంబుల జల్లి నమస్కరించి, నిటలతటఘటితాంజలిపుటయై నిలువంబడియుండెను. దేవదేవుం డాభూదేవిం గాంచి, యానందభరితాంతరంగుండై యాలింగనం బొసంగి నిజాంకపీఠంబునం దాసీనం గావించి కుశలప్రశ్నపూర్వకంబుగా నిటులనియెను— దేవీ! సుఖావహంబగు శేషశీర్షంబుల నిను నిలిపి, నీయందు లోకంబును నిలిపి నీకు సహాయంబుగ భూధరంబుల నునిచి నేనిటకు వచ్చియుంటిని. నీవుగూడ నిటకు వచ్చితివేల యనుటయు నాభూదేవి యిట్లు వచించెను.

ఓ దేవా! నను నీవు పాతాళంబునుండి యుద్ధరించి, సహస్రఫణశోభితంబై రత్నపీఠంబునాఁ బ్రకాశించు శేషశీర్షంబుననిలిపి, మద్ధారణక్షమంబులును, పుణ్యప్రదంబులును అగు పర్వతంబుల నిలిపితివి. మదాధారభూతంబులగు నగంబుల నుత్తమంబు లేవియో వినుటకుత్సుకురాలనై యుంటినన నామె కిట్లని వరాహమూర్తి వచించెను. దేవీ! వినుము. మేరునగంబును, హిమవత్పర్వతంబును, వింధ్యాద్రియు, మందరకుధరంబును, గంధమాదనభూధరంబును, సాలగ్రామాచలంబును, చిత్రకూటగోత్రంబును, మాల్యవంతంబును, పారియాత్రకంబును, మహేంద్ర, మలయ, సహ్యధరాధరంబులును, సింహాచలంబును, రైవతంబును, మేరుసముద్భవంబై సువర్ణమయంబగు అంజనాచలంబును అను నివియన్నియు నీకాధారంబులగు పర్వతంబులు. ఓవసుంధరా! ఆనగోత్తమంబులన్నియు నాచేతను, మహర్షులచేతను సేవింపబడుచుండునవి. మరియు నీపర్వతంబుల ముఖ్యములగువానిం దెల్పెద వినుము. సాలగ్రామము, సింహాచలము. గంధమాదనంబును, ముఖ్యంబులు. ఈనగంబు లుత్తరదిగ్భాగంబు నాశ్రయించి యున్నవి. అరుణాచలంబును, హస్తిశైలంబును, గృధ్రాద్రియు ఘటకాచలంబు ననునవి

దక్షిణదిగలంకరణములు. ఈపర్వతంబులు క్షీరనదీసమీపగతంబులు. అందు హస్తిశైలంబున కుత్తరంబున పంచక్రోశపరిమితదూరంబున సువర్ణముఖరి యను నది ప్రవహించుచుండును. దాని కుత్తరతీరంబున కమలాఖ్యసరోవరం బొప్పుచుండును. తత్సరోవరంబున కుత్తరభాగంబున క్రోశద్వయమాత్రదూరంబున హరిచందనతరుసుందరంబగు కాననంబున సప్తయోజనవిస్తీర్ణంబును, ఏకయోజనోన్నతంబును, సువర్ణమయంబును, రత్నసానువిరాజితంబును అగు శ్రీవేంకటాచలంబను నొక పుణ్యనగోత్తమంబు విరాజిల్లుచుండెను.

అందు భక్తార్తినాశకుండును, శుకవరదుండు నగు శ్రీకృష్ణుండు బలభద్రసహితుండై వైఖానసగణంబులచే సేవింపబడుచుండును. ఇంద్రాదిదేవతాగణంబులును, వసిష్ఠాదిమహామునులును, సిద్ధసాధ్యులును, దైత్యదానవయక్షరాక్షసగణంబులును, రంభాద్యప్సరస్త్రీలును ఆభగవంతుని సేవించుచుందురు. గరుడులు, నాగులు, కిన్నరులు మున్నగువా రందరు నచట తపం బాచరించుచుందురు. ఇట్టివారలచే సేవింపబడుచుండు నదులును, సరోవరంబులును అనేకంబు లందు గలవు.

—: సర్వతీర్థంబుల నతిశయించిన స్వామిపుష్కరిణీతీర్థవర్ణనము :—

అందుత్తమంబులగు తీర్థంబుల దెల్పెద నాలింపుము. చక్రతీర్థము, దేవతీర్థము, ఆకాశగంగ, కుమారధారికాతీర్థము, పాపనాశనతీర్థము, పాండవతీర్థము, స్వామిపుష్కరిణి యను నివ్వేడుతీర్థంబులును నారాయణశైలంబునం దొప్పు తీర్థంబుల నుత్తమంబులు. అందును స్వామిపుష్కరిణి ప్రథమగణ్యంబై యున్నయది. దీనికి పశ్చిమంబున నీతోగూడ నేను నివసించుచున్నాడను. దక్షిణంబున జగత్పతియగు శ్రీనివాసుండు వసించియుండెను. ఈస్వామిపుష్కరిణి యొకటియే గంగాదిసకలతీర్థసమంబై యొప్పుచుండెను. ఇయ్యది ప్రపంచమునంగల తీర్థములన్నిటికిని స్వామిత్వము నొందియుండుటం జేసి సమస్తతీర్థంబులు



నీతీర్థంబును సేవింప, నీపర్వతంబు నాశ్రయించియున్నవి. అరువదియారుకోట్ల తీర్థంబు లీపర్వతంబు నాశ్రయించియున్నవి. అందారుతీర్థంబులు మిగులముఖ్యమైనవి. అని వచించు శ్రీవరాహమూర్తి పలుకులనాలకించి యాధరణీదేవి యిటులనెను. స్వామీ! ఇప్పర్వతంబునం దారుతీర్థంబు లుత్తమంబులని పలికితిరి. వాటియందు మునుకలిడినవారలకుం గల్గుఫలంబుల వినవలతుం దెల్పవే యన నాదేవదేవుం డిట్లువచించెను. వసుంధరా! సకలతీర్థవిరాజితంబగు నీనారాయణాచలమహిమంబును వివరింతు వినుము. దేవతలును, సనకసనందనాదిమహామునులును, కృతయుగంబునం దంజనాచలంబును, త్రేతాయుగంబున నారాయణనగవరంబును, ద్వాపరంబున సింహాశైలంబును, కలియుగంబున శ్రీవేంకటాచలంబును పరమేశ్వరనివాసంబులని వచించిరి. సహస్రయోజనాంతర్వర్తులై యున్నను, ద్వీపాంతరగతులై యున్నను, ఈపర్వతమునుద్దేశించి యాదిక్కుగ నిలువంబడి నమస్కరించువారలు సర్వపాపవినిర్ముక్తులై వైకుంఠము నొందగలరు.

దేవీ! ఈపర్వతంబున గల్గు నారుతీర్థంబుల విశేషములం దెల్పెద వినుము అందు మొదలింటిది కుమారధారికాతీర్థము. ఇందు పార్వతీనందనుండగు కుమారస్వామి దేవసేనాసమన్వితుండై శ్రీనివాసు నర్చించుచుండును. ఇందు సూర్యుండు కుంభరాశిగతుండై యుండు మాఘమాసంబున మఘానక్షత్రయుతంబగుపూర్ణిమయందు మధ్యాహ్నకాలంబున స్నానమాచరించినవారలకు గంగాదిసర్వతీర్థంబుల బన్రెండువత్సరంబులు స్నానమాచరించినఫలము గలుగును. మరియు నీతీర్థంబునం దన్నప్రదానంబును సదక్షిణాకంబుగ నొనరించినవారలు నట్టి ఫలము నొందగలరు.

రెండవది తుంబతీర్థము. ఇందు భాస్కరుండు మీనరాశిగతుండై యుండ, ఫాల్గునమాసంబునం దుత్తరాఫల్గునీనక్షత్రయుక్తంబగు

పూర్ణిమయందు స్నానమొనర్చినవార లెన్నండును గర్భనరకంబు నొందకుందురు.

మూడవయది ఆకాశగంగాతీర్థము. ఇందు నాదిత్యుండు మేషగతుండై యుండు చైత్రమాసంబున చిత్రానక్షత్రయుక్తంబగు పూర్ణిమయందు ప్రాతఃకాలంబునం దవగాహన మొనరించువారలు మోక్షము నొందగలరు.

నాల్గవది పాండవతీర్థము. ఇందు దివాకరుండు వృషభరాశిగతుండగు వైశాఖమాసంబున శుక్లపక్షమునంగాని, కృష్ణపక్షమునంగాని, పుష్యమీనక్షత్రముతోడగాని, హస్తానక్షత్రముతోగాని కూడియున్న ద్వాదశీభానువాసరమందైనను, కృష్ణపక్షమున ద్వాదశీమంగళవాసరంబునందైనను స్నానమాచరించినవార లిహలోకదుఃఖంబుల న్విడనాడి పరలోకమునం దఖండసౌఖ్యంబుల నొందగలరు.

పాపనాశనతీర్థ మైదవయది. ఇందు శుక్లపక్షమునగాని, కృష్ణపక్షమునగాని పుష్యమీనక్షత్రముతోగాని, హస్తానక్షత్రముతోగాని కూడిన సప్తమీభానువాసరంబున స్నానమాచరించినవారలు కోటిజన్మార్జితంబులగు పాపములవలన విడువంబడినవార లయ్యెదరు.

ఆరవయది దేవతీర్థము. ఇందొక పరమరహస్యము కలదు. వినుము. మదీయాలయంబున కుత్తరదిగ్భాగంబునందలి శిఖరంబునం గల్గు గహ్వరంబునం దీదేవతీర్థ మున్నయది. అయ్యది తటాకరూపంబున నతిరమణీయమై యుండును. అందు పుష్యమీనక్షత్రసంయుతంబగు గురువాసరంబునగాని, వ్యతీపాతయోగంబునగాని, శ్రోణానక్షత్రసమన్వితంబగు సోమవాసరంబునగాని స్నాన మొనరించువారలు జ్ఞానాజ్ఞానకృతంబులగు సమస్తపాతకంబుల న్విడి యఖండపుణ్యంబునొంది యీలోకంబున దీర్ఘాయుర్దాయవంతులై పుత్రపౌత్రాదిసకలశ్రేయ



స్సంపన్నులై యంతమున స్వర్గసౌఖ్య మనుభవించి పిదప చంద్రలోకమునం దమందానందభరితులై యొప్పుచుందురు.

మునిశేఖరులారా! భూదేవి యిట్లు వరాహమూర్తివలన షట్తీర్థమాహాత్మ్యము న్విని ప్రీతిప్రవణమానసయై యమ్మహాత్ము నభినుతింపదలంచి యిట్లు నుతించెను.

—: భూదేవీకృతవరాహస్తుతి :—

శ్లో॥ నమస్తే దేవదేవేశ! వరాహవదనాచ్యుత ।
క్షీరసాగరసంకాశ! వజ్రశృంగమహాభుజ ॥
ఉద్ధృతాస్మి త్వయా దేవ కల్పాదౌ సాగరాంభసః ।
సహస్రబాహునా విష్ణో ధారయామి జగన్త్యహమ్ ॥
అనేకదివ్యాభరణ యజ్ఞసూత్రవిరాజిత ।
అరుణారుణాంబరధర దివ్యరత్నవిభూషిత ॥
ఉద్యద్భానుప్రతీకాశ పాదపద్మ నమో నమః ।
బాలచంద్రాభదంష్ట్రాగ్ర మహాబలపరాక్రమ ॥
దివ్యచందనలిప్తాంగ తప్తకాంచనకుండల ।
ఇంద్రనీలమణిద్యోతి హేమాంగదవిభూషిత ॥
వజ్రదంష్ట్రాగ్రనిర్భిన్న హిరణ్యాక్ష మహాబల ।
పుండరీకాభిరామాక్ష సామస్వన మనోహర ॥
శ్రుతిసీమంతభూషాత్మ న్సర్వాత్మంశ్చారువిక్రమ ।
చతురాననశంభుభ్యాం వందితాయతలోచన ॥
సర్వవిద్యామయాకార శబ్దాతీత నమో నమః ।
ఆనందవిగ్రహానంత కాలకాల నమో నమః ॥

ఈవిధంబున నుతించుచు పాదాబ్జంబుల వ్రాలియుండు భూదేవిని లేవనెత్తి యాలింగన మొనర్చి, యామె ముఖాబ్జము నాఘ్రాణించి వామాంకంబునం దాసీనం గావించి గరుడవాహనారూఢుండై నార

దాదిమహామునులు సన్నుతించుచుండ వృషభాచలంబున కరిగి యందు స్వామిపుష్కరిణీతీరంబునకు పశ్చిమభాగంబునందలి దివ్యక్షేత్రంబున బ్రవేశించి యచ్చట చతురాననసములగు వైఖానసవర్యులచే పూజింపబడుచు నివసించియుండెను.

సూతా! ఇదియంతయు నారదుండు కనులార గాంచి యొకపుడు మునిసంఘంబున వివరముగ దెల్పుచుండ నేనును వినియుంటిని. నేను వినిన తెరంగున పర్వతమహిమంబును నీకు వినుపించితినని పలుకుచు వ్యాసమునీంద్రుండు నాకెరింగించి మరియు పరమపావనంబగు మన సంవాదరూపంబగు నీచరితంబును దేవసన్నిధియందుగాని, బ్రాహ్మణ సన్నిధానమునగాని సకలవర్ణములవారలు వినుచుండ నెవరు పఠింతురో వారలు పుత్రపౌత్రాది సర్వసంపత్సమన్వితులై ప్రతిష్ఠ నొందగలరు. వినువారలు స్వాభీష్టసిద్ధినొందెదరు.

ఇట్లు సకలమునిసేవితుండు నస్మద్గురువరుండు నగు వ్యాసమహర్షి వలన నేను వినిన తెరంగున మీకు వినుపించితి ననియెడు సూతుని పలుకుల నాలకించి సంప్రీతమానసులై మును లిటులనిరి. సూత మునీంద్రా! పర్వతంబులన్నిట నుత్తమంబగు శేషాచలంబును తదీయంబగు మోక్షప్రదాయక వృత్తాంతంబును వివరించి మమ్ముల నానందాబ్ధి నోలలాడించితివి. వరాహమూర్తి ధరణీసమన్వితుండై వృషభాచలంబునం దెటులుండెనో వినుట కుత్సుకులమై యుంటిమన సూతుం డిటులనియె.

—: శ్రీవరాహమంత్రారాధనవిధానము :—

మునిచంద్రులారా! పురాతనంబగు నొకకథను వినుపించెద వినుడు. మున్ను కృతయుగంబున వైవస్వతమన్వంతరంబున నారాయణాద్రియందు నివసించియున్న దేవదేవుండును, రక్తపద్మాయతేక్షణుండును అగు యజ్ఞవరాహమూర్తిం గాంచి, యవ్విశ్వంభరాదేవి సఖీపరి



వృతయై నమస్కరించి దేవా! ఏమంత్రంబున నీవారాధింపంబడి సర్వాభీష్టప్రదుండ వగుదువో యట్టి భవత్ప్రియంబును జపించువారలకు సర్వసంపత్తి కారకంబును వలయువారలకు పుత్రపౌత్రప్రదంబును, సార్వభౌమపదప్రాపకంబును, అవసానంబున త్వత్పదప్రాప్తిసాధనంబు నగు మంత్రరాజం బెద్దియో తెలియజేయుమన నతం డిటులనియెను. దేవీ! 'ఓం నమ శ్శ్రీవరాహాయ ధరణ్యుద్ధరణాయ స్వాహా' యనునది మంత్రరాజము. ఇయ్యది పరమగోప్యము. సద్యస్సంపత్తికారకంబును, పుత్రపౌత్రప్రదంబును, భూమిప్రదంబునై యొప్పుచుండు. నియతాత్ముండును, శుశ్రూషాపరాయణుండు నగు భక్తుల కుపదేశింపనగును. కాని యన్యుల కప్రకాశ్యమై యుండవలయును. ఈమంత్రరాజమునకు ఋషి సంకర్షణుండు; దేవతను నేన; ఛందస్సు పంక్తి; శ్రీం అనునది బీజము.

ఈమంత్రంబును సద్గురూపదేశంబున బడసి నాలుగులక్షల మారులు జపించవలయును. మధుఘృతసమన్వితంబగు పాయసాన్నంబును హోమము గావింపవలయును. మనశ్శుద్ధిప్రదాయకంబగు ధ్యానంబు విధానంబును వినుము. శుద్ధస్ఫటికసంకాశునిగా, రక్తపద్మదళాయతేక్షణునిగా, చతుర్బాహుసమన్వితునిగా, మణిమయ కిరీటవిభ్రాజమానునిగా, సౌమ్యునిగా, శ్రీవత్సాంకితవక్షస్థలునిగా, శంఖచక్రాభయకరాబ్జునిగా, రక్తపీతాంబరధరునిగా, రత్నాభరణభూషితునిగా, శ్రీకూర్మపృష్ఠమధ్యంబునందలి శేషతల్పమునందలి సరసీరుహామునం దుపవిష్టునిగా, వరాహవదనునిగా, త్వద్విభూషితవామోరుస్థలునిగా నను ధ్యానించుచు ప్రతిదినంబునను నూటయెన్మిదిమారు లీమంత్రమును జపించవలయును. అట్టివారలు సర్వాభీష్టంబులనొంది యంతంబున మోక్ష మందగలరు. ఇట్లు మంత్రప్రభావంబును విని, యోదేవా! మున్నీమంత్రము నెవ్వ రుపాసించిరి? వారలెట్టిఫలంబు నొందిరో తెలుపు మన నమ్మహాత్ముం డిట్లనియె.

ఓధరణీరమణీ! మున్ను కృతయుగంబున ధర్ముండను నొకమనువు

బ్రహ్మవలన నిమ్మంత్రముంబడసి యీపర్వతంబున యథావిధిగ జపించి నను సందర్శించి వలయు వరమ్ముల బడసి మామకంబగు పదంబునొంది విలసిల్లె. సురాధిపుండు దుర్వాసుని శాపకారణంబున త్రివిష్టపభ్రష్టుండై యిమ్మంత్రప్రభావంబునంజేసి మరల సురలోకరాజ్యం బేలువాడయ్యె. మహర్షు లనేకులీమంత్రంబును జపించి పరమపదంబు నొందిరి. పూర్వకాలంబున పన్నగాధీశుండగు ననంతుండు కశ్యపునివలన నిమ్మంత్రంబును వడసి శ్వేతద్వీపంబున జపియించి ధరణీభారవహనసమర్థుం డయ్యె. అనుటయు నాభూదేవి యిటులనియె. దేవా! జగత్పతియగు శ్రీనివాసుండు శ్రీభూమీసహితుండై వేంకటాచలంబున కెపు డరుదెంచె? కల్పాంతస్థాయిగా నిప్పర్వతం బెటులుండె? నాచరితంబు విన గుతూహలంబుగలదాన ననుటయు నవ్వరాహదేవుం డిటులనియెను.

—: అగస్త్యముని ప్రార్థనచే భగవంతుండు సకల జనులకు దృగ్గోచరుండగుట :—

దేవీ! పావనంబగు పురాతనవృత్తాంతమును వినుము. పూర్వము కృతయుగంబునందు వైవస్వతమన్వంతరంబునం దీపర్వతంబున వాయుదేవుండు మహత్తరంబగు తపం బాచరింప నందులకు మెచ్చి వరం బీదలంచి శ్రీనివాసుండు శ్రీభూమీసహితుండై యిందలి స్వామిపుష్కరిణీతీరదక్షిణభాగంబున ఆనందాఖ్యవిమానంబున వసించియుండె. అదిమొదలుగ కుమారస్వామిచే సేవింపబడుచు నితరుల కగోచరుండై యుండును. అంత గొంతకాలంబున కగస్త్యముని యటకు చనుదెంచి యాదేవదేవు నుద్దేశించి పండ్రెండు వత్సరంబు లారాధింప నాపరమేశ్వరుండు ప్రత్యక్షంబగుడు సాష్టాంగనమస్కారపూర్వకంబుగా నుతులొనరించి యిటులనియె. మహాత్మా! నీయారాధనంబు జనులందరకును సుకరంబగునటుల నీవెపుడును దృష్టిగోచరుండవై యుండు మిదియ నా ప్రార్థన యన పరోపకారపారీణుండగు కలశసంభవుని యుద్యమంబునకు మెచ్చి హృషీకేశుం డిట్లనియె. మునివర్యా! నీనిమిత్తంబున నిదిమొద



లుగ నీనగవరంబున సకలజనులకును దృశ్యుండనై యాకల్పాంతముగ నివసించియుండును. ఇవ్విమానముమాత్ర మెవరికిని గోచరింపకుండును. అందుల కయ్యగస్త్యముని సంప్రీతుండై స్వాశ్రమంబున కరిగె. అదిమొదలుగ నిప్పర్వతంబున జతుర్భుజుండగు శ్రీనివాసుండు సకలనయనగోచరుండై వాయువుచేతను కుమారస్వామిచేతను సేవింపంబడుచు పరమముని చింత్యంబగు విమానవరంబున నివసించియుండెను.

—: మిత్రవర్మకు ఆకాశరాజు అను సుతు డుద్భవించుట :—

ఇట్లు చిరకాలం బతిక్రమింప నిరువదెనిమిదవద్వాపరాంతమున భారతయుద్ధము పరివర్తిల్లిన వెనుక కలియుగంబున శకప్రవర్తకులగు విక్రమార్కశూద్రకాదిమహారాజు లనేకులు గతించినపిమ్మట తుండీరమండలంబునందలి నారాయణపురంబున చంద్రవంశమున మిత్రవర్మ యను మహారా జుద్భవించును. ఆతండు సర్వసంపత్సమన్వితుండై మహారథుండై యొప్పుచుండ ఆతనిరాజ్యకాలంబున భూమి దున్నకయ సర్వసస్యసమన్వితయై యుండెడిది. ఈతిబాధ లెవరును యెరుంగకుండిరి. ఆతనిపాలనంబు సర్వజనసుఖాకరంబై ధర్మనిలయంబై యొప్పుచుండ ఆనరనాయకున కతిసౌందర్యవతియు, సుగుణాలవాలయు, పాండ్యరాజపుత్రికయు నగు మనోరమ భార్యయైయుండ కొంతకాలమున కాసాధ్వియం దాకాశరాజు నామకుండగు పుత్రకుం డుద్భవించును. ఆబాలకుండు శుక్లపక్షసుధాకరునిమాడ్కి ప్రవర్ధమానుండై యుత్తమగుణాన్వితుండై యుండ గాంచి రాజ్యభారము నాకుమారునియందు మోపి మిత్రవర్మ తపోవనంబున కరిగి తపంబొనరించి బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండగును.

—: ధరణీతలంబునుండి పద్మావతీసముద్భవవృత్తాంతము :—

పిమ్మట నయ్యాకాశరాజు సార్వభౌముండై యేకపత్నీవ్రతుండై ధరణీసక్తచిత్తుండై రాజ్యపాలనం బొనర్చుచుండ గొంతకాలంబు

గతించిన వెనుక నొకయాగం బొనరింపదలంచి భూమిని దున్నించి బీజావాపం బొనరించు సమయంబునం దొక కన్నియ ధరణీతలసముద్గతయై పద్మశయ్యాగతయై తప్తజాంబూనదప్రభాభాసురయై సముద్భవింప పుత్రికామోహంబున నాకన్యకామణిం గాంచి యమ్మహీపాలుండు విస్మయాక్రాంతమానసుండై మమకారంబున నాబాలిక నెత్తికొని సారెసారెకు ముద్దాడుచు నానందించుచుండ నశరీరవాక్కు లిటు వినబడెను. రాజా! ఇక్కన్నియ నీయదియ. దీనిం గైకొని పాలనంబొనరించుము. ఆపలుకుల నాలకించి సంతసంబున స్వపురంబున కరిగి భార్యయగు ధరణీదేవిం బిలచి సుందరీ! దేవదత్తయై భూతలసముద్గతయై నాకు లభించిన యిక్కన్నియం గాంచుము. సంతానరహితులమగు మనమిక్కన్యచే సంతానవంతులమైతిమి. ఇక్కన్యం గైకొనుమని యామె చేత నిడినం గైకొని యంతిపురంబున కరిగి పరమానందభరితయై యుండె.

—: ఆకాశరాజునకు ధరణీదేవియందు వసుదానోత్పత్తి :—

అటుపిమ్మట కొంతకాలంబున కాధరణీదేవియు గర్భవతియైయుండ గాంచి తరుణీ! మనసంతానలత ఫలించినదని పలుకుచు నానందభరితాంతరంగుండై యుండ నవమాసంబులు గతించినవెనుక నొక శుభసమయంబున గ్రహంబు లైదుచ్చస్థానంబులనుండ సూర్యుండు మేషరాశిగతుండై యుండ ధరణీదేవి సత్పుత్రుం గనియెను. ఆసమయంబున దేవదుందుభులు మొరసెను. ఆకసమునుండి పూలవాన గురియజొచ్చెను. వాయువు సుఖకరంబుగ వీచుచుండెను. అపు డమ్మహారాజు ఛత్రచామరవర్జితంబులగు సమస్తదానంబుల నొనర్చెను. కపిలాదానంబులును, వృషభదానంబులు ననేకంబుల నొనరించెను. ఇట్లు పుత్రోత్సవంబు నిర్వర్తించి పండ్రెండవదివసంబునం దతివైభవముగ నామకరణోత్సవం బొనరించి వసుదానుం డను నామంబిడియె. శుక్లపక్షసుధాకరునిమాడ్కి ప్రవర్ధమానుండగు తనయునకు యుక్తకాలంబున



వేదవిదులగు విప్రోత్తముల రావించి యతివైభవంబుగ నుపనయనం బొనరించి సమంత్రకంబుగ దనశస్త్రాస్త్రంబుల నభ్యసింపజేసెను. ఇట్లు చతుష్పాదంబగు ధనుర్వేదంబంతయు నభ్యసించి సకలకళాప్రవీణుండై మహాబలపరాక్రమసంపన్నుండై యుండు కుమారునింగూడి యయ్యాకాశరాజు గ్రీష్మకాలమధ్యాహ్నమార్తాండునివలె శత్రులకు నిరీక్షించుటకైనను శక్యముగానివాడై ప్రకాశించుచుండెను. అన విని యాభూదేవి వరాహదేవున కిటులనియె.

—: ఉద్యానవాసిని యగు పద్మావతీసమీపంబునకు
నారదముని వచ్చుట :—

నాథా! ఆకాశరాజపుత్రుని నామమును వినుపించితివి. ఆతని యయోనిసంజాతయగు పుత్రికనామంబునుగూడ వినుపింపు మన నా వరాహదేవుం డిటులనియె— మతిమంతుండగు నయ్యాకాశరాజు కమలేక్షణయు, పద్మశయ్యాగతయు, నయోనిసంభవయు నగు నక్కన్యకు పద్మినియని నామకరణం బొనరించెను. ఆపద్మిని క్రమంబుగ యౌవనవయోవిశిష్టయై యొకనాడు సఖీపరివృతయై కోకిలాలాపనాదితంబగు సుందరోద్యానంబున విహరించుచుండ దైవవశంబున నారదుం డటకు విచ్చేసి సాక్షాద్వనలక్ష్మియనం బరగు నక్కాంతామణిం గాంచి యిటులనియెను. ఓబాలామణీ! నీవెవరవు? నీతండ్రిపే రెయ్యది? నేనొకసాముద్రికశాస్త్రపారంగతుడను. నీకం దభిలాష యుండెనేని నీకరతలముల జూపుము. ఫలముల దెల్పెద నన నక్కన్య తనచరితంబును తెలియబల్కి తనహస్తము నామునికి జూపి ఫలముల నెరిగింపుమన నమ్మునిచంద్రుం డిటులనియెను. బాలికామణీ! నీశరీరలక్షణంబులను వాటిఫలంబులను వినుపింతు వినుము. నీపాదంబులు రక్తాబ్జంబులపగిది నొప్పుచున్నవి. పాదాంగుళులు సమంబులై యరుణకాంతుల జిమ్ముచు రక్తతుంగనఖాన్వితంబులై యున్నవి. గుల్ఫంబులు గూఢములై

యున్నవి. జంఘలు రోమరహితంబులుగా నున్నయవి. జానువులు సమంబులై స్నిగ్ధంబులై యున్నవి. ఊరుయుగంబు క్రమపరివృద్ధంబై యందమొందుచున్నది. పిరుందులు వృథులంబులై పీనంబులై వెలయుచున్నవి. జఘనము సుస్నిగ్ధముగానున్నది. నాభియు లోతుగా గుండ్రముగా నున్నది. పార్శ్వములు బలసియున్నవి. నడుము త్రివళీవిరాజితంబై రోమరాజింగూడి భాసిలుచున్నది. స్తనయుగము మగ్నచూచుకంబై సుస్నిగ్ధంబై యున్నతంబై ప్రకాశించుచున్నది. కరంబులు రక్తాబ్జసమంబులై పద్మరేఖాసమన్వితంబులై రక్తపర్వయుతంబులై సమాంగుళ్ళులై శుకతుండాకారనఖాన్వితంబులై యొప్పుచున్నవి. బాహువులు దీర్ఘములై కోమలములై పూలదండలమాడ్కి జెలువారుచున్నయవి. పృష్ఠము వేదివలె నొప్పుచున్నది. కంఠము దీర్ఘమై రక్తవర్ణయుతంబై ప్రకాశించుచున్నది. భుజమూపురంబు లవనతంబులై యుండెను. మోము ప్రసన్నమై నిష్కళంకసుధాకరుచందంబున బ్రకాశించుచున్నది. కపోలంబులు నిర్మలంబులగు నద్దంబుల ధిక్కరించుచుండెను. కర్ణంబులందలి రత్నకుండలంబుల కాంతులు లాకపోలంబులకు మరింత వన్నె వెట్టుచుండెను. నాసిక నువ్వుపువ్వు నధఃకరించుచుండె. ఫాలము నీలాలకశోభితంబై యష్టమీచంద్రునిరీతి నొసగుచుండె. మూర్ధము సమవృత్తమై నునుపై దీర్ఘములైన శిరోజంబులతో బ్రకాశించుచున్నది.

బాలామణీ! ఈలక్షణంబులం బరికింప నీవాజగత్పతియగు మహావిష్ణువునకు తగినదానవని నాహృదయము నొక్కి చెప్పుచున్నయది. దక్షిణావర్తమగు నీనాభి గంగాజలావర్తముభాతిగ నున్నది. నీవు పాలకడలియం దుద్భవమందిన కమలాలయవలె నాకండ్లకు గన్పడుచుంటివి. ఇట్లు వచించి యూరకుండునంత నామెయు సఖురాండ్రును మునివరు నర్చింప మారువలుకకయే యంతర్ధానంబు నొందెను. అపు డాచెలిమికత్తె లాపద్మినిం గాంచి యిపుడు వసంతాగమంబై యున్నది. కర్ణి



కార, చూత, చంపక, పారిభద్రక, పాటల, రక్తాశోక, కరవీరాదివృక్షములును, కుంద, మాలతీయూథికాదిలతావితానంబులును, చక్కగపుష్పించి నయనానందకరంబుగా నుండెను. మనమందరముం గూడి యుద్యానంబున కరిగి పూవుల గోసికొంద మన సఖీగణపరివృతయై యప్పద్మిని పుష్పాటవికిం జని, యందు మనోహరంబు లగు వివిధకుసుమంబుల గోయుచు విహరించుచుండిరి. ఆ సమయంబున శుభ్రదంతద్వయరాజితంబును, మదజలపూరితగండద్వయభాసురంబును, మహోన్నతంబు నగు నొకగజేంద్రము కరేణుయూథసమన్వితంబై యచటకు వచ్చెను. ఆగజరాజుం గాంచి యయ్యువిద లందరును భయము నొంది, పరుగిడిపోయి యటనుండు నొక మహోన్నతవృక్షమూలమునం జేరిరి.

—: శ్రీనివాసుండు వేట నెపంబున పుష్పాటవిం జేరుట :—

అంత నిష్కళంక చంద్రధవళకాంతివిరాజితంబును, జాంబూనద భూషణభాసురంబును అగుచు ఉచ్చైశ్శ్రవంబునా బరగు నొక యశ్వంబు నధిష్ఠించి మృగయాసక్తచిత్తుం డగు నొక పురుషోత్తముం డొక మృగంబును వెన్నంటి దరుముచు నటకు విచ్చేసెను. మారసుందరాకారుండును, నవనీరజదళభాసురకర్ణాంతాయతలోచనుండును, పద్మరాగమణిమయకుండలాలంకృతుండును, రత్నఖచితశార్ఙ్గధనుర్ధరుండును, పీతాంబరధారియు, మణిమయకంకణకేయూరకటిసూత్రవిరాజితుండును, శ్రీవత్సాంకితవిశాలోరస్కుండును, స్వర్ణయజ్ఞోపవీతుండు నగు నప్పురుషుం గాంచి, విస్మయాక్రాంతమానసలై యుండిరి. ధనుర్బాణధరుండై హయారూఢుండై వచ్చు నాపురుషుం గాంచి యానగేంద్రము భయమంది, తుండము నెత్తి ఘీంకార మొనరించుచు శీఘ్రగమనంబున మరియొక వనంబునకుం బోయెను. అంత నమ్మహానుభావుం డాయువిద లున్నయెడకుం జనుదెంచి యో బాలికామణులారా! ఇట కేదేని యొక మృగంబు వచ్చెనా? మీ రెరింగిన దెల్పుం డన వార లందరును మే మెరుంగ మని వచించి ఓనిషాద

నాయకా! నీ వియ్యరణ్యంబున కేలవచ్చితివి? ఇవ్వన మాకాశ రాజపాలితము. ఇచటి మృగంబుల నెవరును వధింపరాదు. సత్వరంబుగ నిందుండి వెడలుము. ఆలసించిన నపాయము వాటిల్లు నని వారలు పలుక నాతండు హయావరోహణ మొనరించి యో సుందరులారా! మీర లెవరు? మీలో సుందరవదనారవిందయు, ఉత్తుంగపీనపయోధరయు, సరోజసన్నిభయు నగు నిక్కన్నియ యెవరు? వివరముగ తెలియజేయుం డను నాతని పలుకుల నాలకించి, యాపద్మిని తన చెలిమికత్తె నొకతెను బ్రేరేపింప నది యిటులనియె- అయ్యా! ఈమె ఆకాశ రాజపుత్రిక; అయోనిసంభవ; భూమియం దుద్భవమందినది. ఈమె పేరు పద్మిని; మాకు నాయికయై యున్నది. మహాత్మా! నీనామ మెయ్యది? మీతండ్రి యెవ్వరు? ఏజాతివాడవు? నివాస మెయ్యది? ఇవ్వనంబున కేలవచ్చితి వని యడుగ, నాతండు దాని కిట్లనియె- ఓ వనితా! మాది సూర్యకులం బని పెద్దలు చెప్పుచుందురు. ఎవని చక్రము బ్రహ్మద్వేషు లగు సురారులకు భయంకర మగునో, యెవ్వని శంఖధ్వని స్వనినంతనే రిపుచయంబు మూర్ఛనొందునో, యెవని చాపంబున కీడగు చాపము సురలోకంబునం దెవ్వనికైన లభింపదో, యెవ్వండు పావనంబు లగు ననంతనామకలితుండో యట్టి వీరపతి యగు కృష్ణుం డని యార్యులు నను చెప్పుచుందురు. నానివాసము వేంకటాచలము. అందుండియే యీనిషాదానుచరులం గూడి యొక మృగంబు వెంట దగిలి యివ్వనంబు జొచ్చితిని. నాచే దరుమంబడి యొక మృగంబు వాయువేగంబున నిందులకు వచ్చుటం గాంచి, దాని నెమకుచు నిందుల కరుదెంచితిని. ఆమృగం బెటుబోయెనో కానరాకున్నది. ఈసుందరాంగియందు నాచిత్తము లగ్నమై యున్నది. నాకీసుందరి లభ్యమగునే యనునంత నాసుందరు లందరు నాగ్రహమంది, ఓయీ! ఇట్టి యసందర్భప్రలాపము లేల బల్కెదవు? ఆకాశరాజున కీవృత్తాంతము వీనుల సోకిన నిను శృంఖలాబద్ధుం గావించి గొంపోవును. ఆలసింప కిటనుండి పొమ్ము. అనియెడు నయ్యువిదల పలుకుల న్విని, భీతి



నొందినవాని తెరంగున హయంబు నధిష్ఠించి, తన యనుచరులం గూడి వేంకటాచలంబున కరిగెను.

-: పద్మావతీదర్శనంబునం జేసి శ్రీనివాసుండు మోహవివశుం డగుట :-

ఓధరారమణీ! శ్రీనివాసుండు నయ్యశ్వంబునుండి దిగి, తన కనుచరులగు కిరాతరూపధరులైన విబుధుల న్వీడనాడి, మణిసోపానవిరాజితంబగు మణిమండపంబున బ్రవేశించి, పంచకక్ష్యల నతిక్రమించి ముక్తాగృహంబునం బ్రవేశించి యందు నవరత్నఖచితంబగు తూగుటుయ్యెలయందలి హంసతూలికాతల్పంబున నొరగి యవశుండై- పద్మదళాయతేక్షణయుఁ దనుమధ్యయుఁ బీనపయోధరయు, మందస్మితసుందరముఖారవిందయు నగు నప్పద్మావతిని మనంబున ధ్యానించుచు, ఆమెను పాల్కడలిం బుట్టిన మహాలక్ష్మిగా భావించుచు, తల్లగ్నచిత్తుండై, మోహపరవశుండై శయనించి యుండె. అంత మధ్యాహ్నకాలం బగుడు పద్మావతి, పద్మపత్రి, పద్మరేఖ యను సఖులం గూడి వకుళమాలిక యను నామె మిగుల రుచికరంబులును, సుగంధయుతంబులు నగు పంచభక్ష్యపరమాన్నంబులం గైకొని, యా శ్రీనివాసుని భోజనంబునకై బిలువ నెంచి, సఖురాండ్రను ద్వారదేశంబున నుండ నియమించి, తానొక్కతెమాత్ర మమ్మహాత్ముండు శయనించిన తూగుటుయ్యెలచెంత కరుదెంచి, యందు నిమీలితనేత్రుండై, ధ్యాననిమగ్నమానసుండై యున్న దేవదేవుం గాంచి, పదము లొత్తుచు, మందస్మితాననయై యిటు లనియెను.

దేవా! ఇంకను పరుంటివేల? లెమ్ము. భోజనంబునకు వలయు రుచికరంబు లగు పదార్థంబుల సిద్ధము గావించితిని. భోజనం బొనరింపగ రమ్ము. సకలలోకార్తిహరుండ వగు నీవుగూడ నార్తునివలె బరుంటివేల? మృగయావినోదంబున కరిగినపు డేమికనుగొంటివి? నీయవస్థం గనుంగొనఁ గాముకునివలె గన్పట్టుచుంటివి. అచట దేవకన్యం గాని,

మానవకన్యం గాని, నాగకన్యం గాని గాంచితివా ? అట్లగునేని నీమనోహారిణియగు నాపూఁబోఁడిని నా కెఱుగం బలుకుము. అనుటయు నాతండు నిట్టూర్పుల నిగుడించుచు నూరకుండిన, విడువక యావకుళమాలిక- దేవా! నిన్నిటుల మదనవేదనాపరతంత్రుని గావించిన యామెను జెప్పకుంటివేల యని మరలమరల నడుగుటయు, నాతం డిటులనెను.

—: శ్రీనివాసునిచే దెలుపంబడిన పద్మావతీపరిణయకారణములు :—

ఓవకుళమాలికా! పుణ్యప్రదం బగుఁ ద్రేతాయుగంబున, దశకంఠుని సంహరించితిని. ఆతఱుణంబున వేదవతీకన్య సీతకు మహోపకార మొనరించినయది. ఆవృత్తాంతంబును వినుపించెద. సావధానముగ వినుము- నేను రాముండనై యవతరించితి. లక్ష్మి భూమినుండి యుద్భవించి, జనకపుత్రియై సీత యను నామంబున బ్రసిద్ధిం గనెను. నేను నాసతి యగు సీతయు నాయనుజుం డగు లక్ష్మణుండును వనవాస మొనర్చుచు పంచవటీప్రదేశంబున నుండు నవసరంబున రావణప్రేరితు డగు మారీచి యను రక్కసుండు మృగరూపంబున మోసముం జేయ వానిని వధింపగ నేను బోతిని. ఆవెనుక సీతాప్రేరితుండై నాయనుజుండును నానికటంబునకు వచ్చెను. అయ్యవకాశముం గాంచి, దశవదనుండు సీతాపహరణమున కుద్యుక్తుం డయ్యెను. అంతకు ముందుగనే యగ్నిహోత్రగతుం డగు వహ్ని రావణుని యుద్యమం బెఱింగి, జనకపుత్రిం గైకొని, పాతాళంబున కేగి యందుండెడు స్వాహాదేవియొద్ద నునిచెను. మున్ను రావణునిచే తాకంబడి వానిని వధింపఁ దనయందు బ్రవేశించియున్న వేదవతిని సీతగా నొనర్చి, పర్ణశాలయం దుంచిన నామెయే సీత యని తలంచి, రావణుం డామెను హరించి, లంకాపట్టణాభ్యంతరమున నునిచె. నేను రావణసంహార మొనరించినపిమ్మట నావేదవతి యగ్నిం బ్రవేశించెను. అనలుండు సీతం గొనితెచ్చి, నాకొసంగి, వేదవతిం గూర్చి యిటుల బల్కెను.

ఓ దేవా! ఈ వేదవతి సీతానిమిత్తంబుగ రావణునిచే లంకాపట్ట



ణంబున బందీకృత యయ్యె. సీతాప్రియకారిణి యయ్యె గావున నీవేదవతికి భర్తవై రక్షింపు మనియె. ఆపలుకుల నాలకించి జానకియును సంతసమంది నన్నుం గాంచి, యోనాథా! నాకుపకార మొనరించి ప్రాణదాన మొసంగిన యీయామె ననలుండు వచించిన తెఱంగున నీమె పాణిగ్రహణం బొనరించి సంతసింపజేయు మన, నాశ్రీరాముం డిటు లనియె.

ఓకాంతామణీ! ఇర్వదెనిమిదవ ద్వాపరయుగాంతంబున సంభవించు కలియుగంబున నీకోరిక నెరవేర్చెదను. అంతదనుక యీ వేదవతీకన్య బ్రహ్మలోకంబున సురమునినికరంబులచే నర్చింపంబడుచు, కలియుగంబున భూతలసంజాతయై, యాకాశమహారాజునకు పుత్రికయై పద్మావతీనామంబున బ్రసిద్ధయై యున్నది. ఆకన్నియ తన కనురూపలగు చెలిమికత్తెలం గూడి యుద్యానంబున గుసుమాపచయం బొనర్చుచుండ వేటనిమిత్తంబుగా నే నందు బోయినపు డామెం గాంచితిని. అక్కన్యకామణి సౌందర్యంబు వర్ణింప నేరికిని శక్యంబు గాదు. సాక్షాల్లక్ష్మి యనందగు నక్కన్య లభించినంగాని నా యసువులు తనువున నిలుచునట్లు లేదు. నీవటు వెడలి యప్పద్మావతిం గాంచినచో నీతని కిక్కన్యక తగియుండు నని తోఁచకపోదు. ఆమాట లాలించి వకుళమాలిక దేవా! అటులేని నేనచటి కేగి యాబాలామణిం జూచి వచ్చెద. అటకు బోవలసిన మార్గముం దెలియజేయుము. అనుటయు, నాతం డిటుల దెల్పెను. నీ విటనుండి నృసింహగుహామార్గంబున బోయి, యప్పర్వతంబునుండి దిగి సువర్ణముఖరీతీరంబునం గల్గు నగస్త్యాశ్రమంబునకు బొమ్ము. అట నమ్మహామునిచే బూజింపబడు నగస్త్యేశ్వర లింగంబును దర్శించి, యుత్తుంగతరంగమాలికావిరాజితం బగు సువర్ణముఖరీనదీమతల్లిం గాంచి, తత్తీరమార్గంబున శుకబ్రహ్మర్షి వనంబున కరుగుము.

అచట నతిపావనంబును, సరసిజమనోహరంబు నగు పద్మసరో

వరం బను నొక తీర్థమున్నయది. అందు స్నానం బొనర్చి తత్తీరంబునం
దపం బొనరించుచుండు ఛాయాశుకునకు ప్రణామంబు లాచరించి,
యమ్మునిచే నారాధ్యమానుండును, బలభద్రసమన్వితుండు నగు
శ్రీకృష్ణున కభివందనంబు లాచరించి, యప్పద్మసరంబునుండి నొక
స్వర్ణకమలముం గైకొని, సువర్ణముఖరీనదిం దాటి, యావలనుండు
వనంబుల, నుపవనంబుల నధిగమించి, యరణీతీరంబున కరిగి, యందలి
సుందరకాననంబున కొంచెముకాలము విశ్రమించి, యటనుండి నారా
యణపురంబును గాంచుము. అద్దియు నీకమితానందంబును, అత్యా
శ్చర్యంబును కలిగించును. ఆనగరసమీపంబున సుమవిసరభరి
తంబులై, ఫలసముత్కరశోభితంబులై విలసిల్లు- పనసామ్రపున్నాగనాగ
తాలహింతాల జంబూ నింబ ప్రియంగు హింగు ఖర్జూర మాయూరా
శోక చించా పూగ నారంగ నారికేళాది వివిధవృక్షంబుల చేతను,
మల్లికా మాలతీ యూధికాది లతావితానంబులతోడను, శుక పిక
శారికా మయూర సారసా ద్యనేకవిహంగముల కలకలనాదరమణీయం
బగుచు, భ్రమర ఝుంకారనిబిడం బయి శోభిలు వనంబులం గాంచుచు
పూర్వోత్తరమార్గంబునం జని మందాకినీనదీమతల్లి కీడగు నయ్యరణీ
నదీతటంబునం దమరపురీవరంబును ధిక్కరించు నయ్యాకాశరాజ
పురంబునం బ్రవేశించి, యందుచితంబగు మార్గంబున మన కనుకూల
మగు విధానమున జరింపుము. అను నాశ్రీనివాసుని పలుకుల నాలకించి,
యవ్వకుళమాలిక- యాజగన్నాథునకు దండప్రణామంబు లాచరించి,
పోయి వచ్చెద నని వచించి యతిత్వరితంబుగ
గుంజామణిమయాకారం బగు నుత్తుంగ తురంగంబు
నధిరోహించి, యాదేవదేవుం డానతిచ్చిన మార్గంబున బోవుచు,
మార్గమధ్యంబున గజ గవయ సింహ శార్దూలాది మృగంబులను,
హంస కారండవ మయూరాది విహంగంబులం గాంచి యానం
దించుచు, బోయి పోయి, యరణీనదీతటంబునం బ్రవేశించి, హయావ
రోహణం బొనరించి, యాతీర్థంబున స్నాన మాచరించి, యగస్త్య



ముని పూజితంబగు నగస్త్యేశ్వరలింగముం గాంచి, యభివాదనం బొన
రించి, యానదీజలంబులచేఁ బిపాసోపశమనముం గావించి, యందలి
సుందరదృశ్యంబులం గాంచుచుండెను.

అంత నచటికి దేవతాసందర్శనార్థమై యమ్మహారాజమందిరంబు
నుండి పద్మావతిచెలికత్తియలు చనుదెంచిరి. వారిం గాంచి వకుళ
మాలిక యిటులనియెను. రమణీమణులారా! మీరలందరును దివ్యాం
బరధారిణులై మిగుల సుందరాకారలై యుండిరి. మీర లెవరు?
ఇచటి కేల వచ్చినారలు? నేను వినుట కుత్సహించియుంటి నన,
నామెం గాంచి మావృత్తాంతముం దెల్పెదము, సావధానంబుగ విను
మని యిట్లనిరి.

-: పద్మావతీవృత్తాంతమును వకుళమాలికకు పద్మావతి
చెలికత్తెలు వినుపించుట :-

మే మాకాశరాజాంతఃపురంబున నుండువారలము. ఆమహా
రాజపుత్రిక యగు పద్మావతికి సఖురాండ్రము. మే మొకపుడు పద్మా
వతిం గూడి యుపవనంబున కరుగుదెంచి కుసుమవిసరంబులం గోసికొని
యొక తరుమూలంబునం గూరుచుంటిమి. అంతలోన నీలమణినిభ
శ్యామవర్ణుండును, ఇందిరామందిరోరస్థలుండును, మందస్మితసుందరవద
నారవిందుండును, ఆజానుబాహుద్వయవిరాజితుండును, పీతాంబరధరుం
డును, హేమబాణధనుర్ధారియు, రత్నఖచితసువర్ణకిరీటోజ్జ్వలుండును,
హారకేయూరాది వివిధభూషణభూషితుండును అగు నొక నవమన్మథా
కారుం డగుపురుషుండు చనుదెంచెను. అతనిం గాంచి పద్మావతి కమలలో
చన యనుసఖిం బిలచి యోసఖీ! ఇమ్మహాపురుషుం జూడుమన, మేమంద
రమునాసుందరాకారు జూచుచుంటిమి. అంత నమ్మహాపురుషుం డశ్వంబు
నవతరించి, మాచెంత కరుదెంచి, మమ్ముం గాంచి, కొంచెముగ మాట
లాడి యంతర్ధాన మొందెను. ఆతని సౌందర్యాతిశయముం గాంచి

మా పద్మావతి మోహంబునొంది మూర్ఛనొందెను. మేమామెనుఁ బదిలంబుగ నింటికి జేర్చితిమి. అపుడాకాశరాజు మూర్ఛనొందియున్న కూతుం గాంచి యయ్యవస్థకుఁగారణంబునూహింపలేక యొక దైవజ్ఞునింబిలువనంపి, యో దైవజ్ఞశిఖామణీ! ఇక్కన్నియ యస్వస్థతకుం గారణ మెద్దియో యూహించి తెల్పుమని యడిగెను. సురగురుసముండగు నాకార్తాంతికుం డాప్రశ్నకాలలగ్నము ననుసరించి, చక్కగ బరిశీలించి యిటు లనియెను.

రాజా! నీపుత్రిక సఖురాండ్రం గూడి యుద్యానంబున విహారము సల్పుచుండ నటకు విచ్చేసిన యొక మహాపురుషుం గాంచి, యాతని రూపలావణ్యాదులం గాంచి మోహవశంబున మూర్ఛనొందిన యది. ఇంతియగాని రోగకారణంబు గాదు. అచిరకాలంబున నమ్మహాపురుషసంయోగం బీమెకు సమకూరును. ఆతం డొకనారీమణిని నీ నికటంబున కంపును. ఆమె నీతోడ మాటలాడును. ఆమె మాటల న్విని ఆమె దెల్పిన విధానంబునకు నీవు సమ్మతించెదవు. కాని యిం దొకమాట వినుము. విద్వాంసులగు బ్రాహ్మణోత్తములం బిలుపించి నీకన్నియ సేమంబునకై యగస్త్యేశలింగంబున కభిషేకార్చనాదులం జేయింపుము. అయ్యది సర్వవ్యాధినివారకంబు, సర్వార్థసిద్ధిప్రదంబు. తప్పక యిటు జేయింపు మని పలికి యాకాశరాజుచే సత్కృతుండై యమ్మౌహూర్తికుండు వెడలెను.

-: అగస్త్యలింగార్చనకై యాకాశరాజు భూసురులం బంపుట :-

పిమ్మట నయ్యాకాశరాజు వేదవిదులగు విప్రవర్యుల రావించి, భూసురోత్తములారా! మాపద్మావతీక్షేమార్థమై మీర లగస్త్యేశ్వరునకు మహాభిషేకార్చనంబుల గావింపుడు. మీకు వలయు పూజాసామగ్రి పంపెద నని వారలకుం దెలిపి, పిదప మమ్ముం బిలుపించి మీర లతిత్వరితంబుగ మహార్చనాభిషేకాదులకు వలయు సామగ్రిని



సిద్ధముచేసి, గైకొని భూసురుం కందజేయుం డన, నయ్యాజ్ఞను శిరంబున దాల్చి, సామగ్రిం గొని యిటకు నేము వచ్చినారము. అని వచించి, యో దేవీ! నీ వియ్యైశ్వర్యంబు నధిష్ఠించి దేవలోకంబునుండి వచ్చిన దేవతవలె నుంటివి. నీ వెచటనుండి యిటకు వచ్చితివి? ఇటనుండి యెట కేగెదవు? అనవు డవ్వకుళమాలిక వారలం గాంచి, యో సుందరులారా! నాపేరు వకుళమాలిక. శ్రీవేంకటాచలంబునుండి యాకాశరాజు భార్యను జూచువేడుక నిటకు వచ్చితిని. చూచుటకు శక్యమగునే యన, మాతో గూడ వచ్చితివేని చూడ వీలగును. రమ్మనుడు వారలం గలసి యావకుళమాలిక రాజమందిరమునకు వచ్చుచుండెను. అంతలోన రాజపత్ని యగు ధరణీదేవి యొకయెరుకులసానిం గాంచెను. ఆమెయు స్తనంధయశిశువు నొడియం దిడికొని, గుంజాబీజసమన్వితంబగు శంఖమాలికను గళంబున ధరించి, వీధివెంబడి దిరుగుచు సోదె చెప్పుదానను, భూతభవిష్యద్వర్తమానకాలంబుల వారివారికిం గలుగు ఫలంబుల వినిపింతు నని కేకలిడుచు వచ్చుదానిం బిలిపించి, బంగరు చేటయందు ముత్తెము లుంచి, వాటిని మూడుప్రోగులుగా జేసి యేప్రోవునందు నాయభిమతం బుండెనో దెలుపు మన, మధ్యమంబగు ప్రోవునం దున్నది యని వచించెను. అందుల కామె సంతసించి కలిగెడు ఫలముల వచింపు మన- నయ్యెరుకులసాని యిటు లనెను.

-: ధరణీదేవికి నెరుకులసాని వచించిన విధానము :-

తల్లీ! నాబిడ్డని కాకలి యగుచున్నది. కడుపునిండునటు లన్నముం బెట్టెదవేని బాగుగ సోదె జెప్పెదను. అనుటయు నాధరణీదేవి- యొక బంగరు పళ్లెరంబుతో నన్నంబును, క్షీరంబుల నొసంగ, వాటి నాశిశువున కారగింపజేసి, సుఖోపవిష్టయై యిటు లనెను- అమ్మా! నీపుత్రికం గూర్చి నన్నడుగుచుంటివి. నీపుత్రిక శరీరము శుష్కించి యున్నది. అందుకు కారణ మొకపురుషుడై యుండెను. ఆపురుషుండు

కంటి కగపడని కారణంబున మదనశరపీడితయై తాపము నొందుచున్నది. చెలిమికత్తియలం గలసి పుష్పోద్యానంబున విహరించు నీ కూతుం గాంచి యాపురుషుండును మారశరానలదందహ్యమానమానసుండై వెతల నొందుచున్నాడు. ఆపురుషుండు మహావిష్ణువు. వైకుంఠమునుండి విచ్చేసి, వేంకటాచలమందలి స్వామిపుష్కరిణీతటంబున శ్రీమహాలక్ష్మీసమన్వితుండై నివసించి యున్నవాడు. భక్తాభీష్టప్రదాయకుం డగు నా శ్రీహరి యొక లలితాంగిని భవన్నికటంబునకు బంపును. నీపుత్రిక లక్ష్మివలె నమ్మహాపురుషునిం గూడి సుఖించునని వచించి యూరకుండెను. అంత నాధరణీదేవి మరల నయ్యెరుకుసానికి వలయు నన్నంబు వెట్టి దాని సాగనంపెను. పిమ్మట నంతఃపురంబున కరిగి సఖీపరివృతయై కామాతురయై బాధనొందుచుండు పద్మావతిం గాంచి తల్లీ! నీ కేమి కావలయును? ఏవస్తువునందు నీకభిలాష కలదు? వచింపుమను తల్లిం గాంచి పద్మావతి యిటులనియె.

-: భగవద్భాగవతుల లక్షణంబులఁ బద్మావతి వచించుట :-

తల్లీ! ఎయ్యది నేత్రాభిరామంబో, యేది సజ్జనుల మనంబులకు ప్రియకరం బగునో, యెద్దానిం గాంచుటకు చతురాననాది సుపర్వులందరు నిచ్ఛయించుచుందురో, యేది సర్వగతమై ప్రకాశించుచుండునో, దేని వెలుంగు సోకుటం జేసి యితరంబులు వెలుంగుచుండునో, యెయ్యది భక్తవరులకు లభ్యంబగునో, భక్తిహీనుల కెయ్యది లభింపకుండునో యట్టి వస్తువు నభిలషించి యున్నదానను. భక్తకామదం బగు నట్టి వస్తువు నన్వేషింపుము. అను కుమారిక పలుకు లాలించి, ధరణీదేవి యిటులనెను. తల్లీ! ఎట్టి భక్తుల కవ్వస్తువు లభ్యంబగునో యట్టిభక్తుల లక్షణంబులం గూడ దెలియబలుకుమన, సనాతనంబగు భక్తలక్షణము ల్వచించెద వినుమని పద్మావతి యిటులనెను. వైష్ణవులగు భక్తవరులు- భుజయుగ్మంబున శంఖచక్రాంకితులై యుందురు. సాంతరాళ మగు నూర్ధ్వపుండ్ర



మును ధరింతురు. కొందరు ద్వాదశోర్ధ్వపుండ్రంబుల దాల్తురు. వాటిస్థానంబుల వినుపింతు వినుము- లలాటము, ఉదరము, హృదయము, కంఠము, జఠరము, పార్శ్వంబులు, కూర్పరములు, భుజద్వంద్వము, పృష్ఠము అనునవి ద్వాదశస్థానంబులు. కేశవాది ద్వాదశనామంబుల నుచ్చరించుచు ద్వాదశోర్ధ్వపుండ్రంబుల నుంచవలయును. 'వాసుదేవ నమోస్తు తే' యని యుచ్చరించుచు మూర్ధంబున ధరింపవలయును. వైష్ణవోత్తములు చరించు తీరును వినుము. వేదపారాయణాసక్తులై వైదికకర్మల నాచరింతురు. ఏసమయమందును సత్యంబును వీడకుందురు. పరులయెడ నసూయఁ జెందకుందురు. పరుల నిందింపరు. పరదార, ధనంబులం గోరకుందురు. సకలజీవులందును దయతో మెలంగుదురు. సర్వకాలములందును దేవదేవుండగు వైకుంఠవాసు నుతించుచు గానము చేయుచుందురు. వీతరాగులై భయక్రోధవర్జనంబు గావించి స్వదారనిరతులై చరించుచుందురు. ఇట్టి సుగుణాన్వితులైన వైష్ణవోత్తములు పంచాయుధధరులై యాచార్యరూపుం డగు తండ్రివలన గాని, శిష్టుం డగు నితరునివలన గాని స్వగృహోక్తవిధానంబున నగ్నిప్రతిష్ఠాపనం బొనరించి, చక్రాద్యాయుధమంత్రంబులచే బదునారు హోమంబులును- మూలమంత్రముచేతను, పురుషసూక్తముచేతను, జాతవేదస్సుమంత్రంబుచేతను, అష్టోత్తరశతహోమంబులును గావించి, యావహ్నియందు సుతప్తంబులగు చక్రాద్యాయుధంబులను దాల్తురు. భుజములందు శంఖచక్రంబులను, శిరమున శార్ఙ్గశరంబులను, లలాటంబున గదను ధరింపవలయును. కాదేని భుజముల శంఖచక్రములనైన ధరింపవలయును. ఈచెప్పిన లక్షణంబులు గలవారలే భక్తులు. అట్టి సద్భక్తులకే నే దెల్పిన బ్రహ్మవస్తువు లభ్యమగును. ఆవస్తువునంద నా కత్యంతప్రీతి కలదు. శ్రీమహావిష్ణువునందె కాక, యన్యులయెడ నాకిసుమంతయు గోరిక లేదు. నీలనీరదశ్యాముం డగు నాదేవదేవుని చిత్తంబున హత్తించి ధ్యానించుచుంటి. నాజీవన మాతని

తోడిద. ఎట్టులైన నాకా శ్రీహరిని సమకూర్ప బ్రయత్నింపుము. ధరణీదేవి పుత్రిక కోర్కె నాలించి, మహావిష్ణు వెట్లు ప్రీతుండగును? ఎట్లు లభించును? అని విచారించుచుండ బద్మావతీసఖీసమన్వితయై యవ్వకుళమాలిక యట కరుగుదెంచెను. ఇంతలో నయ్యాగస్త్యేశ్వరు కభిషేకార్చనంబుల నొనరించి, విప్రపుంగవు లరుదేర వారల దివ్యాన్న భోజనాదులం బరితృప్తులం గావించి, దివ్యవస్త్రాభరణాదు లొసంగి, దక్షిణాతాంబూలంబుల నిచ్చి, వారల యాశీస్సులనంది, వారల నిలయంబుల కనిపి పిదప వకుళమాలికాసమన్వితలైన యయ్యువిదలం గాంచి యిటులనియె.

—: వకుళమాలిక ధరణీదేవికి శ్రీనివాసవృత్తాంతమును తెలుపుట :—

ఓ యువతులారా! ఇక్కన్య యెవరు? మీతో నెచ్చట గలసినది? ఏపనికై యిటకు వచ్చినది? ఈమె పూజ్యురాలుగా గన్పట్టుచున్నది యన నప్పద్మావతీసఖురాం డ్రిట్లు పలికిరి. దేవీ! ఈమె యొక దివ్యాంగన. నీకడ నొకకార్య ముండుటం జేసి యిటు వచ్చినది. మే మగస్త్యాశ్రమంబునకు బోయినపుడు మా కగపడినది. తాను వేంకటాచలంబునుండి వచ్చితి ననియు, మీరాజపత్ని దర్శన మగునా యని మమ్మడిగిన మే మిటులంటిమి. మేము ధరణీదేవి దాసీలము. మేమిపు డచటికిం బోయెదము. మాతోం గలసి వచ్చెదవేని యామె దర్శనము నీకు సులభమగును. అని మేమనువంత మాతోం గూడి యిటకు వచ్చియున్నది. ఇక నీమె యిటకు వచ్చిన కారణ మామెవలననే వినుపుము. అనుటయు, నాధరణీదేవి యామెం గాంచి- యోతరుణీ! నీపే రెయ్యది? నీ వెందులకై నను జూడ నేతెంచితివి? నీచరితంబును వినిపింపు మన, నామె యిటు లనియెను. నాపేరు వకుళమాలిక యందురు. నేను వేంకటాచలమునుండి వచ్చితిని. ఈవేంకటాద్రియందు మాప్రభు వగు శ్రీమన్నారాయణుండు నివసించి యున్నవాడు. ఆతం డొకదినంబున హంసధవళంబగు మనోజవ



తురంగమంబు నధిరోహించి మృగయాకుతూహలియై యానగసమీపంబునం గల్గు వనంబున జరించుచు, సింహ, శరభ, గజ, గవయ, శార్దూలాది మృగంబులను; చిత్రవిచిత్రంబులగు శుకశారికాద్యనేక విహంగంబులం గాంచుచు, నొక్కయెడ నత్యున్నతంబును, మదధారాయుతంబును, కరేణుయూథసమన్వితంబు నగు నొకమత్తేభంబును గాంచి దాని ననుగమించి యొకవనంబునుండి యింకొక వనంబున కేగుచు నొక్కచో శంఖనాగబిలం బను పావనసరోవరంబును గాంచెను. తత్తీరంబున శ్రీభూరమణీమణులం గూడియున్న జనార్దనుం బ్రతిష్ఠించి నిరతంబు నాదేవుని పూజించుచు, తపం బొనరించు శంఖభూపాలుం డను నరనాథుం గాంచి, యశ్వంబునుండి దిగి, రాజవేషంబున నమ్మహారాజుకడ కేగి, యోరాజా! ఈవేంకటాచలపాదంబున నేమిచేయుచుంటి వన, శంఖనరపాలుం డిటులనియె. మహానుభావా! నేను హైహయదేశప్రభుండగు శ్వేతభూపతి నందనుండను; శంఖభూపాలనాముండను. నేను శ్రీ మహావిష్ణువునకు ప్రీతికరంబుగ ననేక యాగము లొనరించితిని. ఎంతసేవ యొనరించినను భగవంతుండు ప్రత్యక్షము గాకుండెను అందులకై నే నతినిర్విణ్ణుండనై చింతించుచుండ, నశరీర వాణి యిటు వినుపించెను.

రాజా! ఇటు లేల విచారించెదవు? నీ వెంతశ్రమపడినను నే నిట ప్రత్యక్షము గాకుందును. నారాయణాద్రిం జేరి యచ్చటం దపం బొనరించితివేని నీయభీష్టంబు నెరవేరును. అను నయ్యాకాశవాణి మాటల నమ్మి, యిట కరుదెంచి యిచ్చట శ్రియఃపతిని బ్రతిష్ఠించి, పూజించుచు దపం బొనర్చుచుంటిని. ఆపలుకు లాలించి యవ్విభుండు ప్రోత్సాహంబున నిటులనియెను. రాజా! నారాయణాద్రియన నియ్యది గాదు. నే వివరించెద వినుము. ఈ మార్గంబున నిప్పర్వత పశ్చిమశిఖరంబున కరిగి యందలి మహోన్నతం బగు వటవృక్షమూలంబున బాలకరూపంబున గూర్చున్న

విష్వక్సేనుం గాంచి, నమస్కరించి యందుండి స్వామిపుష్కరిణీతీరంబును జేరి, యందవగాహన మొనర్చి, దాని పశ్చిమతీరంబున కరుగుము. అందొక యశ్వత్థంబును, ఒక వల్మీకంబును గనుపించును. ఆ రెంటి మధ్యప్రదేశంబున గూరుచుండి తపం బొనరించుము. అవ్వల్మీకమునం దొకవరాహము శయనించి యుండును. అయ్యది పుణ్యాత్ములకుగాని, యితరుల కగుపడకుండును. అని పలికి యవ్విభుండు తురంగంబు నధిరోహించి మృగయావినోదంబు సల్పుచు వనాంతరంబుల సంచరించుచుఁ గ్రమంబుగ నరణీతటంబున కరిగి, యందు పద్మకల్హార సుగంధమిళితంబగు చల్లని పిల్లవాయువులు సోకుచుండ, నందలి పూలచెట్లు పూలవానచే నలరించుచుండ, విశ్రాంతి నొంది, మరల నవ్వనంబున వెనుకటి గజేంద్రము న్వెదకుచు నొక్కచోఁ గొందర కోమలాంగులం గాంచి, వారల మధ్యంబునం దతిమనోహరాకారయగు నొక తరుణీమణిం గనియెను.

కమలాలయ యనందగు నక్కన్నియయందు సంసక్తమానసుండై, యాయువిదలవలన నామె యాకాశరాజతనయనుగా నెరింగి శీఘ్రంబుగ తురంగంబు నెక్కి నిజాశ్రయం బగు వేంకటాచలంబు నకుం జేరి, నను బిలువనంపి, యోవకుళమాలికా! నీవు త్వరితగతి నాకాశరాజపురంబును జేరి, రాజాంతఃపురంబున బ్రవేశించి, యాధరణీదేవిని సందర్శించి, నానిమిత్తమై పద్మావతిని యాచించి, రాజాభిప్రాయము నెరింగి, యతి త్వరితగతిని తిరిగి రావలయు నని నన్ను బుత్తెంచెను.

దేవీ! ఈచరితంబును సచివులం గూడియున్న ప్రభువునకును, గాదిలికూతు రగు పద్మావతికిని దెలియపరచి, వారలతో నాలోచించి, నాప్రశ్నకుఁ బ్రత్యుత్తరం బొసంగు మనియెను. ఆమాటల కమందానందంబు నొంది యాదేవి పద్మావతీసమీపంబున కరిగి, యటకు ప్రాణవల్లభుం డగు నాకాశరాజును రావించి, వకుళమాలిక మాటల న్వినుపింప, నాతండును సంప్రీతమానసుండై సపురోహితులగు మంత్రి



వరుల నటకు రప్పించి వారల కిటు లనియెను. మీర లందరును కార్యాలోచనయందు మిగుల సమర్థులు. నామాటల నాలకించి, మీమీ యభిప్రాయంబులం దెల్పుడు. అయోనిసంభవ యగు మత్పుత్రిక పద్మావతిని శ్రీ వేంకటాచలనివాసుం డగు దేవదేవుండు కోరుచున్నవాడు. ఆకారణంబున ధన్యుండ నైతి నని తలంచుచుంటిని. ఇవ్విషయంబున మీమీ యభిప్రాయంబుల దెలియపరుప వేడుచుంటి నన, వారలందరు నేకవాక్యంబుగ నిటు లనిరి.

ఓ మహారాజా! ఈవిషయంబున నీ వొకరుండవు కాదు, ఈవృత్తాంతము న్వినుటవలన మేమందరమును ధన్యుల మైతిమి. నీవంశ మత్యున్నతస్థితి నొందగలదు. నిరుపమానలావణ్యవతి యగు నీపుత్రిక పద్మావతి పద్మాలయతోడ గూడి యఖండసౌఖ్యము నొందగలదు. తప్పక పుత్రిక నొసంగి ధన్యుడవగుము. ఇయ్యది శుభప్రదం బగు వసంతకాలము. త్వరితంబున నుద్వాహం బొనర్ప బృహస్పతిం బిలిపించి ముహూర్తనిశ్చయం బొనరింపు మనిరి. అందుల కమితానందంబు నొంది, యాకాశరాజు సురాచార్యు రావించి, మహానుభావా! నాపుత్రిక యగు పద్మావతికి పరిణయ మొనరింప శుభప్రదం బగు ముహూర్తమును వచింపు మనియె. అంత నయ్యమరగురుండు వధూవరుల నక్షత్రంబుల నడిగి వధువు నక్షత్రము మృగశీర్ష యనియు, వరుం డగు పరమేశ్వరుని నక్షత్రము శ్రవణర్క్షం బనియు దెలిసికొని, రాజా! ఈనక్షత్రముల దారల కుత్తరఫల్గునీనక్షత్రమునందు వివాహ మొనర్చుట శుభప్రదం బని, వైశాఖమాసంబునం దుత్తరఫల్గునీనక్షత్రయుతం బగు నొక దినంబున శుభముహూర్తమును నిశ్చయించి వినుపింప, సంతసించి, యాసురగురుని సత్కరించి యనిపి, భగవద్దూతిక యగు వకుళమాలికతో నిటు లనియె.

—: విశ్వకర్మచే గావింపబడిన నగరాలంకరణాది వర్ణనము :—

ఓయువతీ! ఇక నీవు వేంకటాచలంబున కరుగుము. దేవదేవు

నితో వైశాఖమాసంబున గల్యాణం బని వచింపుము. వైవాహిక
విధానసంరంభంబున నిప్పట్టణంబునకు దరలి రమ్మనుము. ఆలసింపకు
మని పలికి, యామెతో గూడ బద్మావతి కత్యంతప్రియం బగు నొక
శుకవరంబును గూడ దూతగ నంపెను. ఆవెనుక నింద్రాది దేవతలం
బిలువ దన కుమారుండగు వాయుమహారాజు నంపెను. నగరంబున
వైవాహికాలంకరణం బొనర్ప విశ్వకర్మను రావింప, నాతం డతిశీఘ్రం
బుగ నిరుపమాలంకారంబులఁ దేజరిలజేసెను. సురేంద్రుండు పుష్ప
వర్షముం గురియించెను. రంభాద్యప్సరోగణంబులు నాట్యం బొన
ర్చిరి. కుబేరుం డామహారాజమందిరంబును ధనధాన్యసమృద్ధంబు
గావించె. యముండు భూలోకంబునం గల్గు జనుల నెల్ల నారోగ్య
వంతులుగా నొనర్చె. వరుణదేవుం డవ్వారిగ రత్నంబుల, మౌక్తికం
బుల నొసంగె. ఇటు లింద్రాదిదేవత లమ్మహారాజునకు వలయు
సంభారంబుల సమకూర్చి, వృషభాచలంబునకు బయనమైరి. వకుళ
మాలిక శుకసమేతయై తురంగంబు నధిష్ఠించి, వేంకటాచలంబున
కరిగి, దేవదేవుని మందిరసమీపంబున యశ్వంబు నవతరించి, శుక
సహితయై యభ్యంతరమున బ్రవేశించి, రత్నపీఠంబున కమలాసహి
తుండై యధిష్ఠించి యున్న పరమేశ్వరుం గాంచి, నమస్కరించి, తా
బోయివచ్చిన చరితం బంతయు వినుపించి, యోదేవా! శుభవార్తను
వినుపింప నీశుక మిటకు వచ్చినయది యని శుకముం జూపెను. శుక
మ్మాదేవదేవునకు ప్రణామ మాచరించి, మాదేవి యగు పద్మావతీ
దేవి మీతో వచింపుమనిన పలుకుల వినుము. పరమపవిత్రంబు లగు
నీనామంబుల నెల్లకాలములం దుచ్చరించుచు, చిత్తసరోజంబున నీ
మూర్తిని నిలిపి, నిరంతరధ్యానం బొనరించుచు, మదీయాంగంబుల నీ
చిహ్నంబుల ధరించుచు, పంచసంస్కారసమన్వితు లగు నీభక్తులఁ
బూజించుచు, భవత్ప్రీతిజనకంబు లగు కర్మంబుల నాచరించుచు, భవ
త్సంసక్తమానసనై యుంటిని. నీకరుణాకటాక్షంబుల నాపై బ్రసరింప
జేసి, నన్నంగీకరింపు మనియె. అవ్వచనంబుల నాలకించి యమ్మహాత్ముం



డును పరమానందంబు నొంది, యోశుకవరమా! పరిణయంబునకై
వచ్చుచుంటి నని మీపద్మావతికిం దెలుపుము. శీఘ్రంబుగ బొమ్ము.
ఆలసింపకు మను దేవదేవు పలుకుల నాలకించి, యాశుకంబు వియద్గమ
నంబున వియద్రాజపురంబున కరిగి, పద్మావతిం గాంచి, నమస్కరించి,
భగవద్దత్తం బగు వనమాలిక నొసంగి, యాతని పలుకుల వినుపింప, పర
మానందభరితయై, యావనమాలను శిరంబున ధరించి, పరమేశ్వ
రాగమనకాంక్షిణియై యుండె.

అంత నాకాశమహారాజు చంద్రుం బిలువ బంచి, యోయీ నీవు
విష్ణునైవేద్యయోగ్యంబు లగు పరమాన్నంబులను, సురమునినికరం
బులకు సమ్మతంబు లగు చతుర్విధరుచికరపదార్థంబులను సమకూర్పు
మని నియమించెను. పద్మావతిని సర్వాలంకారభూషితగా నొనరిచి,
ధరణీసమన్వితుండై హితపురోహితసామంతాదులం గూడి యాకాశ
రాజు సభామధ్యంబునం దమ్మహాత్ముని రాకకై నిరీక్షించియుండె.

—: లక్ష్మీకృత శ్రీనివాసపరిణయాలంకారాదివర్ణనము :—

శ్రీనివాసుండు లక్ష్మిం గాంచి, యోదేవీ! పరిణయంబునకై
యేమి కావలయునో యాలోచించి, నీచెలికత్తెలం బిలువ నంపి యాజ్ఞా
పింపుము. అనుటయు నప్పద్మాలయ సఖురాండ్రం బిలుపించి, దేవ
దేవునకు వివాహాలంకరణంబునకు వలయు పరికరంబుల సిద్ధంబు
గావింపు డనఁ బ్రీతి యనునది సుగంధతైలంబును, శ్రుతి యను సఖి
దుకూలంబును, స్మృతి సకలభూషణంబులను, ధృతి దర్పణంబును,
శాంతి మృగమదంబును, హ్రీ యనునది యక్షకర్దమంబును, కీర్తి
రత్నకిరీటంబును, శచీదేవి ఛత్రంబును, గౌరీసరస్వతులు చామరంబు
లను, జయావిజయలు వ్యజనంబులను చేతుల నుంచుకొని సిద్ధంబుగ
నుండిరి. వారలందరం గాంచి, కమలాలయ సత్వరంబుగ లేచి మంద
హాస మొనర్చుచు, జగన్నాథు నొకపీఠంబునం దాసీనుం గావించి,

సుగంధతైలంబున శిరసంటి, పరిమళచూర్ణంబుల నంగంబున నలుగు వెట్టి, గజవరంబులచేఁ దేబడి, సువర్ణఘటంబులం దుంపబడిన గంగాది సకలతీర్థజలంబుల నభిషేకించి, కోమలంబును, నీలంబు నగు కేశకలాపంబును, సుగంధధూమధూపితంబు గావించి, ముడిచి, కాంచీసమన్వితంబుగఁ గటియందు పీతాంబరంబును ధరింపఁ జేసి, యంగంబున బంగరు రంగు లీను గంధం బలంది మూర్ధంబున మణిమయకిరీటం బమరిచి హారకేయూరకటకాంగుళీయకాది సర్వాభరణభూషితు నొనరిచె. పిదప ధ్నాతి యను నాపె కరంబునం బట్టిన యాదర్శంబునం దన మోముం గాంచుచు, నూర్ధ్వపుండ్రమును స్వయముగ నుంచుకొనెను. అటుపిమ్మట పద్మాలయం గూడి గరుడవాహనారూఢుండై చతురాననాది యమరవరులును, పురుహూతుండు మున్నుగాగల దిగధీశులును, వసిష్ఠాది మహామునులును, సనకసనందనాది యోగిపుంగవులును, వారివారి యానంబుల నధిరోహించి వెంట వచ్చుచుండ, గంధర్వు లతిశ్రావ్యంబుగ గానం బొనరించుచుండ, రంభాద్యప్సరసలు నాట్య మొనర్చుచుండ, మునినికరంబు లనేకవిధంబుల స్వస్తివాదం బొనర్చుచుండ, విష్వక్సేనాది పార్షదబృందము సేవించుచుండ, వకుళమాలికాది తరుణీమణులు రథంబుల నధివసించి వచ్చుచుండ, దేవదుందుభులు మ్రోయుచుండ, నాదేవదేవుం డాకాశరాజుపురంబునకు దరలి వచ్చెను.

—: పద్మావతీపరిణయవృత్తాంతము :—

ఆసమయంబున పద్మావతియు నైరావతంబు నధిష్ఠించి, నగర ప్రదక్షిణముం గావించి, పురద్వారముం జేరునంత, నాదేవదేవుండును గూడ నట కరుదెంచెను. అంత నవ్వధూవరులం గాంచి, యానందభరితాంతరంగుండై, యాకాశరాజు- వారలను వైవాహికాలంకారశోభితం బగు మందిరంబునం బ్రవేశింపజేసెను. అంత నా శ్రీకాంతుండు తన కంఠమందలి కుసుమమాలికం దీసి యాపద్మావతీకంఠంబున వైచెను. పద్మావతియు నొక మల్లికాకుసుమమాలికం గొని యాజగదీశుని



గళంబున వైచెను. ఇట్లు సకలజనానందకరంబుగ ముమ్మారు పూలమాలికలను ఒండొరుల గళంబుల వైచుకొనిరి. పిమ్మట నవ్వధూవరులు వారివారి వాహనంబులనుండి దిగి, బ్రహ్మాదిదేవతలందరును వెంట నడచుచుండ, కల్యాణమంటపమునం బ్రవేశించి యందలి పీఠంబుల నలంకరించిరి. అపుడు కమలాసనుండు పురోహితుండై యంకురారోపణపూర్వకంబుగ మాంగళ్యసూత్రబంధాదిక్రియల నొనరింపజేసెను. పిదప లాజహోమాదికంబు లగు వైవాహికకృత్యంబులన్నిటిని సాంగంబుగ గావింపజేసెను. పిమ్మట నాదంపతుల నేకశయ్యాగతులం గావించెను. చతుర్థదివసంబున నయ్యాకాశరాజు నాజ్ఞం గైకొని యాజగన్నివాసుండు చతురాననాది సురనికరంబులు వెంటరా, పద్మా, పద్మావతీసహితుండై గరుడవాహనంబునం దధిరోహించి యాకాశరాజుచే నొసంగబడిన యరణంబులతో దేవదుందుభులు మొరయుచుండ, వృషభాచలంబునస్వకీయమణిమంటపమునం బ్రవేశించి, యందలి రత్నపీఠంబున లక్ష్మీపద్మావతీసహితుండై యాకాశరాజుచే నొసంగబడి గృహాభ్యంతరంబునకుం దీసికొనుబోవు సామగ్రిం గాంచెను. శాలిసంభవంబు లగు తండులంబుల నిండింపబడిన సువర్ణఘటశతంబులను, ఘృతపూర్ణకుంభశతంబులను, వేలకొలది యగు క్షీరఘటంబులను, లెక్కకు మించిన దధిఘటంబులను, దివ్యహారికభరితంబులగు పేటికలను, క్షౌమాంబరనికరంబును, పనసామ్రరాజరంభాఫలంబులను, శర్కరాపూరితఫలంబులను, దాసదాసీగణంబులను, నృత్తగీతవిశారదలగు తరుణీమణులను, ఉత్తుంగతురంగంబులను, మత్తద్విపయూథంబులను గాంచి సుప్రీతమానసుండై యాశ్రీనివాసుండు శ్వశురుం గాంచి యిటులనియె-

—: శ్రీనివాసుని కృపచే యాకాశరాజునకు వరప్రాప్తి :—

మామా! నావలన నీకు వలయు కామ్యం బెద్దియేని వచింపుము. నీకోరిక నెరవేర్చెద. సందియ మొందక వచింపుము. అను

శ్రీకాంతుం గాంచి- దేవా ! యటులేని సర్వకాలంబుల నిను మఱవక, నిను గీర్తించుచు, నీపదకమలంబుల సేవించుచుండునటులను, నీయం దవ్యభిచారిణి యగు భక్తి గలిగియుండునటులను వరం బొసంగుము. వేఱుకోరిక యేదియు లేదన సంప్రీతుండై యటు లగుగాక యని వరం బొసంగి, యథోచితంబుగ కమలాసనుం డాదిగ గల్గు సురల కందరకును వేర్వేర సత్కారంబు లొనరిచి వారల నందర వారివారి నిలయంబుల కనిపి యవ్వేంకటాచలాధీశుం డా పద్మావతీ, పద్మాలయలం గూడి స్వామి పుష్కరిణీతీరంబున యథాపూర్వంబుగ విహరించుచుండె.

—: వసునామకుండగు నిషాదుని వృత్తాంతము :—

ధరణీదేవి వరాహమూర్తివలన శ్రీనివాసకల్యాణచరితంబును విని, స్వామీ ! కలియుగంబున నీ వెవరివలనం జూడబడెదవు ? నీ కాలయ మెవ్వరిచే నిర్మింపబడును ? మనోహరాకారుండగు శ్రీనివాసుం డెవ్వనిచే గనుంగొనబడును ? వినదలతు దెల్పవే యన- వరాహమూర్తి యిటు లనియె- దేవీ ! పావనం బగు నియ్యచలోత్తమంబున శ్యామాకవనపాలకుండును, శ్రీమన్నారాయణపదపంకజసేవానిరతుం డును, వసునామకుండు నగు కిరాతుండు గలడు. వానిభార్య చిత్రవతి యను సాధ్వీమణి. శ్యామాకతండులంబుల పచనంబు గావించి, తేనె తోడం గలిపి ప్రతిదినంబునను పరమేశ్వరునకు నివేదించుచుండును. ఇటులుండ, నవ్వసువునకు మహాసాధ్వి యగు చిత్రవతియందు సుపుత్రుం డుద్భవించెను. వానికి వీరుం డని నామం బిడిరి. గుణవంతుం డగు కుమారునితోడను, పతివ్రతారత్నం బగు చిత్రవతితోడను పరమేశ్వరారాధనం బొనరించుచు సుఖంబుగ కాలము గడుపుచుండెను. ఇటులుండ నొకసమయంబున శ్యామాకపాలనంబునకు కుమారు నియమించి, భార్యాయుతుండై వసువు తేనె దెచ్చుటకుగా నింకొక వనంబున కరిగె. ఆదినంబున వార లెంతగ బరికించినను మధువు కానరాకుండెను. అందువలన మధ్వాహరణంబునకై యవ్విపినంబున దిరుగు



చుండ వేళ యతిక్రమించెను. వీరుండును శ్యామాకతండులంబుల పచనంబు గావించి, యొక వృక్షమూలంబున శ్రీపతికి నివేదించి, యా ప్రసాదంబును వాడు భక్షించి సుఖంబుగఁ గూరుచుండెను. కొంతవడికి వసువు తిరిగివచ్చి శ్యామాకంబులను గానక, కుమారు ననేకవిధంబుల తర్జించి, కోపాటోపవశంబున వాని వధింప ఖడ్గం బెత్తిన, యాతరు వర్ధంబునం దాసీనుండై యున్న పంకజాక్షుండు ఖడ్గభయంకరం బగు వసువు బాహువును పట్టుకొనెను.

వసునిషాదుం డచ్చెరువంది వియత్తలంబునకు దృష్టి నిగుడించిన నత్తరువరంబునం దర్ధశరీరంబునుమాత్రమగుపడునట్లుగ నుండు శంఖచక్ర ధరుం డగు లోకనాయకుం గాంచి, కరకలితం బగు ఖడ్గము న్విడి, ప్రణామంబు లాచరించి, నిశ్చేష్టితుండై నిలువంబడిన కిరాతుం గాంచి యాకమలాకాంతుం డిటులనియె. కిరాతనాయకా ! నీతనయుండు పరమపావనుండు. నాయెడల నమితం బగు భక్తిగలవాడు. నీకంటెను నాకు మిక్కిలి ప్రియతముండు. అందువలన నీస్వామి పుష్కరిణీతీరం బునం దంతటను నీకును, నీకుమారునకును సర్వకాలములందును నయన గోచరుండ నగుచుందును. అను భగవద్వచనంబులాలించి యావసువు దారపుత్రులంగూడి యమితానందభరితుండై యుండెను.

—: రంగదాసుండను భక్తవరుడు పాండ్యదేశమునుండి శేషశైలముం జేరుట :—

ఆకాలంబున రంగదాసుం డను నామంబునఁ బ్రసిద్ధుండును, శూద్రకులసంజాతుండు నగు భగవద్భక్తుం డొక్కరుండు పాండ్యదేశంబు నుండి నారాయణపురంబునం బ్రవేశించి, యందు వరాహమూర్తిం గాంచి, ప్రణామంబు లొనరించి యుండునంత, నాసువర్ణముఖరీతీరం బున సకలామరనికరసంసేవితుండును, భక్తాభయవరదుండు నగు శ్రీనివాసుండు వసించియుండుటను విని, సువర్ణముఖరీతీరంబునకు

బోయి, యానదీజలంబుల నవగాహనంబొనరించి, యటనుండి కమలాఖ్య సరోవరంబునకు బోయి, యందు స్నాన మాచరించి, యాసరస్తీరంబున బలరామసమన్వితుం డగు శ్రీకృష్ణు సేవించి, యటనుండి మదగజఘటాసమన్వితం బగు వనంబునం బ్రవేశించి, మెల్లమెల్లన శేషాచలంబును గనుంగొని, యందు కపిలాపూజితుం డగు శివుని సందర్శించి, యటుపిదప చక్రతీర్థంబును, పాపనాశతీర్థంబులం గాంచి, వాటియందు మజ్జనం బొనరించి, యటుపిమ్మట ద్వాదశవత్సరపరిమితవయస్కుం డగు నాబాలుడు మార్గమధ్యంబున బరమేశ్వరారాధనంబున కరుగుచుండు గోపీనాథుం డను వైఖానసునింగాంచి, యాతనితోడం గూడి మెలమెల్లన వేంకటాచలంబు నధిరోహించి, స్వామిపుష్కరిణీ తటంబునం బ్రవేశించి, యాతీర్థంబున స్నాన మాచరించి, యచ్చటి వనమధ్యంబునం బ్రవేశించి, యందొకతరుమూలంబున గోపీనాథసేవితుండును, శ్రీభూకాంతాయుతుండును, పార్శ్వస్థితశంఖచక్రగదాఖడ్గసేవితుండును, నీలనీరదాభశరీరుండును అగు పుండరీకాక్షుని గాంచి యాదేవదేవుని మూర్ధంబుపై నాకాశంబున రెక్కల విరియించి వితానం బన నొప్పు విహంగపుంగవుంగాంచి, యిరుపార్శ్వంబుల నుండెడు దేవదేవుని శరశరాసనంబులం గాంచి విస్మయాక్రాంతమానసుండై రంగదాసుం డిటులాలోచించెను.

—: రంగదాసుండు స్వామినుద్దేశించి దివ్యోద్యాన
మంటపాదుల నిర్మించుట :—

ఈపరమేశ్వరు సేవించుచు నేనిట నొక పుష్పవాటికను నిర్మించెదను. శ్రీకాంతుని సేవించుచు నిందులనే వసించెద నని నిశ్చయించి, యావైఖానసభక్తుం డొసంగు దేవతానివేదితంబు లగు భక్ష్యంబుల భుజించుచు, క్రమక్రమంబుగ నాప్రాంతమందలి తరువులం దునిమి యందు పూలమొక్కల నాటుటకు ప్రారంభించెను. జగన్నివాసునకు ప్రియకరంబును కమలాలయకు ముదావహంబు నగు చించాచంపకవృక్షములు రెంటెనిమాత్రమే, విడిచి, యందలి మహోన్నతవృక్షంబులఁ దునిమి యాప్రదేశమంతయు తులసీవనభాసురంబును, మందారమాలతీ కరవీర చంపకాది పుష్పలతాశోభితం బగునటు లొనరించెను. అందొక కూపంబును ద్రవ్వి యందలి జలంబులచే నయ్యుద్యానవనవృక్షలతాదులఁ జక్కగ బెంచెను. దేవదేవుని చుట్టును శిలాప్రాకారం బొండు నిర్మించెను. ప్రతిదినంబునను పూలతోటలకు బోవుచు సుగంధయుతంబు లగు గుసుమంబుల గోసి తెచ్చి, మాలికల గ్రుచ్చి, యందలి దేవపూజకున కొసంగుచుండెను. ఆతం డాపూలదండల గ్రహించి, శ్రీభూసహితుండగు జగన్నివాసున కలంకరించుచు నుండెను. ఇటు లాపరమేశ్వరు నారాధించు రంగదాసునకు డెబ్బదివత్సరములు గతించెను.



—: రంగదాసు గంధర్వక్రీడాదర్శనంబున
భగవత్కైంకర్యంబును మరచుట :—

అంత నొకదివసంబున రంగదాసుండు పుష్పాపచయంబునకై యుద్యానంబునకు బోవ, నట నొకగంధర్వుండు, కొందరు రమణీమణులు వెంట రా, నాప్రదేశంబునం దాకాశంబున విమానంబును నిలిపి, యారమణీమణులతోడ నందు దిగి, యాసుందరులం గూడి, యందలి సరోవరంబున జలక్రీడ లాడి, దివ్యాంబరంబుల ధరించి మరల విమాన మధిరోహించి దివంబున కరిగె. ఆసుందరులం గాంచినంతనా రంగదాసునకు రేతస్స్ఖలనం బగుడు మిగుల సిగ్గునొంది, తాగోసిన సుమనికరంబు నచట విడిచి, యాసరోవరంబున స్నానం బాచరించి మరల కుసుమంబులం గోసి, మెల్లన దేవమందిరముం జొచ్చెను. వైఖానసముని యారంగదాసుం గాంచి యోమిత్రమా! యెందుబోతివి? ఇంత యాలసించితివేల? పూలు దెచ్చితివి; దండల గ్రుచ్చకుంటివేల? వనంబున నేమిజేయుచుంటివి? మాటలాడక మిన్నకుంటివేమన, నాతం డేమియు వలుకక యూరకుండెను. శ్రీనివాసుం డారంగదాసుం గాంచి సిగ్గునొందనేల? నీవు జితేంద్రియుండవు.

నామాయవలన మోహితుండ వగుట నీకిట్టి లజ్జాకారణము సంభవించినది. దీనికై విచారింపకుము. నామాట లాలింపుము.

—: లజ్జావనతవదనుం డగు రంగదాసునితో శ్రీనివాసుండు వచించిన విధానము :—

భూతలంబున నీవు చూచిన గంధర్వపుంగవురీతిగ నొక మహారాజవై జనించెదవు. నాయం దపరిమితంబగు భక్తిసంయుతుండవై మహాభోగంబుల ననుభవించెదవు. నాకు విమానప్రాకారంబుల నిర్మించెదవు. ఆజన్మంబున నీకు ముక్తి నొసంగెద- విచారింపకుము. ఈశరీరంబు వీడునంతదనుక నను సేవింపుచు, నిట నుండుము. ఇట్లు నన్ను సేవించు నాభక్తు లందరును ముక్తు లగుదురు. ఇటుల వచించి యాదేవదేవుం డూరకుండెను. ఆరంగదాసుండును భగవదారాధనం బొనరించుచు, నెప్పటియట్ల ఉత్తమారామంబుల బెంచుచు నూరుసంవత్సరంబులదనుక నాదేవదేవుని సేవించి యమరపురంబున కరిగెను.

—: తోండమన్నామక నృపవృత్తాంతము :—

పిదపం గొంతకాలమునకు నారాయణపురంబున జంద్రవంశసంజాతుండగు సువీరనరపాలునకు నందినీగర్భంబున తోండమన్నామంబున జనించి, యైదువత్సరంబులు గతించు సమయంబుననే పుండరీకాక్షపదకమలసేవాసంసక్తమానసుండై - శౌర్య, వీర్య, ధైర్యాది సుగుణాలంకృతుండై యుండెను. ఆతనికి పాండ్యరాజతనయ యగు పద్మ యను యువతిని పరిణయ మొనరించిరి. అటుపిమ్మట స్వయంవరంబులం బ్రాప్తించిన న్నూర్వుర రమణీమణులను పరిణయమయ్యెను. ఆతరుణీమణులంగూడి నారాయణపురమున మహేంద్రభోగంబు లనుభవించుచు భగవత్సేవాపరతంత్రుండై సుఖంబుగం గాలము గడుపుచుండెను. అంత నొకనాడు మృగయాసక్తచిత్తుండై యానరపతినందనుండు జనకుని యనుమతి నొంది, సముచితపరివారయుతుండై వేంకటాచలసమీపంబున



కరిగి, యందు పాదచారియై సంచరించుచు, యందొక మత్తగజంబు నవలోకించి, దానిం బట్ట నుంకించి, ద్రుతగమనంబున దాని ననుగమించి, సువర్ణముఖరిం దాటి, యందు తపం బాచరించు శుకబ్రహ్మర్షికిం బ్రణామంబు లాచరించి, యమ్ముని యనుజ్ఞ నొంది, పోయిపోయి యొకసుందరోద్యానంబున భక్తాభీష్టప్రదాయినియు సురనికరారాధితయు వల్మీకరూపస్థితయు నగు రేణుకాదేవిం గాంచి నమస్కరించి, యటనుండి పశ్చిమాభిముఖుండై వెడలెను.

—: శ్రీనివాసనికటంబునందుండు పంచవర్ణశుకవృత్తాంతము :—

అటు కొంతదూరం బరిగిన నొకప్రదేశంబున బంచవర్ణమనోహరం బగు నొక కీరముం గాంచి, దానిం బట్ట నుంకించి, దాని వెంబడి నడచుచుండ, నయ్యది శ్రీనివాసా, శ్రీనివాసా యని బల్కుచు శీఘ్రతరంబుగ నెగురుచు వేంకటాద్రిపయి నిలచెను. అపు డీనరనాథుండును దాని యునికిం దెలిసికొని త్వరితగమనంబున నాయచలంబు నధిష్ఠించి, యందలి శిఖరంబులను, గుహాసముదయంబును గాంచుచు పోయి, యాచిలుకం గానక యవ్వనపాలకునిచెంత కేగిన, నాతండును భూపాలునిం గాంచి, లేచి, యెదురేగి, నమస్కారం బొనరించి, యంజలి ఘటించి నిలువంబడియెను. వానిం గాంచి యాధరణీపాలకుం డోయీ యిందులకు శ్రీనివాసా యని యుచ్చరించుచు పంచవర్ణశుకం బొండు వచ్చినయది. దానిం గాంచితివే యని యడుగ, నవ్వనపాలుం డిటులనెను. రాజా ! అయ్యది శ్రీనివాసున కతిప్రేమాస్పదం బగు శుకంబు. అయ్యది శ్రీదేవిచేతను భూదేవిచేతను ప్రతిదినంబును సువర్ధితంబగుచు యాదేవదేవుని నికటంబున యెల్లపుడును దిరుగుచుండును. మరియు స్వేచ్ఛగా నిన్నగవరంబునం జరించుచు సాయంతనసమయంబున శ్రీనివాసుని సన్నిధిం జేరుచుండును. దానిం బట్ట నెవరికిని వశంబుగాదు. రాజా ! నేనిపు డాదేవదేవు నారాధింప బోవుచుంటిని.

నేను మరలివచ్చునంతదనుక యీనాకుమారునితోడం గూడి సుఖంబుగ నిందు విశ్రమించి యుండుమనియె. అవ్వనపాలకుని పలుకు లాలించి యానరనాథుం డతని కిటులనెను.

—: తోండమన్నరపతి నిషాదునిం గూడి శ్రీనివాస నికటంబునకు బోవుట :–

ఓయీ వనచరోత్తమా, నేనుగూడ నీవెంబడి వచ్చెద. భక్తవరదుండును, సకలలోకసంరక్షకుండు నగు జనార్దనస్వామిని నాకుం జూడఁ గనుపరుపుము. అనుటయు, నవ్వనపాలకుండు సంతసంబంది మధుమిశ్రితంబును, సుపక్వంబును నగు శ్యామాకంబు నొక చూతపత్రపుటంబునం దమరిచి, చేత నుంచుకొని, యా నరనాథుతోడం గూడి, ముహూర్తమాత్రకాలంబున స్వామి పుష్కరిణీతీరంబునం బ్రవేశించి, యందా యిర్వురును విధ్యుక్తంబుగ స్నానం బొనరించి, యాతీరంబున శ్రీభూమీసహితుండును, చతుర్భుజుండును, పీతాంబరధారియు, మణికిరీటోజ్జ్వలశిరస్కుండును, శంఖచక్రగదాఖడ్గసమన్వితుండును, వివిధమణిమయభూషణభూషితుండును, కుమారారాధితుండును, వల్మీకగూఢపాదుండును, యాజానుబాహుండు నగు పరమేశ్వరుం జూపిన నా తోండమన్నరనాయకుం డపరిమితానందభరితుం డయ్యె. ఆజగన్నాథుం గాంచి సాష్టాంగదండప్రణామంబు లాచరించెను. ఆకిరాతవర్యుండును తనచే దేబడిన మధుసహిత శ్యామాకంబును భక్తిపురస్సరంబుగ నద్దేవునకు నివేదించి, పిమ్మట యందలి సగము నా రాజచంద్రున కొసంగి, మిగిలిన సగంబును తాను భుజించెను. పిదప నా పుష్కరిణీజలంబుల పానంబు గావించి, వార లిర్వురును శ్యామాకవనమందలి యక్కిరాతుని పర్ణకుటీరంబును జేరిరి. ఆరాజచంద్రుం డా రాత్రి యచ్చట వసించి, మరునాటి యుదయంబున సేనాపరివృతుండై నిజనగరంబున కరుగుదెంచెను.



—: తోండమన్నరపతితో రేణుకాదేవి తెలియంబరచిన విశేషములు :–

పిమ్మట నొకసమయంబున నమ్మహారాజుత్తుంగతురంగాధిరోహణం బొనరించి, రేణుకావనంబున కరిగి, యాతురంగమంబు నవతరించి, చైత్రశుక్ల నవమీదివసంబున యా రేణుకాదేవిం బూజించి, ధూపదీపాదుల నలరించి, సోపస్కరంబు లగు పంచభక్ష్యపరమాన్నంబులను, సురాఘటశతంబులను, పశుపలలంబులను నివేదించుసంత, నా రేణుకయు సంతుష్టాంతరంగయై వరంబుల నొసంగెను. అంత నొకపురుషశ్రేష్ఠుం డట కరుదెంచి ముందు జరుగబోవు వృత్తాంతమును వినుపించెద వినుము. 'నీరాజ్యము నిష్కంటకమై విరాజిలుచుండును. ఇందు నీపేరున నొక రాజధాని యావిర్భవించును. సకలభోగముల ననుభవించుచుఁ జిరకాలము రాజ్యపాలన మొనరింతువు. దేవదేవుని యనుగ్రహంబును సంపూర్ణముగ నొందగలవు' అను వచనంబు లాలించి, సంప్రీతుండై యటనుండి కదలి శుకమునిం గానం బోయెను.

—: పద్మసరోవరమహిమాతిశయవర్ణనము :–

అమ్మునిం గాంచి, వందనశతంబు లర్పించి, మహాత్మా! పద్మసరోవరమహిమంబును విన నుత్సుకుండనై యుంటిఁ గావున వినుపింపుమన నామునిశేఖరుం డిటులనియె– మున్ను కొండొక కారణంబున దుర్వాసోముని శాపవశంబున కమలాలయ కమలాక్షుం గూడి సురలోకమునుండి ధరణి కవతరించి, కనకకమలమనోహరం బగు నీసరిత్తటంబునం బ్రవేశించి పదివేలదివ్యవర్షంబులు తపం బొనరించుచుండెను. ఆసమయంబున పురందరాది బృందారకు లందరును యీసరస్తీరంబును జేరి, యందు నిజకాంతునిం గూడి, సువర్ణకమలంబునం దాసీనయై యుండెడు కమలాలయం గాంచి, లోకమాత యగు నాదేవికి ప్రణామంబు లాచరించి, యంజలి ఘటియించి వినుతించిరి. త్రిలోక

జననీ, పద్మాయతాక్షి, పద్మాక్షసుందరీ, పద్మవాసినీ, పద్మహస్తా, చతురాననజననీ, ప్రసన్నవదనాంబుజా, బిల్వవనవిహారిణీ, పక్వబింబఫలాధరా, పీనోత్తుంగస్తనభారావనతాంగీ, కనకాంగదకేయూరాది సురత్నఖచితసువర్ణాలంకారశోభినీ నీ కివియే నైకసాష్టాంగదండప్రణామంబులు. శరణాగతుల మగు మమ్ము నీకరుణాకటాక్షవీక్షణంబులం గనుంగొని రక్షింపుము. చతురానన, చతుర్బాహు, త్రిలోచనాది బృందారకనికరంబులు నీకటాక్షవీక్షణప్రసారంబునం జేసియే యున్నత పదంబుల నంది, రాజిలుచుండిరి. అంత సురనికరంబు లొనరించు నుతుల కలరి యక్కమలాలయ యిటు లనియె.

నిర్జరవరులారా! మీరలు రక్కసుల నుక్కడగించి మీమీ నివాసంబుల సుఖించెదరు. ఎవ్వారలు మీరిపుడు నుతించినటుల నను వినుతించుచు, బిల్వపత్రంబుల బూజింతురో వార లందరును ఇహంబున సకలభోగంబుల ననుభవించి, మోక్షము నొందగలరు. మరియు నీపద్మసరోవరంబునం దెవ్వారలు స్నాన మొనరించి నను సేవింతురో వారలు దీర్ఘాయురారోగ్యసమన్వితులై, సువర్చస్కులై, పుత్రపౌత్రాది పరివృతులై, యిహంబున సకలభోగంబుల ననుభవించి, యంతంబున మోక్షము నొందగలరు. అని పలికి, సురలకు వరం బొసంగి యప్పద్మాలయ నిజనాథుం గూడి, విహంగపుంగవు నధిరోహించి వైకుంఠంబున కరిగె.

-: తోండమన్నరపతి తన జనకునివలన రాజ్యము నొందుట -

ఇటుల పద్మసరోవరచరితంబును వినుపించి, యామునివరుండు రాజచంద్రునిం గాంచి యో నరపాలా! సర్వపాపప్రణాశకంబగు నిప్పద్మసరోవరంబు కీర్తనంబునను, స్నానంబునను మానవుల కఖండలక్ష్మీప్రదాయకంబై వెలయుచున్నది. నీవుగూడ నిందవగాహనం బొనరిచి, నీజనకునికడ కరుగుమనుటయు, నమ్మునిచంద్రుని పలుకు లాలించి, యానరనాథనందనుండు పద్మసరోవరంబున మున్కలిడి, యా



మునిశేఖరునకు నమస్కృతు లొనరిచి, మనోజవంబగు నుత్తుంగమంగళతురంగంబు నెక్కి యటనుండి వెడలెను. మందిరంబునకుం జనుదెంచిన కుమారుం గాంచి యాతని జనకుం డాసుగుణఖని యగు కుమారుని యువరాజుంగా నొనరిచి మూడు వత్సరంబులు గతించునంత నత్తనూభవుని శౌర్యౌదార్యాదిగుణంబులను, సౌశీల్యంబును, ప్రజారంజనంబును, భూసురులయెడ భక్తియు, భగవదారాధనపరతయుం దిలకించి, ప్రహృష్టాంతరంగుడై, హితసామంతభటనికరసైనికసమన్వితం బగు సామ్రాజ్యంబున కభిషిక్తుం గావించెను. అక్కుమారున కనేకధర్మంబుల నుపదేశించి, జాయాయుతుండై యమ్మహారాజు తపం బొనరింప విపినంబుల కేగెను.

-: నిషాదపతికి వల్మీకంబున వరాహదర్శనంబగుట :-

తోండమన్నరపతి సామ్రాజ్యంబు నొంది, నీతిదప్పక రాజ్యపాలనం బొనరించుచుండెను. ఇటులుండ, నిషాదవనంబున దేవదేవుండు వరాహరూపంబున శ్యామాకపక్వంబును భక్షించుచుండ, నానిషాదపాలకుండు పగటిభాగమునందు వరాహపదచిహ్నంబుల వెదకుచు దిరుగుచుండెను. కాని యెంతగ వెమకినను పదచిహ్నంబు లించుకయు గానరాకుండెను. అంత నాకిరాతోత్తముండు నొకనాటి రేయి నిదుర వీడి, శరాసనంబుల గరంబుల గీలించి, శ్యామాకవనపాలనం బొనరించుచుండ, నర్ధరాత్రంబున కోటిచంద్రసంకాశతేజోవిభ్రాజితంబై, మనోహరాకారంబై యవ్విపినంబున జరించుచుండు కిరివరునిం గాంచి ధనుష్టంకారం బొనరించుచు, సింహగర్జనంబు లొనరించెను. అంత నవ్వనవరాహం బాధ్వని నాలించి, యవ్వనంబును విడిచి, ద్రుతగమనంబున పలాయన మొనరించెను. కిరాతుండును దానివిడువక, విలు నమ్ములుం గొని, దాని వెన్నంటి బరువిడి పోవుచుండెను అంత వేకువ యయ్యెను. అప్పు డాభూదారంబు వనచరుండు చూచుచుండ నొక వల్మీకంబునం బ్రవేశించెను. కిరాతుండును క్రోధానలదందహ్య

మానమానసుండై యెట్లైన నీవరాహంబును పట్టవలయు నని తలంచి యవ్వల్మీకంబును ద్రవ్వించి, యందుండెడు వరాహమూర్తిం గాంచి మూర్ఛనొంది, యిలపై వ్రాలెను.

అంత నక్కిరాతుని కుమారుండు వరాహదేవు ననేకవిధంబుల బ్రస్తుతింప, నవ్వరాహదేవు డానిషాదనాయకునం దావేశించి, యాతని కుమారున కిటులనెను. నేను వరాహదేవుండను. సర్వకాలములందు నివ్వల్మీకమునందు నివసించియుందును. నీవృత్తాంతంబును నరనాథున కెరింగించి, నన్నిచట బ్రతిష్ఠించి పూజింపవలయును. ఇవ్వల్మీకంబును కపిలాగోక్షీరంబులం దడిపిన, నిందుండి యొక శిల బయలువెడలును. అయ్యది వారాహశిల యనం బరగు. దానియందు వరాహమూర్తిం బ్రతిష్ఠించి, విప్రవైఖానసులం గలసి తొండమన్నరనాయకుండు వివిధ భోగంబుల నారాధించుగాత యని పలికి, యాదేవదేవుండు కిరాతుని విడచిన, నక్కిరాతుండు స్వస్థచిత్తుం డయ్యెను. సుఖాసీనుండగు తండ్రిం గాంచి, నమస్కరించి, యానిషాదకుమారుండు భగవద్భాషణంబుల యథాక్రమంబుగ జనకునకు నివేదించెను. ఆవచనము లాలించి యక్కిరాతోత్తముండు విస్మయాక్రాంతమానసుండై మంగళాకరంబులగు భగవద్వచనంబుల నానరేంద్రునకుం దెలుప, దన పరివారంబుతోడం గూడి నిషాదశేఖరుం డగు వసువు నరనాయకమందిరద్వార నికటంబును చేరెను.

—: తొండమన్నరపతికి నిషాదనాయకుం డగు వసునామకుండు వరాహవృత్తాంతంబును వచించుట :—

ఆరాజద్వారమందలి ద్వారపాలు రానిషాదుని రాకను మహారాజునకు విన్నవింప, నవ్వనచరపుంగవుని సభామధ్యంబునకుం దోడ్కొని రండని యాజ్ఞాపింప, సానుచరుండును, సపుత్రకుండు నగు నన్నిషాదుని సభలోనికి ద్వారపాలురు తోడ్కొనిపోయిరి. రాజచంద్రుం డాతనిం



గాంచి, సముచితసత్కారం బొనరించి, యమితానందకందళితహృదయారవిందుండై యవ్వనగోచరున కిటులనియె.

ఓయీ వనేచరసత్తమా! నీవెందులకై యిట కరుదెంచితివి? సత్వరంబుగ వచింపు మన, నవ్వసు విటులనియె. భూమహేంద్రా! నే నివసించు విపినంబున సంభవించిన విస్మయజనకం బగు నొక చరితంబును నీకు విశదీకరింప వచ్చితిని. వినుము— శ్యామాకవనంబున స్వేచ్ఛగ దిరుగుచుండు నొక శ్వేతవరాహముం గాంచి, శరశరాసనంబులం గైకొని, వాని వధింప నుద్యమింప, నద్దియు నతిజవంబున బరువిడి పోవుచుండ, నేనును దాని వెన్నంటి బోవ, నయ్యది వాయువేగంబున బోయి నేను జూచుచుండ నొక మహోన్నతంబగు వల్మీకంబునం బ్రవేశించెను. నే నద్దానిం గాంచనేరక క్రోధావిష్టమానసుండనై యాపుట్టను త్రవ్వించి మూర్ఛనొంది ధరణిపై వ్రాలితిని. నాతనయుండు ననుం గాంచి భయభ్రాంతచిత్తుండై, శుచియై, మధుసూదను ననేకభంగుల నుతించెను. ఆనుతులకు సంప్రీతుండై యాజగన్నాయకుండు నాయం దావేశించి నాకుమారునితో నిటులనియెను.

ఓనిషాదనందనా! నాచరితంబును సమగ్రంబుగ నరనాథున కెరింగింపుము. కపిలాగోక్షీరంబులచే నాపుట్టను తడిపిన నందొక మంగళకరంబగు శిల నయనగోచరం బగును. ఆశిలయందు వామాంకంబున మహీమానిని గల్గియుండునటుల వరాహవదనుండనై యుండునటుల నాప్రతిమను శిల్పవిద్యావిశారదులవలన చిత్రింపజేసి, వైఖానసమునివరులం గూడి యాతొండమన్నరపతి నన్నిట బ్రతిష్ఠించి పూజించుగాత. మరియు వల్మీకావృతపాదద్వయుం డగు శ్రీనివాసుం జేరి కపిలాగోక్షీరంబుల బ్రతిదినంబునను పాదపీఠపర్యంతము మెలమెల్లగ కడిగి, దక్షిణోత్తరదిగ్భాగంబులం బ్రాకారనిర్మాణముం గావింపవలయును. ఇటు బలుకుచుండ కమలాకాంతుండు నన్విడచినంత నేనును స్వస్థచిత్తుండనైతి. ఇది యంతయు నాకుమారునివలన నేను విని నీకు విన్నవించితిని.

—: తొండమన్నరపతి నిషాదవచన, స్వప్నంబులచే బిలమార్గంబున శేషాచలంబునకుఁ బోవుట :—

నిషాదాధీశుండు వచించిన వచనంబుల నాలించి, మానవనాయకుండు సంప్రీతమానసుండై పరమాశ్చర్యంబు నొంది, మంత్రిసత్తములం గలసి, వేంకటాచలంబునకుఁ బోవ నిశ్చయించి, సత్వరంబున గోపాలకుల బిలువనంపి, వారల కిట్లనియె. ఓగోపాలకులారా! మన గోబృందంబులందలి కృష్ణకపిల వర్ణంబులు గల గోవుల నన్నిటిని వాటి లేగలతోడం గూడ వేంకటాచలనికటంబునకు రప్పింపవలయునని యాజ్ఞాపించి రేపటిదినంబున పయనంబని పలికి, మంత్రులను పురోహితాది పురజనులను విడిచి, నిజాంతఃపురంబునం బ్రవేశించెను. నిజదారల కావృత్తాంతమును సవిస్తరముగ దెలియజేసి హంసతూలికా తల్పంబున సుఖంబుగ నిదురించెను. ఆనిదురలో శ్రీనివాసుం డొక బిలమార్గంబును కనుబరచినట్లును, అమ్మార్గంబున దన నగరంబు మొదలుగ బిలంబువరకును మృదుపల్లవంబుల బరచినట్లును స్వప్నముం గాంచి, ప్రాతఃకాలంబున లేచి, సత్వరంబుగ మంత్రివర్యులను, భూసురపుంగవులను, పురజనులను రావించి, స్వప్నవృత్తాంతమును వారలకు విన్పించి, పురద్వారంబును చేరునంత, నాద్వారదేశంబు మొదలుగ మార్గంబంతయుఁ బల్లవాకీర్ణంబై గన్పట్టె. నరనాథుండా చందముం గాంచి, మహానందరసనిమగ్నుండై యొక సుముహూర్తంబున వాయువేగ మనోవేగంబుల ధిక్కరించు గమనంబున భాసిలు నుత్తమతురంగంబు నధిరోహించి, మార్గమందలి పల్లవరచనలం గాంచుచు క్రమంబుగ బిలద్వారంబును జేరి యందొకపురవరంబును నిర్మించె.

—: భగవద్వచనానుసారంబున తొండమన్నరపతి క్షీరాభిషేక, వప్రనిర్మాణంబు లొనరించుట :—

నగరనిర్మాణానంతర మాబిలంబు నంతఃపురంబునకు జేరునటుల



గావించి, పురంబును ప్రాకారపరివేష్టితంబు గావించి, రాజ్యంబును నిస్సపత్నంబుగా నొనరిచి, దేవదేవుం డానతిచ్చిన విధంబున ప్రాకారనిర్మాణం బొనర్ప నుద్యుక్తుండై యుండు నంత, నారమామానినీమనోహరు డిట్లులాజ్ఞాపించెను రాజా! నీవిందుండెడు తింత్రిణీ, చంపక వృక్షంబుల రెంటిని సంరక్షింపుము. ఈ చించాతరువరంబు నాకును, చంపకవృక్షంబు కమలాలయకును ప్రియకరంబులు. ఆ రెంటియందున మేమిద్దరమును నివసించి యుందుము. అందువలన దేవతలకును, మహామునులకును గూడ వందనీయంబులు. నరవరా, యీ రెండు భూరుహంబుల నిలిపి యుంచి, తక్కుంగల మహీరుహంబుల ఛేదించి, యీప్రదేశంబును బాగుపఱచి, యందున ద్వార గోపురయుతం బగు ప్రాకారంబును నిర్మింపుము. విమానంబును నీవంశంబున బుట్టి మద్భక్తుండై, నారాయణాభిఖ్య నొప్పారు ధరారమణీరమణుండు నిర్మాణం బొనరించి, దాని సువర్ణాలంకృతంబు గావింపగలం డని వచించి యూరకుండుటయు, నాభూకాంతుం డారమాకాంతునకు ప్రాకారనిర్మాణం బొనరించి, నిత్యంబు నాదేవదేవు నారాధించుచు ధర్మమార్గంబున రాజ్యపాలన మొనరించుచుండెను.

—: గంగాస్నానాగత వీరశర్మాఖ్య విప్రచరిత్రవర్ణనము :—

ఆసమయంబున దాక్షిణాత్యుం డగు భూసురోత్తముం డొకరుండు గంగాస్నానాభిలాషచే కళత్రయుతుండై యిలు వెడలెను. ఆతని భార్య గర్భవతి యగుటంజేసి మార్గమధ్యంబున నాథునితో నడువలేక అలసట నొందుచుండెను. ఆమెం గాంచి యవ్విప్రుండు రాజగృహంబునం దామె నునిచి పోవుట కాలోచించి, యారాజుం గాంచ నెంచి రాజమందిరద్వారముచెంత జేరి నిలువంబడియుండెను. ద్వారపాలు రాతనిం గాంచి, మీర లెందులకై యిటు వచ్చితి రన నా రాకను మీ రాజున కెరిగింపు డనవుడు, ద్వారపాలురు నరనాథునకు భూసురేంద్రుని రాకను వినుపింపగ, నాతండు శీఘ్రంబున దోడ్కొని రం డను

నంత, వారలా ద్విజపుంగవుని రాజసమక్షంబునకు గొంపోయిరి. రాజచంద్రుం డాభూసురోత్తముం గాంచినంత నెదురేగి, ప్రణమిల్లి సముచితాసనంబునం దుపవిష్టుం గావించి, కుశలం బడిగి తానుగూడ నిజాసనంబునం గూర్చుండి యిటులనియె. మహీసురసత్తమా! మీరలిందులకు రాం గతం బెయ్యది? నావలన నేమికార్యము నుద్దేశించి యిటు వచ్చితి రనుడు నయ్యవనీసురుం డిటులనెను. రాజా! నేను వసిష్ఠగోత్రంబున జనించినవాడను. సామవేదిని. వీరశర్మ యనుపేరం బరగువాడను. జాయాయుతుండనై గంగాస్నానాభిలాషంబునం బయలు వెడలినాడను. సుశీలయు, పతివ్రతయు, లక్ష్మీనామసమన్వితయు నగు నాభార్య గర్భవతియై యుండుకతంబున నడువజాలకున్నయది. అందువలన నామెను నీమందిరంబున నుంచి పోవందలంచి వచ్చినాడను. రాజా! దయయుంచి నేను మరలి వచ్చునంతదనుక నియ్యంగనకు భుక్తికి స్వలయు పరికరంబుల నొసంగి పాలింపుమనియెడు నావిప్రుని వచనంబుల విని, యానరపతి యందులకు సమ్మతించి, యారు నెలలకు వలయు దండుల ధనాదికంబుల నొసంగి, యంతఃపురంబునందలి యొక గృహంబు నాబ్రాహ్మణి కొసంగి యందుండుమనియె.

మహీసురుం డావీరశర్మయు, కళత్రంబు నందు విడిచి సంప్రీతమానసుండై గంగాస్నానంబునకుం బోయి, ప్రయాగక్షేత్రంబున, భాగీరథీజలంబుల మునకలిడి, పిమ్మట గాశికాపురంబునం బ్రవేశించి, యందు మూడుదినంబులు గడిపి, యటనుండి గయకు బోయి, శ్రద్ధాభక్తిసమన్వితుండై యచ్చట పితృశ్రాద్ధాదికం బొనరించి, యటనుండి యయోధ్యకుం జని, పిదప గ్రమంబుగ బదరికాశ్రమంబును, సాలగ్రామక్షేత్రంబును గాంచి, యిటు లొకక్షేత్రంబునుండి మరియొక క్షేత్రమునకు బోవుచుండ రెండేండ్లు గతించెను.

పిదప నావీరశర్మ మరలి తనపురంబును చేరందలంచి కతిపయ ప్రయాణంబు లొనరించి చైత్రమాసంబున శుక్లపక్షమందలి యేకాదశీ



శుభదినంబునం దాభూపాల నికటంబునకు జనుదెంచెను. మానవనాథుం డాబ్రాహ్మణి నంతఃపురంబునకు బంపుటయెగాని, మరల నయ్యతివను మనంబుననైనను దలంపకుండెను. అక్కారణంబున నాబ్రాహ్మణుని భార్య యయ్యంతఃపురగృహంబున మరణించి శుష్కించి యుండెను.

వీరశర్మ రాజును సమీపించి గంగాతోయకరండంబు నొకదాని న్విప్పి, శుభదాయకం బగు నొక గంగాకలశంబు నారాజున కొసంగి, నరనాథా! నాజాయ సుఖంబున నున్నదియే? యని వచించునంత, నా రాజచంద్రుండు విప్రోత్తమా వచ్చెద నుండు మని బలికి, సత్వరమ్ముగ నంతఃపురంబునకుం బోయి గనుంగొన, నయ్యతివ మరణించియుండెను. ఆరాజన్యుం డాచరితంబును మహీసురున కెరిగింపకయే యయ్యంతఃపురమందలి బిలంబునం బ్రవేశించి పోయి నరసింహస్వామికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి, యటనుండి శ్రీభూజాయాయుతుండగు శ్రీనివాసుం గాంచగ బోయిన నాధరారమణుని ధరారమాసమన్వితుం డగు మధుసూదనుం డవలోకించి రాజా! నీవిటులకాలంబున నిటకు రా గతం బెయ్యది? నినుం గాంచిన నెద్దియో భీతిం నొందినవాని తెరంగున గనుపించుచుంటివి. కారణ మెద్దియో యెరింగింపు మన, నమ్మహారాజు దుఃఖాకులితస్వాంతుండై విప్రజాయామరణవార్తను వినుపింపగ విని యారమానాయకుం డిటులనియె.

—: అస్థిసరోవరమహిమల వర్ణనము :—

రాజా! నీవిందుల కించుకయు భయ మొందకుము. ఆవిప్రకళత్రంబు నంతఃపురాంగనలతోడంగూడ నాందోళికయం దధిరోపించి, మదాలయపూర్వభాగంబున నుండు నపమృత్యునివారకం బగు నస్థినామక సరోవరంబున స్నానము చేయించిన మరల సజీవురాలగును. పిమ్మట నాబ్రాహ్మణి నాబ్రాహ్మణున కొసంగుము. ఇక నాలసింపక సత్వరంబుగ బోయి మద్వచనానుసారంబుగ గావింపుము. వేగముగ

గొమ్ము. అను పలుకుల విని, మహానందభరితుండై, యా లోక నాయకవచనామృతంబును కర్ణపుటంబుల బానంబొనరించుచు, స్వపురంబున కరిగి, సుందరాందోళికలందు నిజాంతఃపురతరుణీరత్నములను, విప్రజాయను గూడ నెక్కించి పంచి, తానుగూడ నవ్విప్రోత్తముని ముందిడుకొని దేవతాదర్శనం బొనరిచ్చి, యయ్యస్థిసరోవరంబునం దయ్యువిదల నవగాహనం బొనరింపజేసిన- వారలు త్వగస్థిరూపిణియగు నవ్విప్రకళత్రంబు నారాజాంతఃపురాంగన లాసరోవరజలంబులం బడవైచిరి. అంతలోన నవ్విప్రకళత్రం బగు లక్ష్మి యాసరోవరంబునుండి లేచి రాజదారలతోడం గూడి యాసరోవరతటంబునం జేరి, చిరకాలాగతుండగు భర్త నవలోకించి, సంతుష్టమానసయై, పాదంబుల వ్రాలి, నమస్కరించి, చెంగట నిలువంబడిన గాంచి, రాజచంద్రుం డమితానందభరితుండై శ్రీహరి నారాధించి యవ్విప్రసత్తమునకు సహస్రనిష్కపరిమితంబగు విత్తంబును, దివ్యాంబరభూషణాదుల నొసంగి, స్వదేశగమనం బొనరింపు మన, నన్నరనాథున కనేకాశీర్వచనంబుల నొసంగి, యాభూసురుండు తనపురంబునకు బోయెను.

పిదప శ్రీనివాసుండు మానవనాయకున కిటులనియెను. నీవు ప్రతిదినంబునను మధ్యాహ్నకాలంబున నిట కరుదెంచి, మహానివేదనానంతరమున యథేష్టంబుగా బంగరు తామరపూలచే నను బూజించి, స్వపురీవరంబునకు బోయి ధర్మమార్గ మిసుమంతయు నీడక రాజ్యపాలనం బొనరింపుము. అటు లొనరింతువేని నీమనోభీష్టంబు లన్నియు నిస్సంశయంబుగ నెరవేరగలవు. నీవెపుడును సమయముగాని సమయంబున నిటకు రావలదు. నేను వచించినతీరున కాలార్చనం బొనరిచ్చి పురంబునం జేరి సుఖంబుగ నివసింపుము. ఇటు లాజగన్నాథుండు వచింప, నమ్మానవనాథుండును దేవదేవా! నీయాజ్ఞ ననుసరించి యటులనే చేయుదు నని వచించి, నాఁడాదిగ ప్రతిదినంబునను కనక కమలంబుల నయ్యీశు నర్చించుచుండెను.



—: కుర్వగ్రామ నివాసి యగు భీముం డను
కులాలవంశజాతుని వృత్తాంతము :—

ఇటుల దినంబులు గడచుచుండ, నొకదినంబున పరమేశ్వర పాదమూలంబున మృణ్మయం బగు తులసీపుష్పసముదయముం గాంచి పరమాశ్చర్యనిమగ్నమానసుండై యారమాకాంతామనోహరున కా నృపపుంగవుం డిటులనియె. ఓజగదీశ్వరా! నాకంటెను ముందుగ నీపదకమలంబుల మృణ్మయంబులగు తులసీదళంబులచేతను కమలనికరంబుచేతను పూజగావించు ధన్యతముం డెవండు? యెందున్నవాడు? వినదలతు విఃపింపు మన, నమ్మధువిరోధి స్మరణంబు నభినయించి యిటుల వచించెను. ఓరాజా! కుర్వగ్రామంబున మద్భక్తుండును, కులాలవంశసంజాతుండు నగు భీముం డను మానవోత్తముం డొకరుండు గలడు. అతం డనుదినంబునను తనయింటియంద నను బూజించుచుండును. ఆసమర్చనంబును నే నంగీకరించుచుందును. అని పలుక నన్నరనాథుండు పులకీకృతాంగుండై యావైష్ణవోత్తముం డగు కులాలు నవలోకింపదలంచి కుర్వగ్రామముం జేరి, యాకులాలుని మందిరప్రాంగణంబును జేరు నవసరంబున- ఆకుమ్మరియు ధరణీకాంతున కెదురేగి పాదంబుల వ్రాలి, ముకుళితకరకమలుండై నిలువంబడియె. వానిం గాంచి నృపపుంగవుం డిటులనియె. ఓయీ! భీమనామక కులాలవంశోత్తమా, నీ వాపరమేశ్వరారాధనం బెటు లొనరించుచుంటి వనవు డక్కులాలుం డిటులనియె. రాజా! నేనమ్మధుసూదనసమారాధనం బన నెద్దియో యించుకయు నెఱుంగను. కులాలుండు పురుషోత్తము నారాధించుచుండునని నీ కెవ రెఱింగించి రన, మనుజాధిపుం డిటులనియె. ఓమృద్భాండనిర్మాణకుశలా! నీవొనరించు పూజాదికచరితంబు నా శ్రీకాంతుండే నాకు వినుపించెను. అను పలు కాలకించి మున్నామధుసూదనుండు తన కొసంగిన పరప్రదానంబును సంస్మరించి నృపచంద్రా! శ్రీవేంకటేశుండు నాకొసంగిన వరమును వినుము. ఏనాడు నీవొన

రించు నాసపర్యావిషయము వెల్లడి యగునో, యేనాడు తొండమన్నరపతితో వాదప్రతివాదంబులు సంభవించునో యానాడు నిస్సంశయంబుగ మోక్షము నొందగలవని వరం బొసంగెను.

—: కుర్వగ్రామనివాసి యగు కులాలవంశసంభవు డగు భీముండు కళత్రయుతుండై వైకుంఠమునకు బోవుట :—

అని వచించుచుండ దివ్యవిమానారూఢుండై జనార్దనుండు చనుదేరం గాంచి, యాకులాలదంపతు లిర్వురును కమలాకాంతునకు నమస్కృతు లొనరించి, యాక్షణంబుననె యసువుల బాసి, దివ్యరూపధరులై యద్దివ్యవిమానంబు నధిరోహించి వైకుంఠముం జేరిరి. నరనాథుండియ్యది గాంచి మహానందభరితాంతరంగుండై యటనుండి బయలువెడలి తన నగరంబునం బ్రవేశించి శ్రీనివాసనామవిరాజితుం డగు కుమారుని విధివిధానంబుగ సామ్రాజ్యాభిషిక్తుం గావించి, యాతనికి పరిపాలనావిధానంబుల బోధించి, ధర్మమార్గము నవలంబించి రాజ్యపాలనం బొనరింపుమని వచించి, యఖండతపం బొనరించె.

—: శ్రీకాంతుని యనుగ్రహంబున తొండమన్నరపతి విష్ణుసారూప్యంబు నొందుట :—

ఆనరేంద్రుని తపంబునకు సంతసంబంది యా శ్రీనివాసుండు భూరమాకాంతలతోడం గూడి విహంగతురంగమంబు నధిరోహించి యా నరనాథు నెదుట బ్రత్యక్షంబై, రాజా! నీతపంబున కెంతయు సంతసించితి. నీకు వలయు కార్యమెద్దియో వచింపు మనవు డన్నరపతి యిటు లనియె. దేవా, సకలలోకసంరక్షకా! సకలామరసంస్తూయమానవిభవోపేతా, నీలోకంబున వసింప నిచ్ఛ జనించినయది. నా మనోభీప్సితంబు వేరెద్దియు లేదు. నీ కరుణాకటాక్షవీక్షణంబుల నాపయిం బ్రసరింపజేసి నను సంప్రీతుం గావింపవే యని పలుకుచు నాసరసిజాక్షుని పాదతలంబున వ్రాలి, సాష్టాంగదండప్రణామంబు లాచరించు తక్షణంబుననే యసువులబాసి, దివ్యవిమానంబు నధిరో



హించి, గంధర్వవరసంస్తూయమాన వైభవోపేతుండై, విష్ణుసారూప్యంబు నొంది శోకమోహాదిరహితంబును, జరామరణవర్జితంబును, పునరావృత్తిశూన్యంబు నగు విష్ణుపదంబు నొందెను. ధరణీరమణీ! ఈభవిష్యచ్చరితంబును వినుపించితిని. ఎవ్వరీపావనచరితంబును వినుపింతురో, యెవ్వార లేకాగ్రమానసులై శ్రద్ధాభక్తిసమన్వితులై వినుచుందురో, వారలు విష్ణుసాయుజ్యంబు నొందగల రని వరాహదేవుండు ధరణీకాంతకు వినుపించిన పావనచరితంబును వినుపించితి నని సూతుం డామునివరులం గాంచి, దేవదేవుని ముఖచంద్రనిరర్గళవినిర్గతంబగు పుణ్యకథామృతంబు నేమహాత్ములు కర్ణపుటంబులం గ్రోలి సంప్రీతులయ్యెదరో, యెవ్వార లీచరితంబును పఠింతురో వారలందరు నిహంబున సమస్తసుఖంబుల ననుభవించి తుదకు విష్ణులోకంబు నొందగల రని వచించి యాసూతుం డిటులనియె.

—: స్వామి పుష్కరిణీస్నానంబున కాశ్యపునకు మహా పాతకనాశనం బగుట :—

భూసురపుంగవులారా! పావనతమం బగు నొక కథను లక్ష్యంబుగ నుంచుకొని, మంగళప్రదం బగు స్వామి పుష్కరిణీవృత్తాంతమును వినుపింతును. సావధానమానసులై వినుండు. తొల్లి కాశ్యపుం డను విప్రపుంగవుండు పుణ్యప్రదం బగు నీతీర్థంబున స్నాన మొనరించి మహాఘోరనరకప్రదం బగు పాపంబునుండి విముక్తుం డయ్యె నన, మహాత్మా! కాశ్యపుం డన నెవ్వరుండు? ఆతం డొనరించిన పాతకం బెట్టిది? స్వామిపుష్కరిణీతీర్థస్నానమాత్రంబున నాక్షణంబుననే ముక్తుం డెటులయ్యె? నాచరితంబును సవిస్తరంబుగ వినవలయును. భవద్వచనామృతపానసంతృప్తుల మగు మాకు పిపాసకూడ జనింపకుండు ననుటయు, నాసూతుం డిటుల వచించెను. మునిచంద్రులారా! స్వామిపుష్కరిణీతీర్థమాహాత్మ్యప్రతిపాదకంబును, సకలాఘౌఘనివర్తకంబు నగు నొక యితిహాసంబు గలదు. వివరించెద వినుండు.

—: పరీక్షిద్వృత్తాంతము :—

హస్తినాపురంబు నివాసంబు గల్గి ధర్మమార్గ మిసుమంతయు విడువక భూపాలనం బొనరించుచు మిగుల బ్రఖ్యాతిం గనిన చంద్రవంశసముద్భవుండును, అభిమన్యుతనూభవుండు నగు పరీక్షిత్తను నరనాయకుండు కలండు. ఆతండు రాజ్యపాలనం బొనరించు నొకసమయంబున మృగయాసక్తచిత్తుండై, యతిభయంకరం బగు కాంతారంబున జరించుచు క్షుత్తృష్ణాపరిపీడితుండై, నిజసాయకవిద్ధం బగు గాత్రంబై, యదృశ్యంబైన మృగంబు నొకదాని నెమకుచు నయ్యరణ్యంబునం దొక సుందరతీరతరువరశోభితం బగు నొక యాశ్రమంబున ధ్యాననిమీలితలోచనుండగు నొక మునివరుం గాంచి వందనమాచరించి యిటులనెను. మునిచంద్రమా! మత్సునిశితబాణభిన్నగాత్రం బగు నొక మృగం బిటు వచ్చినది. దానిం గాంచితివే? కనుకొంటివేని యది యుండిన తావును తెలియజేయు మన, నాయోగిపుంగవుండు సమాధిస్థితుండై మౌనముద్ర వహించి యున్నకతంబున నించుకయుఁ బ్రతివచనంబును పలుకకుండెను. అంతల నారాజన్యుండు కుపితుండై యందు బడియున్న మృతభుజంగంబు నొకదాని నాతండు ధనుష్కోటియందు దవిలించి తెచ్చి యామునిశేఖరుని భుజంబున వైచి స్వపురంబున కేగెను.

ఆమునిసత్తమునకు శృంగి యను కుమారుండు గలండు. ఆతనికి కృశనామకుం డగు ద్విజవరుండు నేస్తగాడు. వారలిర్వురును ఆసమయంబున ఫలసమిత్కుశాహరణార్థంబుగ నందలి సమీపారణ్యంబున కరిగియుండిరి. పిదప కొంతవడి కయ్యిర్వురు నాశ్రమంబునకు మగిడి వచ్చి, యాశాపాయుధచక్రవర్తి భుజంబున వ్రేలుచున్న మృతసర్పముం గాంచి కృశాఖ్యుం డాశృంగితో నిటులనియె. మిత్రమా! భవజ్జనకుం డిటుల మృతసర్పంబును భుజస్కంధంబున ధరించియుండుటకు కారణమేమైయుండును? నీచుండెవ్వండైన యిటు లొనరించియుండెనని తలంచుచుంటి నన క్రోధమూర్ఛితుండై యాశృంగి దివ్యజ్ఞానంబున



జరిగిన చరితంబును తెలిసికొని యెవ్వం డిటుల మృతసర్పంబును మద్గురుని భుజంబున వైచెనో యాతండు తక్షకాహిదష్టుండై యేడు దినంబులు గతించులోపల మరణంబు నొందగలం డని శాప మొసంగెను. అంత నమ్మునిశేఖరుం డగు శమీకుండు సమాధి జాలించినంత, కుమారుడు పచించిన భయంకరంబులగు శాపవచనంబుల న్విని, సుతు నవలోకించి యిటులనెను. కుమారా! సకలభూభారవహుండై సకలలోకరంజకంబుగ ధర్మమార్గము నించుకయును విడువక రాజ్యపాలనం బొనరించు నరేంద్రు శపించు టది యొప్పునే? అరాజకంబగులోకంబున మన మెత్తెరంగున వసింపగలము? క్రోధాతిరేకంబున చరించువారలకు సుఖ ముండునే? అయ్యది విశేషపాపపుంజమున కాధారము. దయాక్రాంతచిత్తుండు మిక్కిలి సుఖమందును. పుణ్యాత్ముండగును. ఎవ్వండు క్రోధానలజ్వాలామాలికలను క్షమాజలసంమోహంబున నార్పం జాలునో యట్టి పుణ్యాత్ముం డిహపరంబుల నఖండం బగు సుఖపరంపర ననుభవింపగలండు. క్షమాన్వితులగు పూరుషు లమితయశంబు నొందగలరు. తనయా! నయంబును విడియెంతటి దారుణకార్యం బొనరించితివి! ఇపు డేమిసేయవలయు నని పరిపరివిధంబుల జింతిలుచు నత్తపస్వి తనకు ప్రియతమాంతేవాసి యగు గౌరముఖుం డనువానిం బిలిచి యిటులనియె. ఓయీ గౌరముఖా! నీవతిత్వరితగమనంబున బోయి పరీక్షిన్నరేంద్రుం గాంచి, వానికి నాకుమారుం డొసంగిన శాపంబును విపులంబుగ వినుపించి తక్షకభుజంగదష్టుం డగుట తప్ప దని తెలియబలికి యతిరయమ్మున మరలి రమ్ము పొమ్ము. అనుటయు నాగౌరముఖుం డాక్షణంబున నే బయలుదేరి పోయి సుభద్రానందననందనుండగు పరీక్షిన్నరేంద్రుం గాంచి యిటులనియె.

భూపాలకతిలకా! భరతవంశపవిత్రా! పరీక్షిన్నరేంద్రా! మద్గురువరుం డగు శమీకమునిచంద్రుని భుజంబున నీవు బడవైచిన మృతసర్పముం గాంచి యమ్మునికుమారుం డగు శృంగి క్రోధానలదందహ్య

మానమానసుండై నేటి కేడవరోజు గతించులోపల తక్షకమహోరగదష్టుండవై యవ్విషాదాగ్నిచే దగ్ధుండ వగునటుల నీకు శాపం బొసంగి యున్నవాడు. మహాత్ముండగు శమీకుండు తన కుమారుండు దయావిహీనుడై పలికిన శాపంబున కెంతయు వగచి సదయుండై శాపవృత్తాంతమును నీకు తెలియజేయు మని నను బుత్తెంచెనని వచించి యామునిశిష్యుండు వచ్చిన త్రోవంబట్టి పోయెను. మునిశిష్యుండు వెడలినపిదప నన్నరపాలకుండు శోకవ్యాకులమానసుండై గంగామధ్యంబునం దంబరచుంబిశిరోభాగంబును, మహోత్తుంగంబును,సువిశాలంబును, ఏకస్తంభభాసురంబు నగు నొక మండపమును నిర్మాణంబుగావించి యాసౌధంబున తక్షకవిధ్వంసకదక్షు లగుమహాగారుడమంత్రవేత్తలతోడను,దివ్యౌషధప్రదాయకులగు విషవైద్యులతోడంగూడి దేవర్షి, బ్రహ్మర్షి, రాజర్షి పుంగవపరివృతుండై హృదయపంకజంబున సకలలోకసంరక్షకుడగు మాధవు బొందుపరచి, తత్పదారవిందంబుల జిత్తంబును హత్తించి యుండెను.

ఇటులుండ నయ్యేడవదివసంబున మాంత్రికోత్తముండును, దరిద్రుండును, ధనాకాంక్షియు నగు కాశ్యపుం డను విప్రుండు తక్షకవిషానలంబునుండి రాజచంద్రు నుద్ధరింపందలంచి బోవుచుండెను. తక్షకుండును విప్రవేషంబున బరీక్షితునిం గరువగ బోవుచుండెను. వార లిర్వురును మార్గమధ్యంబున గలసి ముచ్చటించుకొనుచు బోవుచుండ తక్షకుండు కాశ్యపున కిటులనియె. భూసురోత్తమా, నీవిపు డెందుల కేగుచుంటివి? పని యెయ్యది? వచింపుమన నాతం డిటువచించెను. ఓయీ ద్విజపుంగవా! పరీక్షిన్నరేంద్రుండు తక్షకవిషానలంబున దగ్ధుండగునని వింటిని. నామంత్రప్రభావంబుచే నవ్విషంబును శమింపజేసి యానృపపుంగవుని రక్షింప బోవుచుంటి నని పలుకఁ దక్షకుం డిటు లనియె. భూసురోత్తమా ! తక్షకుం డను గుండలీంద్రుండను నేన. నాచే గరువంబడినవాని బునర్జీవితునిగా చేయ వేలకొలంది వత్సరంబులు



మహామంత్రజపంబు లొనరించినను శక్యంబు గాదు. నీ కట్టి సామర్థ్యము గలదేని మనముంగలం గనుపట్టుచుండు శతయోజనోన్నతంబగు నిమ్మహాభూజంబును గరచెద. దీనిం బ్రతికించు శక్తి యుండె నేని కనుబరుపుము. అటు లొనరించిన నీసమర్థత దెలియనగు నని బల్కుచు నాభూజంబును గరచెను. నిమేషమాత్రంబున నాతరువరము భస్మావశేష మయ్యెను. అన్నగంబునం దంతకుమున్న యొకమనుజుం డారోహించి యుండెను. ఆతండును భస్మం బయ్యెను. తరువునందు మనుజుం డున్నటుల వార లిర్వురుంగూడ నెరుంగకుండిరి. అంత నా కాశ్యపుడు తక్షకునిం గాంచి ఫణీంద్రా! నాదగు మంత్రమహిమంబును గనుగొనుము. క్షణకాలంబున నీభూరుహంబు నెప్పటివలె గావించెదఁ జూడు మని యవ్విషానలదగ్ధంబయిన భూజంబు నెప్పటియటుల జీవింపజేసి ఫలపుష్పవిరాజమానంబుగ నొనరించెను. ఆతరువునందుండిన మనుజుండును జీవించి తరుశాఖలం గాననయ్యెను.

ఇటుల తరువరంబు సజీవంబగుడు తక్షకుండు విస్మయాక్రాంతమానసుండై కాశ్యపున కిటులనియెను. మహాత్మా ! మునివరుని పలుకు లన్యథా గాకుండ జూచుట మనకిర్వురకును గూడ సుఖకరంబు. నరవరుండు నీకొసంగు ధనమున కినుమడిగ ధనం బిచ్చెద. నామనవిని మన్నించి శీఘ్రంబుగ నిటనుండి వెనుకకు మరలిపొమ్మని బ్రతిమాలుకొనుచు నమూల్యంబులగు రత్నంబుల నాకాశ్యపున కిచ్చి యమ్మంత్రకోవిదుం డగు కాశ్యపుని వెనుకకు పంపించెను. ఆతండును జ్ఞానదృష్టిచే నరపాలుని యల్పాయుర్దాయవంతునిగా నెరింగి తన కిచ్చిన విత్తంబున కమితానందంబునొంది స్వాశ్రయంబునకు బోయెను. తక్షకుండును భుజంగవరుల నందఱం బిలిచి యోఫణీంద్రులారా! మీర లందరును మునిరూపంబుల నొంది పరీక్షిన్నరేంద్రునికడ కేగి యాతని కుపహారంబులుగా నొసంగు డని పలుక నాభోగిపుంగవు లందరును తక్షకు నాజ్ఞను శిరంబులం దాల్చి యవ్వెంటనే మునివేషధారులై రాజసమీ

పంబునకుం బోయి ఫలము లానరనాయకున కొసంగిరి. తక్షకుం డొక బదరీఫలంబునం దొక క్రిమిరూపంబున నణఁగియుండెను.

అంత నాభూకాంతుండు విప్రరూపధరులగు భోగివరు లొసంగిన ఫలంబుల నట నుండెడు మంత్రివృద్ధుల కొసంగి మనోహరంబు, నతి స్థూలంబు నగు నొక ఫలంబును తనచేతియం దుంచుకొనెను. అంత నారాజచంద్రునకు రాబోవు నాపదను గాంచలేకనో యన దినకరుం డస్తాచలకందరంబునం బ్రవేశించెను. అచ్చట నుండెడివార లందరు నొకరి నొకరు గాంచుచు మునిశాపవచనంబులు వ్యర్థము లగునే యని వచించుకొనుచుండిరి. అంతలోన నానరనాయకుని కరతలంబున నుండు ఫలంబున రక్తవర్ణము గల్గుఁ బురు వొక్కటి ప్రాకుచు కనుపించెను. దాని నందరుం గాంచిరి. నిజకరఫలగతంబగు పుర్వు నానరవరుండు గాంచి, యీపుర్వు నన్ను గరుచునేమో యని పల్కుచు నా క్రిమిసమన్వితంబగు ఫలంబును కంఠదేశంబున నుంచుకొనెను.

అంతదనుక ఫలంబుపయిం గ్రిమిరూపంబున గనుపించు తక్షకుండు ఫలమును విడిచి నిజరూపంబు నొంది యారాజచంద్రుని శరీరము నావేష్టించెను. భోగివేష్టితుం డగు భూపాలుం గాంచి యటనుండెడివార లందరును భయాక్రాంతచిత్తులై పర్విడిపోయిరి. పిదప నారాజన్యుండు తక్షకవిషానలంబున గ్రాగి ప్రాసాదయుతుండై భస్మంబయ్యెను. పిమ్మట మంత్రులు పురోహితులం బిలిపించి పరీక్షిన్నరేంద్రున కూర్ధ్వదైహికక్రియల నిర్వర్తితంబుల గావించి తదనంతర మారాజచంద్రుని కుమారుం డగు జనమేజయుని జగద్రక్షణార్థంబునకై పితృరాజ్యంబున కభిషిక్తుం గావించిరి. మునిముఖ్యులారా! తక్షకవిషానలంబునుండి రాజచంద్రునుద్ధరింపందలంచి పోవుచు తక్షకుం డొసంగిన ధనము నంది కొని మరలిపోయిన కాశ్యపుని గాంచిన జనులందరు నాతని ననేకవిధంబుల నిందింప మొదలిడిరి. ఆదూషణంబుల నాలింపలేక సమస్తదేశంబుల దిరుగుచుండెగాని యెందు బోయినను వాని గాంచినవార లో



దురాత్మా! నీవంటి మహాపాపి యేదేశంబున నుండునో యాదేశము క్షామపీడితంబగును. ఇటనుండి పొమ్ము పొమ్మని వెడలగొట్టుచుండిరి.

జననిందను భరించలేక శాకల్యమునిశేఖరుకడకుం బోయి సాష్టాంగవందనశతంబు లర్పించి, శరణంబు నొంది, మునిచంద్రమా! నా మొరాలింపుము, నను రక్షింపుము, నీవే గతి యని నమ్మియుంటి నని వచింపుచు గద్గదభాషణంబుల నిటులనియె. మహాత్మా! తపోధనులును, బాంధవసముదయంబును, మిత్రబృందంబును- వారు వీరన నేల నను గాంచినవార లందరును నను నిష్కారణంబుగ నిందించుచుందురు. ఆదూషణవాక్యంబుల వినలేకుంటిని. కారణ మెద్దియో గోచరింపకున్నయది. బ్రహ్మహత్య గావింపలేదు. స్వర్ణస్తేయ, సురాపాన, గురుదారసంగమాది దోషంబుల నెద్దానింగాని జేసి యెఱుంగను. భూతలంబునం గల్గు నెట్టి స్వల్పదోషమునైన గావింపలేదు. బంధుసముదయంబును, మిత్రగణంబును మరియు ననుం గాంచువార లందరును నాముఖముం గాంచినంతన నన్ననేకవిధంబుల దూషించుచు, ఛీ దురాత్మా! నిను గాంచిన మాకుగూడ పాపము సంభవించును. మా యెదుట నిలువకుము. నీమోమును గాంచజాలము. పొమ్మని వెడలగొట్టుచుందురు. నేనొనరించిన పాపం బెద్దియో యెఱింగితివేని దాని నాకెఱుకపఱచి రక్షింపు మని రోదన మొనరింపజొచ్చిన కాశ్యపు నెడల కనికరమంది శాకల్యమునీంద్రు డించుకసేపు గనులు మూసి, ధ్యానించి తా నెరింగిన విషయంబు నిటుల వినుతించెను.

-: శాకల్యుండు ధర్మంబుల దెలుపుట :-

ఓయీ కాశ్యపా! నీవు పరీక్షిన్నరేంద్రుని తక్షకవిషంబు సోకకుండ రక్షింపందలంచి మార్గమధ్యంబున నాతక్షకునిచే నివారితుండవై మరలి యింటికి బోతివి. విషరోగాదులకు చికిత్సజేయ సమర్థుండయ్యు విషరోగాది పీడితుల రక్షింప బ్రయత్నింపని యాతం డుబ్రహ్మఘ్నుండని యెఱుంగునది. కామక్రోధలోభమోహమదమాత్సర్యంబుల

నొంది విషరోగాతురుండగువాని నెవ్వండు సమర్థుండయ్యు రక్షింపకుండునో యాతండు బ్రహ్మహత్య, సురాపానము, స్వర్ణస్తేయ గురుదారసంగమంబు లనియెడు దోషంబుల నొందగలండనియు, అట్టి యఘంబునకు ప్రాయశ్చిత్తము ధర్మశాస్త్రంబుల నెందును గానరాదనియు నార్యులు వచించుచుందురు.

కన్యను విక్రియ మొనరించువానికిని, హయవిక్రేతకును, కృతఘ్నునకును శాస్త్రంబులం బ్రాయశ్చిత్తము నిరూపింపబడియున్నది. కాని సమర్థుండయ్యు విషరోగాతురుల రక్షింపకుండువానిచే నెన్ని ప్రాయశ్చిత్తంబులు జేయించినను నిష్కృతి లేకుండును. అట్టిపాపిని పంక్తి నిడుకొని భుజింపరాదు. వానితో మాటలాడుట పాపకారణము. వేయేల వానిం గాంచుటయే దోషము.

ఆపరీక్షిన్నరేంద్రుండు పుణ్యశ్లోకుండు; ధార్మికుండు; మాధవారాధనతత్పరుండు. ధర్మమార్గము నించుకయును వీడక నిరీతికంబుగ రాజ్యపాలనం బొనరించుచు వ్యాసతనయుండగు శుకమహర్షి వలన శ్రీహరి చరితంబును శ్రద్ధాభక్తియుతుండై వినియున్నవాడు. అట్టి పావనచరితుండగు పరీక్షితుని రక్షింపక తక్షకుని పలుకు లాలించి దయమాలి మరలిపోయిన కతంబున నీవు బంధుమిత్రాది సకలజనులచే దూషింపంబడుచుంటివి ఆరాజన్యవరుం డల్పాయుర్దాయవంతుడనియు, నాతం డెట్లైనను మరణించువాడే యనియు వచింతువేని యదియు సమంజసంబు గాదు. మంత్రవిద్యంగాని, వైద్యవిద్యంగాని యభ్యసించిన సమర్థుండగు చికిత్సకుండు ఆరోగి మృతినొందువరకును చికిత్స మానరాదని బుధజనులు వలుకుచుందురు. అయ్యార్యుల పలుకులు వినవే ? కాలగతి కుటిలంబని యెఱుంగవే. నీవు చికిత్సయందు సమర్థుండవయ్యు ధనలోభంబున తక్షకు డాడినమాటల నాలించి చికిత్సయొనరింపక మార్గమధ్యంబునుండియే మరలిపోతివి. ఇట్టి దుష్కార్యం బొనరించుటం జేసి నిను జనులందరును దూషించుచుండిరి. నీకు సంక్రమించిన పాపంబునకు



ప్రాయశ్చిత్తము లేదనియెడు శాక్యమునిపలుకుల నాలించి కాశ్యపుండిటులనియె.

మునిశేఖరా ! యేయుపాయంబున నాపాప ముపశమంబునొంది నాబంధుమిత్రులందరు నను పరిగ్రహింతురో యయ్యుపాయంబును నాకుపదేశింపుము. దయయుంచుమన నాశాక్యముని యెద్దియో ధ్యానించి కృపాతరంగితాత్ముండై విప్రవర్యా! నీపాపోపశమనోపాయంబును వచించెద వినుము. విని యచిరకాలంబున నే నుడివిన తెఱంగున చరింపుము. పాపవిముక్తుండ వగుదువు. సువర్ణముఖరీతీరంబున మాధవనివాసంబై సర్వలోకసంసేవ్యమానంబై వేంకటాచలంబునాబరగు నగవరం బొండు కలదు. అయ్యది సకలబుధజనవినుతంబును, బ్రహ్మహత్యాసురాపానస్వర్ణస్తేయాది మహాపాతకనాశకారణంబును పుణ్యవ్రతంబునై విరాజిలుచుండును. అయ్యచలంబునందు శ్రీనివాసున కుత్తరదిగ్భాగంబున సకలాఘనిబర్హణంబగు స్వామి పుష్కరిణీతీర్థమున్నయది. నీవు శీఘ్రంబుగ నవ్వేంకటాద్రి కేగి యాస్వామిపుష్కరిణియందు స్నానం బాచరించి పశ్చిమతీరంబునం గల్గు శ్రీహరి మందిరంబున కరిగి యందలి శ్రీవరాహస్వామి నారాధించి యటుపిదప భక్తాభీష్టప్రదాయకుండును, శంఖచక్రధరుండును, వనమాలాభాసురుండు నగు శ్రీనివాసుని దర్శించి దండప్రణామంబు లాచరించి సేవించుము. ఇటులొనరింతువేని నిర్ధూతకల్మషుండ వగుదువు. ఇందిసుమంతయు సందియ మొందకుము. అనియెడు శాక్యముని వచనంబుల నాలకించి పరమానందభరితుండై యాకాశ్యపుండు సత్వరంబుగ వేంకటాద్రికిం బోయి, స్వామి పుష్కరిణియందు నియమపూర్వకంబుగ స్నానం బొనరించి పాపవినిర్ముక్తుండయ్యెను.

అంత నమ్మహాత్ముని బంధువులును, మిత్రులును, వారు వీరన నేల సకలజనులు నవ్విప్రసత్తముం గాంచి నీవిపుడు పవిత్రుండవై పూజనీయుండవైతి వని వచించుచు మహానందంబు నొందిరి. మునిచం

ద్రములారా! యీచరితంబు నెవ్వరు వినుపించెదరో, యెవ్వారలు శ్రద్ధాభక్తిసమన్వితులై వినియెదరో వారలందరును శరీరావసానంబున విష్ణులోకంబునుం జేరి యఖండానందంబున వసింపగలరన విని సూతున కామును లిటులనిరి.

—: స్వామిపుష్కరిణీస్నానంబున నరకనిస్తారవర్ణనము :—

సూతా! నీవు వేదవేదాంగతత్త్వార్థవేదివి. నీ కెఱుంగరాని విషయంబు లెవ్వియు లేవు. స్వామిపుష్కరిణీవిభవంబును సమగ్రంబుగ నెరిగింపు మనవు డాతం డిటుల వినుపించెను. మునివరులారా! యెవ్వారలు స్వామిపుష్కరిణీస్నానం బొనరింతురో, యెవ్వారలానదీమతల్లిని ప్రశంసింతురో వారలష్టావింశతిసంఖ్యాకంబు లగు నరకంబుల నొందకుందురు. ఆయిరువదియెనిమిది మహానరకంబుల వినుడు- తామిస్రంబును, అంధతామిస్రంబును, రౌరవంబును, మహారౌరవంబును, కుంభీపాకంబును, కాలసూత్రంబును, అసిపత్రవనంబును, కృమిభోజనంబును, అంధకూపంబును, సందంశంబును, శాల్మలియు, లాలాభక్షంబును, అవీచియు, సారమేయాదనంబును, వజ్రకణకము, క్షారకర్దమపాతనము, రక్షోగణాశనము, శూలప్రోతనిరోధనము తిరోధానము, సూచీముఖంబును, పూయశోణితభక్షంబును, విషాగ్నిపరిపీడనంబును అను నీనరకబాధలు స్వామిపుష్కరిణీస్నానంబున బొందకుందురు. పరులధనమును, సంతానమును, కళత్రమును హరించిన పాపాత్మ నయ్యమకింకరులు కాలపాశబద్ధుని గావించి యనేకవత్సరంబులు తామిస్రనరకంబున బడవైతురు. స్వామితీర్థస్నానంబున తామిస్రంబున బడకుందురు.

వేదమార్గంబు నతిక్రమించి కుపథంబున జరించు నీచుని గొంపోయి దారుణం బగు నసిపత్రవనంబునం బడవైచి యనేకరీతుల బాధింతురు. స్వామిపుష్కరిణీస్నానంబున నయ్యసిపత్రవనంబును గాంచకుందురు. ఏ నరుండు పఙ్క్తిభేదం బొనరించునో, యెవ్వారలు పఙ్క్తి



యందలివారల కిడక పక్వంబులగు భక్ష్యంబుల నారగింతురో, యెవ్వండు పంచయజ్ఞంబుల నొనరింపక భోజన మొనరించునో యానరాధముల నయ్యమకింకరులు క్రిమిభోజనంబను నరకంబున బడవైచిన, నందలి క్రిమిసముదయంబు వారల భక్షించుచుండును. అంతియగాక పాపక్షయం బగునంతదనుక తానొక క్రిమియై యందు బొరలుచుండును. ఏనరాధముండు విప్రవిత్తంబును హరించునో యాతండయోమయాగ్నికుండంబునం బడి భయంకరం బగు సందంశంబులవలని పీడ నొందుచుండును.

పొందరాని యువిదం గూడిన పురుషాధముండును, అగమ్యుండగు పురుషునొందిన స్త్రీయును సూచి యనియెడు నరకంబున ద్రోయంబడి యయోమయంబులై యగ్నితప్తంబులగు స్త్రీపురుషవిగ్రహంబుల నాలింగన మొనరించి సూర్యచంద్రు లున్నంతకాలంబును దారుణం బగు బాధ నొందుచుందురు. వివిధవిధంబుల జంతుహింస గావించు తులువల నయ్యమభటులు బహుకంటకసమన్వితంబయి భయంకరంబగు శాల్మలీనరకంబునం బడవైచి యపరిమితంబుగ బాధింతురు. రాజన్యుడైనను, రాజభృత్యుండైనను పాషండమతంబు నవలంబించి ధర్మసేతుభంగం బొనరించిన, నట్టివారలను వైతరణీనది యనంబరగు నరకంబునం బడవైతురు. వృషలీసంగదూషితుండును, శౌచాద్యాచారవర్జితుండును, లజ్జావిహీనుండును, వేదబాహ్యుండును, పశుచర్యారతుండు నగు వారలం బట్టి యాకృతాంతభటులు పూయవిష్ఠాసృక్ శ్లేష్మపిత్తాదిపూరితంబును, మిగుల నసహ్యాకరంబు నగు నతిబీభత్సనరకంబున గూలంద్రోయుదురు

ఏమానవుడు మృగయాసక్తచిత్తుండై యరణ్యంబునం బ్రవేశించి వన్యమృగంబుల గుక్కలచే గరిపించి, శరంబుల నొప్పించి బాధించునో యట్టివాని భయంకరాకారులగు శమనకింకరులు సునిశితసాయకంబుల భిన్నాంగుని గావించి ప్రాణరోధంబునా బరగు నరకంబు నొందిం

తురు. విధివిధానంబును వీడి దాంభికాచారరతుండై జన్నంబుల నిర్దాక్షిణ్యంబుగ బశువిశసన మొనరించు దురాత్ము నాకాలకింకరు లవ్వాని యంగంబుల గత్తిరించి వైశసం బను నరకంబున ద్రోతురు.

నిజదారం గాని, సవర్ణ యగు నింకొక యువతిం గాని రేతఃపానం బొనరింపజేయు తుచ్ఛుండు రేతఃపాయియై రేతఃకుండంబున మున్గుచు దేలుచు నుండును. మార్గమధ్యమునందుండి పాంథుల ద్రవ్యంబు నపహరించువారలును, విషదాయకులును, గ్రామదాహకులును, వణిగ్ద్రవ్యాపహారకులును వజ్రదంష్ట్రనరకబాధల నొందెదరు.

ఇంతియగాక యమలోకంబున గల్గు నరకంబులు లెక్కకు మిక్కిలియై యున్నయవి. స్వామిపుష్కరిణీజలావగాహనంబు నొనరించిన మానవు లేపాపకార్యము లొనరించినవారలైనను పావనంబగు నాస్వామిపుష్కరిణీప్రభావంబున పాపంబు విడనాడి, నరకబాధల నొందక సుఖింతురు ఆనదియందు నొకమారైనను స్నానమాచరించిన మానవు లశ్వమేథఫలంబు నొందగలరు. ఆత్మవిద్యయు చతుర్వర్గఫలంబులును సిద్ధించును. అట్టివారల చిత్తంబులు పాపాచారాక్రాంతములు గాకుండును. వారల కష్టంబులు నామావశిష్టంబులగును. తులాపురుషదానఫలము సిద్ధించును. సహస్రగోదానఫలమబ్బును. చతుర్విధపురుషార్థంబుల నెద్దాని నభిలషించిన నయ్యది సిద్ధించును. ఒకమారా పుష్కరిణీతీర్థస్నానంబు గావించిన ప్రజ్ఞయు, శ్రీయును, కీర్తియు, జ్ఞానంబును, మనశ్శుద్ధియు, విరక్తతయు సిద్ధించును. బ్రహ్మహత్యాయుతంబును, సురాపానాయుతంబును, గురుదారసంసర్గాయుతంబును, స్వర్ణస్తేయాయుతంబును, స్వామిపుష్కరిణీతీర్థస్నానంబున హరణంబు లగును. బ్రహ్మహత్యా, సురాపాన, స్వర్ణాపహరణ, గురుదారసంగమాదికంబుల కీడగు దోషంబులును, తత్సంసర్గసమానంబులగు నఘంబులును నిస్సంశయంబుగ పుష్కరిణీస్నానమాత్రంబున నాశ మొందగలవు.



—: స్వామితీర్థమహిమంబున విశ్వాసమొందనివారలకు నరకంబు సిద్ధంబనుట :—

ఆతీర్థనింద నొనరించినవారల నాలుకల నయ్యమకింకరులు ప్రతప్తంబులగు పరశువులం దెగనరుకుదురు. ఈచరితం బంతయు నర్థవాదం బని యనియెడువారలు నరకనివాసు లగుదురు. అతిపావనంబగు స్వామితీర్థంబు నుద్దేశించి దుర్వాక్యంబు లాడు నీచుండు సర్వకర్మబహిష్కృతుండు. అట్టి దురాత్ముని పరగడం దిరిగెడి పందిగా నెరుంగవలెను. ఆహా! సకలకలుషహరంబును, అద్వైతజ్ఞానప్రదంబును మోక్షదాయకంబును, ఇష్టకామప్రదంబును, అజ్ఞాననాశకంబు నగు స్వామితీర్థము న్వీడి యితరతీర్థసేవాసక్తు లగువారల మూర్ఖులుగా నెరుంగవలయును. ఆతీర్థమహిమను వినుతింప నే నసమర్థుండ నని యెరుంగుడు. ఏమానవులు స్వామిపుష్కరిణీతీర్థంబును కనులపండువుగఁ గాంతురో, యెవ్వార లందవగాహన మొనరింతురో, యెవ్వారలు ప్రణామంబు లాచరించి సన్నుతింతురో యట్టివారలు మరల మాతృస్తన్యపానం బొనరించువారలు కాకుందురు. అని మునినికరంబును గాంచి సూతుండు మరల నిటువచించెను

—: ధర్మగుప్తుని చరిత్రము :—

మునిసత్తములారా! స్వామి పుష్కరిణీతీర్థమందలి యాదరాతిశయంబున మరల నాతీర్థవైభవంబును వినుపింపదలంచితిని. సావధానంబుగ వినుండు. సోమవంశసముద్భవుండును, ధార్మికుండు నగు నందుం డను రాజచంద్రుండు గలండు. ఆతం డీసాగరమేఖలావలయితంబగు ధరామండలమును ధర్మమార్గమును విడువక యేకచ్ఛత్రాధిపత్యంబుగ బాలించెను. ఆరాజన్యునకు ధర్మగుప్తుం డను నందనుం డుదయించెను. నందుం డాతని రాజ్యభరంబును నందనుని బాహుపీఠంబున నిల్పి రాజనీతిమార్గము నుపదేశించి జితేంద్రియుండై విసర్జితాహారుండై తపోవనంబునకుం బోయెను. జనకుం డొసంగిన రాజ్యభారము న్వహించి

ధర్మమార్గంబున రాజ్యపాలన మొనరించుచుండెను. వివిధయాగంబుల నొనరించి పురందరాది బృందారకబృందంబును పరితృప్తి నొందించెను. దానపాత్రులగు భూసురుల కగ్రహారంబుల నొసంగెను. ధర్మగుప్తుండు కువలయనాయకుం డయి యుండ మానవు లందరును వారివారి వర్ణాశ్రమాచారంబుల న్విడువక తస్కరదుర్భిక్షాదిపీడల నొందక సుఖించుచుండిరి.

అంత నొకసమయంబున నానరనాయకుండు మనోజవతురంగాధిరోహణం బొనరించి మృగయాసక్తచిత్తుండై తాలహింతాలకృతమాలనక్తమాలకురవక వకుళరసాలసాల తరువర భాసురంబును, సింహవ్యాఘ్రభయానకంబును, మధబంభరఝంకారనాదితదిగంతరంబును, వివిధకుసుమవిసరభాసురంబును, పద్మకల్హారకుముద విరాజితంబులును, శుద్ధస్వాదుజలపూరితంబులు నగు తటాకపరిశోభితంబును, శాఖాయుధసహస్రమండితంబు నగు నొకవనంబునం బ్రవేశించియందనేకమృగంబుల దనసునిశితసాయకంబుల దునుమాడి యందంద చరించుచుండు నంతలోన దినకరుం డపరాబ్ధి గ్రుంకుటయు జీకటు లంతటను బ్రసరించుచుండె.

ఆ ధర్మగుప్తుం డొక సరోవరతటంబును జేరి యాసరోవరంబున శుచియై సాయంకాలసంధ్యాదికృత్యంబుల నొనరించి వేదమాతయగు గాయత్రిం జపియించి, పిదప ఘాతుకజంతుభయంబున నం దొక మహోత్తుంగతరువరంబు నధిరోహించియుండెను. ఇటులుండ నొకపంచాస్యమునకు భయమంది భల్లుకం బొక్కటి పరుగిడుచు వచ్చి యంతకుమున్నే ధర్మగుప్తుం డధిష్ఠించియున్న తరువరంబున కెగబ్రాకి యందుండెడు నరనాయకుం గాంచి యాభల్లుకం బిటులనెను. రాజా ! నేనిందులకువచ్చితినని భయమందకుము. మనమిర్వురమునీ రాత్రి యంతయు నీకుజంబున గడుపవలసి యున్నది. మహాకాయుండును, మహాబలసమన్వితుండును, దంష్ట్రాకరాళవదనుండును, భయంకరాకారుండునగుమృగేం



ద్రుం డీతరుమూలము నాశ్రయించియున్నవాడు. ఈరాత్రి సగము గతించుదనుక నీవు నిదురింపుము. పిమ్మట నే నిదురించెద. నీవు నిదురించు నవసరంబున నిను నేను రక్షించుచుందును. నేను నిదురించుసమయంబున నీవు నను రక్షింపుము.

ఇటు లనునంత నానందతనయుండు ముందుగ నిదురించెను. ఆ భల్లుక మాతని గాచుచుండెను. రాజు నిద్రాపరవశుండై యుండ నామృగరాజు భల్లుకంబున కిటులనియె. ఓభల్లుకోత్తమా ! నీవీరాజకుమారుం గ్రిందికిం బడద్రొబ్బుము. నేనాతని భక్షించి యాకలిందీర్చికొని నాదారిని నేబోయెదను. నీవును సుఖంబున బోవచ్చును. ఇటు లాడిన పంచాస్యాస్యవినిర్గతంబు లగు నుడువు లాలించి ధర్మజ్ఞుండును, నీతియుతుండు నగు భల్లుకరాజు మృగేంద్రున కిటులనియె. మృగేంద్రమా ! నీవిసుమంతయు ధర్మ మెరింగినవాడవు గావు. విశ్వాసఘాతకులిహంబున బడరానియిడుమలం బడి తుదకు మహానరకంబుల పాలగుదురు. మిత్రద్రోహి వేలకొలందిగ యాగంబు లొనరించినను పాపవిముక్తి నొందనేరడు. బ్రహ్మహత్యాదిపాతకంబుల కెన్నటికైన విముక్తి గలుగుంగాని విశ్వాసఘాతకుని యఘం బెన్నటికిని నశింపకుండును. నగరాజంబు లెన్నియైనను భూదేవికి భారంబులు గావు. విశ్వాసఘాతకుం డొకరుండైనను వాని నీవిశ్వంభరాదేవి సహింపజాలదని యార్యులు వచింతురు. నీవీతులువపలుకుల మాని యిటనుండి వెడలిపొమ్మనియెడు భల్లుకవచనంబు లాలించి యాసింగము సిగ్గునొంది తలవంచి మరుమాటాడక యూరకుండెను.

పిమ్మట గొంతతడవున కాధర్మగుప్తుండు మేల్కాంచిన నాతనిం గాంచి రాజా! యిక నేను నిదురించెద. నను రక్షణసేయుచుండు మని పలికి యాభల్లుకము నిదురించెను. అంతలోన నాకంఠీరవంబు రాజకంఠీరవుం గాంచి యోనరనాథా ! ఘాతుకమృగంబును నీవెంట నుంచుకొంటివి. నీకు క్షేమముగాదు. మహావిషజ్వాలల వెడల్గ్రక్కుచుండు

మహాభుజంగంబునకు పాలుపోసి పెంచిన నయ్యది గరువకుండునే. నీవీ భల్లుకంబును క్రిందకుం బడఁద్రొబ్బుము. నేనద్దాని భక్షించి నాదారిని నేఁబోయెద. నీనగరంబునకు సుఖంబుగ నీవును వెడలుము. అను యాకేసరి పలుకుల నాలించి యిటు లొనరింపదగునా, తగదా యని యోచింపకయే తనతొడపై శిరంబును వ్రాల్చి నిదురించుచుండు నాభల్లుకంబును క్రింద బడునట్లుగా ద్రోయ, నయ్యది పూర్వపుణ్యవశంబున నాతరువరశాఖల బట్టుకొని యాపట్టువీడనికతంబున భూమిపయిం బడక క్రోధతామ్రాక్షుంబై యానరనాథుని కొరకొరం గాంచుచు నిటులనెను.

రాజా! నేను భృగువంశసంజాతుండను. ధ్యానకాష్ఠుండను నామంబున బ్రఖ్యాతి గన్నవాఁడ. కామరూపప్రభావంబున నిపుడిభల్లుకరూపంబున నిట కరుదెంచితిని. భూనాయకా! యేపాపం బెరుంగక సుఖంబుగ నిదురించు నన్నెందులకై క్రింద బడద్రోసితివి? నీనతికాలంబున నున్మత్తుండవై భూతలంబున జరించుచుండు మని శాపం బొసంగి పిమ్మట నప్పంచాస్యంబున కిటులనియె. హర్యక్షవర్యమా, నీవు కేసరివి గావు. మున్ను నీవొక యక్షుండవై కుబేరునకు ప్రాణసఖుండవై యుంటివి. నీవొక సమయంబున జాయాయుతుండవై హిమాచలంబున నుండెడు గౌతమాశ్రమసమీపంబునం దజ్ఞానంబున విహార మొనరించితివి. అంతలో సమిదాహరణంబునకై యాగౌతముండు పర్ణశాలాభ్యంతరమునందుండి వెలికి వచ్చి వస్త్రవిహీనుండ వగు నినుం గాంచి యోరి నీచా! పావనంబగు నాయాశ్రమతలంబున వివసనుండవై విహారించు కారణంబున నీవొక సింగమవై విపినంబుల జరించుచుండు మని శపించెను. ఆముని శాపంబున నీవీసింహరూపంబున విపినంబుల జరించుచుంటివి. కుబేరుండు ధర్మశీలుండును, సుగుణాలంకృతుండును. ఆతనికి భృత్యులగు వారలు నట్టివారలే యని వినుచుందుము. కుబేరుండుగాని, వానిభృత్యవర్గంబుగాని పరుల కపకార మొనరింపకుందురు.



ఆకారణంబున నిర్భీకుండనై మునికుమారుండ నగు నేనిట దిరుగుచుంటిని. నను హింసింపకుము. ఈచరితంబంతయు దివ్యజ్ఞానంబున నెఱింగితి. ఇటుల ధ్యానకాష్ఠుఁడు పలుకుచుండునంతలోన సింహరూపంబును వీడి కుబేరసచివాత్మకం బగు మనోహరం బగు యక్షరూపంబు నొంది యమ్మునికుమారునకు నమస్కారంబు లొనరించి ప్రాంజలియై యిటులనియె.

మునీంద్రా! నాపూర్వచరితం బంతయు నిపుడు నామనంబున బ్రతిబింబించుచున్నయది. గౌతముండు నాకు శాప మొసంగెడుకాలంబుననే శాపాంతమునుగూడ వచించెను. భల్లుకరూపధరుండగు ధ్యానకాష్ఠునితోడ సంవాదం బెపుడు సిద్ధించునో యానిమిషంబున సింహరూపంబును వదలి మరల యక్షరూపంబు నొందగలవని వచించి యాగౌతముం డెందేని జనియె. ఆకారణంబున నిన్నిపుడు కామరూపధరుండవగు ధ్యానకాష్ఠునిగా నెఱింగితి. అని వచించుచు నయ్యక్షవరుం డాతపోధనున కనేకవందనంబు లొనరించి విమానవరంబు నధిరోహించి సంపదల కాపురంబగు నలకాపురంబున కేగెను. మునిశాపంబున నున్మత్తుండై విపినంబుల జరించు ధర్మగుప్తునిబట్టి యాతనిమంత్రివరులు రేవానదీతీరంబున దపం బొనరించు నమ్మునికడకుం గొంపోయి యాతనికి సుతమతిభ్రంశంబును వినుపింప నానందుండు నందనుని చరితం బంతయు సమగ్రంబుగ దెలిసికొని కుమారుం దోడ్కొని సత్వరంబుగ జైమిని మునిసన్నిధికిం జని కుమారుని చరితంబును సవిస్తరంబుగ దెలిపి మహాత్మా! నాతనయుం డున్మత్తుండై యున్నవాఁడు. వీని పిచ్చిని మానుప నెద్దియే నొక యుపాయంబును వివరించి మమ్ముద్ధరింపు మన నామునిశేఖరుం డెద్దియో కొంతతడ వాలోచించి నందున కిట్లనియె.

—:జైమినిముని వచించిన తీరున స్వామిపుష్కరిణీతీర్థంబున స్నానంబు గావించుటంజేసి ధర్మగుప్తుం డున్మాదవిముక్తుండగుట :—

రాజా! ధ్యానకాష్ఠశాపంబునంజేసి నీసుతుం డున్మత్తుం డయ్యె.

అందుల కొకయుపాయము నచించెద నాలింపుము. సువర్ణముఖరీతటంబున సర్వకలుషాపహంబును, పుణ్యఫలదంబును, నైకవిధధాతువిరాజితంబు నగు వేంకటాచలం బున్నయది. ఆనగవరంబున పావనంబును, మంగళకరంబును, బ్రహ్మహత్యాదిమహాపాతకపరిశోధకంబు నగుస్వామిపుష్కరిణీతీర్థ మొండు గలదు. నీవాతీర్థంబునకు నీకుమారుని గొంపోయి యందు స్నానము చేయించుము. ఆనిమిషంబుననే నీకుమారుం డున్మాదవిముక్తుం డగును. ఇటులనిన మునిపుంగవుని పలుకు లాలించి నమస్కారశతంబు లర్పించి, నందుం డాకుమారుం దోడ్కొనిపోయి ధర్మగుప్తు నందు స్నానము జేయింప, నాతం డున్మాదంబును వీడిన నత్తనూభవుం గాంచి నందుం డపరిమితానందంబు నొంది యందొక దినంబును గడిపి దయామయుండగు శ్రీనివాసుని సేవించి మరునాడు కుమారు నచట విడిచి యాతండు మరల తపోవనంబునకు బోయెను. జనకుండు వెడలిన పిమ్మట నాధర్మగుప్తుం డావేంకటాచలాధీశున కనేకసువర్ణాలంకారంబుల గానుకలగా నొసంగి, విత్తం బమితంబుగ నొసంగి, భూసురోత్తముల కగ్రహారంబులను, ధనధాన్యాదికంబుల నొసంగి, సచివోత్తములం గూడి నిజపురంబునకుం బోయి పితృపైతామహక్రమాగతంబును, నిస్సపత్నంబు నగు రాజ్యంబును ధర్మమార్గంబు దప్పక రాజ్యపాలనం బొనరించెను.

ఏమానవు లున్మాదావస్థ నొందియు, దుష్టగ్రహగ్రస్తులయ్యు పీడ నొందుచుందురో వార లీస్వామిపుష్కరిణీస్నానమాత్రంబున విముక్తు లగుదురు. ఇయ్యది ముమ్మాటికిని నొక్కి నక్కాణించుచుంటిని. పావనంబగు స్వామిపుష్కరిణీతీర్థంబును విడిచి యితరతీర్థంబుల సేవింపదలంచువారలు గోక్షీరంబుల విడనాడి చెముడుపాలను గోరువారి తెరంగువారని తలంపవలయును. మరియు నేజలాశయంబునకు బోయినను స్నానసమయంబున ముమ్మారు స్వామిపుష్కరిణిం దలంతురో యట్టివారలు బ్రహ్మలోకంబు నొందగలరు. మునివరు



లారా! యేచరితంబు వినుటవలన మహాపాతకోపపాతకంబు లన్నియు నాశ మొందునో యట్టి ధర్మగుప్తుని పుణ్యచరితంబును వినుపించితి నని పలికి, సూతుం డమ్మునివరుల కిటులనియె.

—: సుమతి యను బ్రాహ్మణుని వృత్తాంతము :—

తపోధనసత్తములారా! యింకను స్వామితీర్థమహిమంబును వినుపింతును వినుండు. మున్నొక కాలంబున సుమతి యను భూసురుండు కిరాతీసంసర్గంబున మద్యపానరతుండయి సంచరించుచున్నవాడు. ఆతండు స్వామిపుష్కరిణీతీర్థస్నానంబున పరిశుద్ధుం డయ్యె నన విని, మును లిటులనిరి. మహాత్మా! సుమతి యనునతం డెవనితనయుండు? కిరాతసంసర్గం బెటు ప్రాప్తించెను? మద్యపానాసక్తుం డగుటకుం గతం బెయ్యది? సవిస్తరంబుగ వినుపింపు మన, నాసూతుం డిటులనియె. మహారాష్ట్రదేశంబున వేదవేదాంగపారగుండును, దయామయుండును, హరిహరసమర్చనాతత్పరుండును, ఆతిథేయుండును, యజ్ఞదేవాభిఖ్య నొప్పుచుండువాడు నగు విప్రవర్యుం డొకరుండు కలండు. ఆభూసురునకు సుమతి యను పుత్రుం డుదయించెను. ఆతండు జననీజనకులను, పతివ్రతాతిలకంబును, సుగుణాలంకృతయు నగు భార్యను విడిచి, విటగోష్ఠీపరాయణుడై యుత్కళదేశంబునకుం బోయెను. అందొక మనోహరాంగి యగు కిరాతయువతి యువజనమోహినియై చరించుచు, తరుణవయస్కుల దన చక్కదనంబున మోహవిభ్రాంతులం గావించుచు, వారలవలన విత్తము నవ్వారిగ గైకొనుచుండెను.

ఇటులుండ సుమతి యందంద దిరుగుచు తుద కాకిరాతీగృహంబునకు బోయిన వానింగాంచి, వానిసౌందర్యంబునవలోకించి, ముగ్ధయై దరిద్రుండైనను ధనాశను వీడి తగువిధంబున సత్కారంబుల నొనరించి, తన సుందరమందిరమున నుంచుకొనెను.

—: సుమతికి కిరాతీసంగమంబున మహాపాతకప్రాప్తి యగుట :—

ఇటులుండ నావిప్రుండు తత్సంసర్గైకతత్పరుండై రాత్రులం దచ్చట

చ్చట విత్తంబును దొంగిలించి తెచ్చి యాతరుణికొసంగుచు దానియింటనే యాకిరాతితోడం గూడి యేకపాత్రియందు భుజించుచు, సురాపానం బొనరించుచు నక్కిరాతితో గ్రీడించుచుండెను. విషయాతురుం డగు నాభూసురాధముం డెప్పుడైన నొకపరియైనను తలిదండ్రులంగాని, గుణవతి యగు భార్యనుకాని తలంపకుండెను. పిమ్మట కొంతకాలంబున కానీచుండు కిరాతవేషధారియై తోడికిరాతులంగూడి భయంకర కరవాలంబును కరంబున నమరిచి, సాహసోపేతుండై యొక విప్రగృహంబునం జొరబడి యాగృహపతియగు భూసురు దనఖడ్గంబున కెర జేసి యాయింటియందున్న ధనంబును గ్రహించి కిరాతసుందరీమందిరాంగణముం జేరునంతలోన సకలలోకభయంకరాకారము, నీలవసనధారిణియు, రక్తశిరోరుహయు నగు బ్రహ్మహత్య బయలువెడలి భయంకరారావంబుల భూమ్యంతరిక్షంబుల గంపింపజేయుచు నాబ్రహ్మఘ్నుని వెంటనంటి పర్విడి వచ్చుచుండెను.

సుమతి యిటుల బ్రహ్మహత్యచే ననుగమ్యమానుండై భయ మొంది పరువిడుచు ననేకప్రదేశంబుల దిరిగి తుద కాదురాత్ముండు స్వగ్రామంబునకు జేరి తనయింట బ్రవేశించెను. బ్రహ్మహత్యయు వాని విడువక దానుగూడ నయ్యింట బ్రవేశించెను. సుమతి యింటి లోపల బ్రవేశించిన వెంటనే జనకుని గాంచి తండ్రీ! రక్షింపుము, రక్షింపు మనుచు పాదంబుల వ్రాలి యేడ్వ దొడంగెను. ఆతం డా కుమారుం గాంచి జాలినొంది తనయా! భయ మొందకుమని పల్కుచు కుమారుని రక్షింప నుద్యుక్తుం డగుడు బ్రహ్మహత్య యిటులనియె. ద్విజోత్తమా! యిద్దురాత్మునియందలి పుత్రమోహంబును వీడుము. నీతనయుండు సురాపాన మొనర్చెను. స్వర్ణస్తేయముం గావించెను. మాతృపితృద్రోహ మొనర్చెను. గుణవతియు బతివ్రతయు నగు కళత్రంబును వీడెను. కిరాతీసంగమం బొనరించెను. తుదకు బ్రహ్మహత్య గావించెను. ఇటుల మహాపాతకంబుల కన్నిటికిని నివాసభూమియై



యున్నవాడు. వీని దీనాలాపంబు లాలించి వీనిం దయజూడక విడువుము. వీని రక్షింప సమకట్టితివేని నీవంశము నాశమగునటుల నీయింటియందలి వార లందరను భక్షించి పోయెద. నామాట విని యీనీచుని విడువుము. వీని నొకని భక్షించి నాదారిం బోయెద నన, నయ్యజ్ఞదేవుం డాబ్రహ్మహత్య కిటులనెను. సుతస్నేహము మిక్కుటంబుగ నను బాధించుచున్నయది. నేనితని విడువజాల ననిన మరల నాబ్రహ్మహత్య భూసురోత్తమున కిటులనెను.

భూసురేంద్రా! నీతనయుండు వర్ణాశ్రమాచారంబుల విడచినవాడు; పతితుండు. అట్టి కుమారుని విడువజాలననిన నీవును జగంబున నిందనీయుండవు. ఇట్టి నీచుని గాంచుటగూడ పాపకారణంబు. నీవు విడువకున్న నేను విడుతునే యని భీకరారావంబు లొనరించుచు యజ్ఞదేవు నికటంబున నిలిచియున్న సుమతిం బట్టి మోదుచుండ, నాదెబ్బల సహింపలేక తండ్రీ యీహత్య నను గొట్టి చంపుచున్నది. తల్లిదండ్రులే యిటు గాంచుచు నూరకుండిన నన్నిక రక్షించువార లెవ్వరు? నేనెంతగ మొరలిడుచున్నను మీచిత్తంబున నించుకయు జాలి వొడమకున్నయది. నేనేమిసేయువాడ. నాప్రారబ్ధం బిటులున్నది. నేనేమిసేయుదు నని బోరన నేడ్చుచుండ, వానింగాంచి జననీజనకులును, భార్యయు మిగుల దుఃఖించుచుండిరి.

—: మునిశేఖరుండు దుర్వాసుండు సుమతికి బ్రహ్మహత్య ముక్త్యుపాయంబును వచించుట :—

అంతలోన దైవవశంబున శంకరాంశసముద్భూతుండును, ధర్మాత్ముండు నగు దుర్వాసోమునిచంద్రుండు రాగ నతనిం గాంచి సాష్టాంగనమస్కృతు లొనరించి, పరిపరివిధంబుల నుతించి, పుత్రకారణంబున నమ్మహాత్ముని శరణొంది, మునీంద్రా! నిను శంకరుని యపరావతారంబుగ బెద్దలు వేయివిధంబుల వర్ణించుచుందురు. పాపాత్ములకు నీదర్శనం బగుట కల్ల. నాతనయుండు బ్రహ్మహత్యాసురాపానస్వర్ణ

స్త్రీయాది మహాపాతకంబులనొనరించినవాఁడు. బ్రహ్మహత్య నాకుమారు జంప నుద్యమించియున్నది. నీకరుణాకటాక్షంబుల నాయందును, నాకుమారునియందును బ్రసరింపజేసి నాతనయుండు పాపవిముక్తుండై బ్రహ్మహత్యచే విడువబడు నుపాయంబును దెలుపుచు నాకుమారుని రక్షింపుము. నాకీతం డొకఁడే తనయుఁడు. ఇక నొకకుమారు డుండిన నేనింతగ విచారింపకుందును. ఈతండు మృతుం డగునేని నావంశంబంతయు మూలచ్ఛేదం బగును. నాయనంతరము నాపితరులకు పిండప్రదానంబును, తిలోదకంబు నొసంగువాఁడు లేఁడు. మహాత్మా, దయయుంచి వీని రక్షింపుమనవు డమ్మునిశేఖరుం డిటులనియె.

ఓయీ యజ్ఞదేవా! నీసుతుం డొనరించిన పాతకంబులకు ప్రాయశ్చిత్త మేధర్మశాస్త్రంబులం గానరాదు. కాని నాకొక యుపాయము తోఁచుచున్నది. సకలపాపవినాశకంబగు వేంకటాచలంబుననుండు స్వామిపుష్కరిణీజలంబుల స్నానం బొనరించెనేని నీకుమారుండు పాపవిముక్తుం డగును.

—: సుమతి స్వామిపుష్కరిణీస్నానంబున పాపవిముక్తుం డగుట :—

శీఘ్రంబుగ నీకుమారుం గొంపోయి యాపుణ్యనదీజలంబుల స్నానముచేయింపుమను మునివచనంబు లాలించి యావెంటనే స్వామిపుష్కరిణీనదికిం గొంపోయి స్నానము చేయించునంతలో నాకాశవాణి యిటు వినుపించెను. యజ్ఞదేవా! నీతనయుం డీనదీజలంబుల గ్రుంకులిడినకారణంబున పవిత్రుం డయ్యె; సంశయింప బనిలేదు. అని పలికిన, యాపలుకుల విని వార లిర్వురును పరమానందభరితులై నిజాలయమునకుం బోయిరి. మునులారా! మీకు వినుపించినపాపాటవీదావానలంబును, అఘవృక్షకుఠారంబు నగు నీచరితంబు నెవ్వారలు పఠింతురో యెవ్వారలు శ్రద్ధాభక్తిసంయుక్తులై విందురో వార లశ్వమేధఫలంబు నొందగల రని వచించి సూతుం డిటులనియె-



—: రామకృష్ణతీర్థమహిమానువర్ణనము :—

తాపసోత్తములారా! సకలాఘనివారకంబును, కృతఘ్నతాదోషవినాశకంబు నగు వేంకటాద్రియందలి రామకృష్ణతీర్థమహిమంబును వినుపించెద వినుండు. పితృమాతృగురుద్రోహులును, సర్వకాలములందును పరరంధ్రాన్వేషణం బొనరించువారలును, చేసినమేలును మరచియుండు దురాత్ములును వేంకటాద్రియందలి రామకృష్ణతీర్థస్నానమాత్రంబున బవిత్రు లగుదురు. మున్ను వేంకటాద్రియందు కృష్ణుండను మునివరుండు నారాయణపదకమలారాధనతత్పరుండై తపం బొనరించుచు స్నానార్థంబుగా నొక తీర్థంబు నందు నిర్మించెను. అందవగాహనమొనరించిన మానవులు కృతఘ్నతాదోషవిముక్తు లగుదురు. ఇందుల కొక యితిహాసంబు గలదు. అదియు పురాతనంబై పాపవినాశకంబై పుణ్యప్రదంబై యున్నయది.

తొల్లి సత్యసంధుండును, సౌశీల్యయుతుండును, సర్వభూతదయాపరుండును, శత్రుమిత్రసమభావుండును, విజితేంద్రియుండును, బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండును, మహాతపస్వియు నగు రామకృష్ణాఖ్య బరగు మునివరు డొకరుం డుండెను. నిరుపమానప్రభావసంపన్నుండగు నా రామకృష్ణుండు భూతలంబున నిలిచి నిశ్చలాంగుండై నిలిచినచోటు నుండి యిసుమంతయుం జలింపక దపం బొనరించుచుండెను. ఇటు లనేకవత్సరంబు లటులనే నిలిచియుండుటచే నాతని శరీరంబున పుట్టలు మొలచి క్రమక్రమంబుగ నాతని శరీరమంతయు నాక్రమించెను. ఆ మునివరుండు తన శరీరం బంతయు వల్మీకాక్రాంతంబగుటయు నెరుంగకయే తపం బొనరించుచుండెను.

అత్తపంబును సహింపలేక వాసవుండు పుష్కలావర్తకమేఘంబులం బిలిచి యమ్మునిపై సంతతధారగా వర్షింపు డన వార లేడు దినంబులు విరామములేక సంతతధారగా వర్షించిరి. దాని నమ్మునివరుండు సహించెను పిదప భయంకరంబులగు నురుములును, మెరుపు

లును బయలు వెడలి యమ్మునివరుని నయనయుగంబునకును, కర్ణపుటంబులకును జడిమను కల్పించెను. అంత నవ్వల్మీకోపరిభాగంబున పిడుగొక్కటి పడుటం జేసి యయ్యశనిపీడనంబున నవ్వల్మీకశిఖరంబు భగ్నంబయ్యెను.

—: రామకృష్ణుఁ డొనరించు తపంబునకు సంతసించి రమామానినీ మనోహరుండు ప్రత్యక్షమగుట :—

ఇట్లు శీతవాతాతిదుస్సహంబుగా బర్జన్యుండు వర్షించు నవసరంబున శంఖచక్రగదాధరుండును, వనమాలావిభూషణుండును, నీలనీరదనిభాంగుండు నగు రమాకాంతుం డారామకృష్ణునియెదుట బ్రత్యక్షమై నిలిచి యిటులనియె. ఓయీ! తపోధనసత్తమా! మదావిర్భావదివసంబున నీతీర్థంబున స్నాన మొనర్చిన మనుజుని పుణ్యవిశేషంబును వర్ణించుట కా నలుమొగంబుల వేల్పైనను సమర్థుండు గాడు. వేయిముఖంబులుగల చిలువలదొరయైనను వర్ణింపజాలడు. విప్రపుంగవా! దినకరుండు మకరరాశియందు బ్రవేశించియుండు పుష్యమీనక్షత్రయుక్త పూర్ణిమతిథియందు స్నానం బొనరింప విధింపబడియున్నది.

ఆదినంబున నీతీర్థంబున స్నాన మొనరించిన మనుజుం డఘంబుల బాసి, యిహంబున సకలభోగంబుల ననుభవించి విష్ణుసాయుజ్యంబు నొందగలడు. ఇంద్రాదిదిక్పాలురును మహామునులుం గూడ నీరామకృష్ణతీర్థప్రభావంబునం జేసి సమధికతేజోవిరాజితులై భాసిలుచుండిరి. ఈతీర్థము నీనామంబున బ్రసిద్ధినొందగలదు. అని పలికి యాశ్రీనివాసుం డంతర్ధానంబునొందెను. మునీంద్రులారా! సకలపాపవిశోధకంబును, బుద్ధిశుద్ధిప్రదంబును, సకలైశ్వర్యప్రదాయకంబు నగు రామకృష్ణప్రభావంబును వినుపించితిని. ఎవ్వారలు దీనిం బఠింతురో యెవ్వారలు శ్రద్ధాభక్తులు గలిగి విందురో వారలు విష్ణులోకంబు నొందగలరని వచించి మరల సూతుం డామునుల కిటులనియె.



—: శ్రీవేంకటాచలంబున గావించిన దానంబుల బ్రశంసించుట :—

వేంకటాచలంబున దృషార్తు లగువారలకు పిపాసాశాంతికై యుదకంబు నొసంగనివారలు తిర్యగ్యోనియందు జనింతురు. అందువలన బ్రతిమానవుండును తనశక్తి ననుసరించి జలపానాసక్తుల కుదకంబు లొసంగుట శ్రేయస్కరంబు. ఈవిషయంబున నొక చరిత్ర గలదు. అయ్యది విప్రగృహగోధికాసంవాదంబునా బరగుచున్నయది.

—: జలదానం బొసంగని కారణంబున హేమాంగుం డను నరపాలుండు బల్లియై పుట్టుట :—

మున్నిక్ష్వాకువంశంబున బుట్టినవాడును, బ్రహ్మభూయిష్ఠుండును, జితామిత్రుండును, హేమాంగుం డను భూపాలు డొకరుండుండెను. భూతలంబునందలి యిసుకరేణువులను, సప్తవార్నిధులందలి జంతుజాలంబును, ఆకసమందలి చుక్కలనైనను లెక్కింపవచ్చునుగాని యానరపాలు డొనరించిన గోదానంబుల లెక్కింప నేరికిని శక్యంబు గాదు. ఆతం డొనరించిన యాగంబుల వినియోగింపబడిన దర్భపుంజంబులచే భూమి బర్హిష్మతి యని పిలువం బడుచున్నయది దానపుత్రులగు ద్విజసత్తముల కనేకగోదాన, భూదాన, తిలదాన, హిరణ్యదానాదికంబులగు వివిధదానంబు లొనరించి సంతుష్టచిత్తుల గావించెను. వేయేల ఆతం డొనరింపని దానము లెవ్వియు లేవని వచించుటయం దతిశయోక్తి లేదు.

జలము జనులకు సులభలభ్యం బని దలంచి యుదకదాన మెన్నడును గావింపలేదు. చతురాననతనూభవుండును, మహాతపస్వియు నగు వసిష్ఠమునియు ననేకవిధంబుల నుదకదాన మొనరింపు మని బోధించెను. విలువలేనిదియు, నంతట నందరకును సులభంబుగ లభించునదియు నగు నుదకంబు నొసంగిన ఫల మేమి యని హేతువాదం బొనరించుచు ఆమునిచంద్రు వచనంబుల నాదరింపకుండెను. ఎయ్యది లభ్యంబుగాకుండునో యట్టి వస్తువును దానం బొనరింప నద్దానం దాతకు విశేషఫల

మబ్బును. అనుచు సయుక్తికంబుగ మాటలాడుటయెగాని యేకాలంబునను గూడ యెట్టివానికిని నీరంబుల నొసంగకుండెను. మరియు నారాజన్యుండు తరుచుగ నంగహీనులును, దరిద్రులును, వృత్తిహీనులు నగువారల బూజించుగాని, వేదవేదాంగపారగులును, శ్రోత్రియులు నగు ద్విజశ్రేష్ఠుల బూజింపకుండెను.

తనకు పురోహితుం డగు వసిష్ఠుండు, రాజా! దానార్హులగు విప్రవరుల సేవింపక నీచుల సత్కరించు టయ్యది ధర్మశాస్త్రనిషిద్ధంబని వచించినపుడు నరనాయకుం డాపలుకుల నాలించి మునీంద్రా! యుత్తముల నందరును పూజింతురు. అనాథులును, విద్యావిహీనులును, అంగహీనులును, దరిద్రులు నగు వారలకు గతి యెయ్యది? అందువలన నేనట్టివారలం గాంచి వారలకు వలయు నాహారాదికంబులగు సమస్తోపచారంబుల నొనరించుచుందు నని వికటవాదంబుల గావించుచు దుష్పాత్రదానాసక్తుండై యుండెను. ఆదోషప్రభావంబున నాభూకాంతుండు మూడుజన్మంబులందు చాతకపక్షియై పుట్టెను. ఒకజన్మయందు గ్రద్దయైపుట్టెను. ఏడుజన్మలు కుక్కయై పుట్టెను. అటుపిమ్మట మిథిలాధిపతియగు శ్రుతకీర్తి యను నరనాయకుని గృహంబున గృహగోధికయై పుట్టి గృహద్వారంబున సంచరించుచు నచట కరుదెంచిన కీటకంబుల భక్షించుచు నుండ, నెనుబదియెన్మిదేండ్లు గతించినవి.

పిమ్మట నొకదినంబున శ్రుతదేవుం డను బ్రఖ్యాతనామంబున బ్రసిద్ధుం డగు విప్రముఖ్యుండు మార్గాయాసంబున బడలి మధ్యాహ్నకాలంబున నానరపతి గృహంబునకు జేరెను.

—: శ్రుతదేవుని పాదోదకసేవనంబున హేమాంగునకు
జాతిస్మరణంబు గల్గుట :—

ధరారమణుం డామునిచంద్రుం గాంచి సత్వరంబుగ నిజాసనంబునుండి దిగి యాశ్రుతకీర్తి కెదురేగి పదంబుల కెరగి, జాతహర్షుండై యయ్యతిథి కర్ఘ్యపాద్యాచమనాదికంబు లొసంగి, యాతని పాదప్రక్షా



ళనం బొనరించి, ఆజలంబు నుత్తమాంగంబున జల్లుకొనుచుండ, నందలి కొన్నిబిందువులు దైవవశంబున నాబల్లిపై బడెను. ఆక్షణంబున పూర్వజన్మస్మృతిగల్గి తా జేసిన కర్మ కతిదుఃఖంబునొంది యటకు విచ్చేసియున్న భూసురపుంగవు నవలోకించి నిను శరణొందితిని. రక్షింపు మనియెడు నాగృహగోధిక పలుకుల నాలించి పరమాశ్చర్య నిమగ్నమానసుండై యావిప్రసత్తముం డిటుల నెను.

ఓగృహగోధికా నీ వెందులకై విచారించెదవు? నీ కేకర్మవశంబున నిట్టి యవస్థ సంప్రాప్తంబైనది? నీవు దేవతవో, మానవుండవో, భూసురుండవో, కాక నరపాలుండవో వచింపుము. భయము నొందకుము. నిను నే నుద్ధరించెద నను శ్రుతదేవున కామహీపాలకుం డిటుల నెను. మహాత్మా! నే నిక్ష్వాకుని వంశంబున బుట్టినవాడ. వేదవేదాంగాది సమస్తవిద్యల నభ్యసించినవాడ. శస్త్రవిద్యాపారగుండను. ధర్మమార్గంబున రిపుబలంబుల యేపడగించి రాజ్యపాలన మొనరించువాడను. నాపేరు హేమాంగుడు. లెక్కింప శక్యముగాని గోదానంబు లొనరించితిని. ఇష్టాపూర్తంబుల గావించితిని. సమగ్రదక్షిణల నొసంగుచు విధివిధానంబుగ గ్రతువు లనేకంబుగ నొనరించినాడను. శాస్త్రవిహితంబులగు దానము లన్నిటి నొనరించితిని. అట్టి నాకీదుర్గతి సంప్రాప్తంబైనది

ఇహభోగంబులును పరలోకంబును గూడ సున్న యయ్యెను. మూడుజన్మంబులజాతకపక్షినై బుట్టితిని. మరియొక జన్మంబున గ్రద్దనై జన్మించితిని. పిమ్మట నేడుజన్మంబుల శునకము నైతిని. ఇపు డీభూపాలునింట గృహగోధికనై యుంటిని. మీపాదంబుల గడిగి యీనరనాయకుం డాపాదపవిత్రామలనీరంబుల దన శీర్షంబున జల్లుకొనుచుండ నందలి బిందువులు కొన్ని నాపయిం బడుటంజేసి పూతుండ నైతిని. అంతియకాక పూర్వస్మృతియు జనించినయది. నాకెంకను దైవనిర్దిష్టంబులగు నిర్వదెన్మిది గృహగోధికాజన్మంబు లెత్తవలసియున్నది. తలచి

నపుడెల్ల చిత్తం బుత్తలపాటు నొందుచున్నయది. ఇట్టి తుచ్ఛజన్మంబుల భరింపజాల. మహానుభావా! యేమికారణంబున నేనిటు లైతినో దయయుంచి తెలియజేయు మను దీనాలాపంబు లాలించి యాద్విజుండు ధ్యాననిమీలితలోచనుండై యాతని చరితంబు నెరింగి యిటుల వచించెను.

—: శ్రుతదేవుం డొసంగిన పుణ్యవశంబున హేమాంగుడు గృహగోధికారూపమునుండి విముక్తుం డగుట :—

ఓధరాధినాయకా! నీదుర్గతికి కారణంబును వినుము- నీవు వేంకటాచలంబున నుదకదానం బొనరింపలేదు. మరియు నుదకంబులు సులభ్యంబు లనియు, విలువలేని వనియు దలంచి మార్గాయాసఖిన్నులగు వార లడిగినను నీరంబుల నీయకుంటివి. మరియు పాత్రాపాత్రవిచారణ యొనరింపకయే దుష్పాత్రదానంబుల గావించితివి. ప్రజ్వరిల్లు నగ్నిహోత్రుని విడచి భస్మంబున హోమము లొనరింపగూడునే సకల లోకపూజ్యం బగు తులసిని వీడి కంటకదురాసదంబగు వాకుడుచెట్టును పూజింప ఫలము గల్గునే. అనాథులనియు, అంగవిహీనులనియు, గుడ్డివారనియు, కుంటివారనియు, అట్టివారల కొసంగు దానంబులు ఫలప్రదంబులగునే. వారలయెడ దయగలిగి యుండవలెగాని, వేదవేదాంగపారగులై తపస్సంపన్నులై యుండెడు భూసురోత్తముల నిరాదరణ గావించుట మేలగునే. సకలవిద్యాపారంగతులగు విప్రసత్తములే పూజనీయులు. అందును జ్ఞానులగువారలు మహావిష్ణునకు మిక్కిలి ప్రేమాస్పదులు. అట్టివారి నారాధించుట మాధవసమర్చనాసమానంబని యెరుంగము. నీవిటు లాలోచింపక దుష్పాత్రదానము లొనరించితివి. అంగవిహీనులు మొదలగువారలపయిని దయతో వారలకు వలయు నన్నంబిడుటయు, శీతవాతాదిబాధల నొందకుండ వస్త్రంబు లొసంగుటయు మంచిది. కాని యట్టివారలు దానపాత్రులు గారని తెలియుము. రాజా! నీ వెన్నండు నుదకదానం బొసంగలేదు. సాధుపురుషుల నాదరింపలేదు.



ఆకారణంబున నీకిట్టి దుర్గతి సంభవించినయది. రాజా! నీపాపంబు శమించి నీదగు భూతభవ్యపాతకంబు నశించుటకయి వేంకటాద్రియందు నేనొనరించిన తపశ్చర్యవలన ఫలంబును నీకొసగుచుంటిని. అని వచించి యాద్విజపుంగవుం డాచమించి సంకల్పపూర్వకంబుగా దానింతవరకు సమార్జించిన పుణ్యఫలము నారాజచంద్రునకు ధారాదత్తము గావించెను. ఆనిమిషంబుననే యారాజన్యుండు గృహగోధికారూపంబును వీడి పూరుషాకారంబు నొంది దివ్యవస్త్రాభరణాలంకృతుండై మణిమయదివ్యవిమానం బధిరోహించి యమ్మిథిలేశుని మందిరంబున నుండి సాధుపుంగవులం గనుంగొని వారలకు ప్రణామంబు లాచరించి వారల యనుమతి వడసి సకలామరనికరసంస్తూయమానవైభవోపేతుండై దివంబునొంది యచ్చట బదివేలవత్సరంబులు వివిధభోగంబు లనుభవించి మరల నిక్ష్వాకువంశంబున మహారథుం డగు కకుత్స్థుండై జన్మించెను.

ఆజన్మంబున సాధుసమ్మతుండై, బ్రహ్మణ్యుండై సప్తద్వీపసమన్వితంబగు భూవలయంబు నంతను ఏకచ్ఛత్రాధిపత్యంబుగ బాలించుచు, సురేంద్రున కీడయి ప్రభుతయందు మహావిష్ణునకు సరియగుచు, రాజపురోహితుం డగు వసిష్ఠుండు బోధించునటుల మహాకార్యంబు లొనరించుచు దివ్యజ్ఞానసంపన్నుండై తుదకు విష్ణుసాయుజ్యంబు నొందెను. కావున వేంకటాచలంబు పుణ్యప్రదంబనియు, సకలకలుషాపహంబనియు నెరుంగనగును. మునివర్యులారా! మహాపాతకోపపాతకవినాశకం బగు వేంకటాద్రియందు గావించు దానవిశేషంబున గల్గు పుణ్యఫలంబును వినుపించితి వని పల్కి మరల నమ్మునులకు సూతుం డిటుల నెను.

—: శ్రీ వేంకటాచలక్షేత్రాదివర్ణనము :—

మునివరులారా! బ్రహ్మాండాంతర్గతములైన మహాతీర్థంబులన్నియు వేంకటాచలంబున గలవు. అయ్యద్రివరంబున శంఖచక్ర

ధరుండును, పీతాంబరధారియు, మంగళాకారుండును, కౌస్తుభాలంకృత విశాలవక్షస్థలుండును, నిజభక్తాభయప్రదుండును, వేదాంతవేద్యుండును, పురాణపురుషుండు నగు శ్రీమన్నారాయణుండు నివసించి యున్నవాడు. ఆదేవదేవుని సేవించుటకయి ప్రతివత్సరంబునను అంగ, వంగ, కర్ణాట, కోసల, కాశీ, గుర్జర, చోళ, కేరళ, పాండ్యాది సర్వ దేశవాసులగువారలు సకుటుంబపరివారంబుగ విచ్చేసి యాపురుషోత్తముని సేవించుచుందురు. ఇంద్రాదిదేవతలును, నారదాదిమహర్షులును, సనకాది యోగిపుంగవులును శ్రీవేంకటాచలేశుని పదసరసిజసేవాసంసక్త మానసులై యుందురు. ఎవ్వారలు భాద్రపదమాసంబున గావింపంబడు మహోత్సవంబును గాంతురో వారలు సకలపాపవినిర్ముక్తు లగుదురు. కన్యామాసంబున చతురాననుండు ప్రతివత్సరంబునను ధ్వజారోపణమహోత్సవంబును గావించును.

ఆసమయంబున కిన్నర కింపురుష సిద్ధ సాధ్యాది దేవగణంబులును, భక్తిశ్రద్ధాసమన్వితు లగు మానవోత్తములును బ్రహ్మోత్సవంబును గాంచుటకయి వచ్చుచుందురు. సకలవిద్యలను వేదమువలె, మంత్రము లన్నిట బ్రణవమురీతి, ధేనువులందు కామధేనువుంబలె, ప్రియతమంబులగు సకలవస్తువులందు ప్రాణముభాతి నీవేంకటాచల క్షేత్రము క్షేత్రము లన్నిటియందు నుత్తమమై యున్నది. సర్పజాతిలో శేషుండును, విహంగమంబుల గరుడుండును, దేవతాగణంబున మహావిష్ణుండును, వర్ణము లన్నిటియందు బ్రాహ్మణుండును క్షేత్రము లన్నిట వేంకటాచలక్షేత్రంబును ఉత్తమంబులని తలంపవలెను. తరువరంబుల గల్పకంబును, మిత్రగణంబున కళత్రంబును, తీర్థములందు గంగయు, తేజస్సు లన్నిటిలో సూర్యుండును, క్షేత్రంబుల వేంకటాచలంబు నుత్తమంబులుగా నెరుంగునది. ఆయుధము లన్నిట వజ్రాయుధంబును, లోహసముదయంబున సువర్ణంబును, విష్ణుభక్తుల శంకరుండును, రత్నంబు లన్నిట కౌస్తుభంబును, క్షేత్రంబుల వేంకటా



చలంబు నుత్తమంబులు. వేంకటాచలక్షేత్ర మొక్కటియే విష్ణుప్రీతికరం బగునది యని గ్రహింపుడు. వైశాఖమాససమంబగు మాసంబును, కృతయుగంబున కీడగు యుగంబును, వేదతుల్యం బగు శాస్త్రంబును, గంగాతీర్థమున కుద్దియగు తీర్థంబును, జలదానంబున కీడగు దానంబును, భార్యాసుఖంబును మించిన సుఖంబును, జీవితలాభము కంటె లాభంబును, ఉపవాసంబునకు సరియగు తపస్సును, అన్నదానంబునకు సాటియగు దానంబును, దయతో సమానమగు ధర్మంబును, నేత్రమునకు సరియగు జ్యోతిస్సును, భోజనంబున కీడగు తృప్తియు, వర్తకంబునకు సమంబగు కృషియు, సత్యభాషణాతుల్యంబగు కీర్తియు, వేంకటాచలంబుతో బోల్పదగిన క్షేత్రంబును గానగావు. ఏక్షేత్రంబును స్మరించినమాత్రమున సమస్తపాపములు నశించునో, యేనగ ప్రణామంబునంజేసి సకలసౌఖ్యంబు లొందనగునో, యేపర్వతంబును మహేంద్రాది బృందారకులును సేవించుచుందురో యట్టి వేంకటాచల మహిమంబు నెటుల వర్ణింపగలను !

ఏతీర్థంబున సమస్తతీర్థంబులు నివసించియుండునో యట్టి స్వామిపుష్కరిణీతీర్థ మవ్వేంకటాచలంబున గలదు. స్వామి పుష్కరిణికి పశ్చిమతీరంబున భూదేవీసహితుండగు వరాహమూర్తి కాంతాలింగన సంగతబాహుయుగళుండై, శాంతమూర్తియై, మనోహరాకారుండై వసించి యున్నవాడు. అట్టి స్వామి పుష్కరిణీతీర్థంబును వర్ణింప నే సమర్థుండ గాను. స్వామిపుష్కరిణీదక్షిణతటంబున మహాలక్ష్మీ సమాలింగితశరీరుండై వేంకటేశ్వరుండు భక్తవరదుండై వసించియున్న వాడు. ఎవ్వార లీవేంకటాచలక్షేత్రమహిమంబును శ్రద్ధాభక్తిసమన్వితులై వినియెదరో వారలు పాపవినిర్ముక్తులై విష్ణుసాయుజ్యంబు నొందగలరని పలికి వెండియు సూతుం డిటులనియె.

—: శ్రీవేంకటేశ్వరవైభవవర్ణనము :—

తపోధనసత్తములారా ! ఏచరితంబు నాలకించిన మాత్రంబున

పాపసంచయ మంతయు నాశమొందునో యట్టి వేంకటేశ్వరవైభవంబును వచించెద వినుండు.

దేవదేవుండగు వేంకటాచలేశు నొకసారి సందర్శించినను విష్ణుసాయుజ్యంబు ప్రాప్తించును. కృతయుగంబున పదివత్సరంబుల కార్జించిన పుణ్యఫల మయ్యది త్రేతాయుగంబునం దొకవత్సరంబున సంప్రాప్తంబగును. ద్వాపరంబున నద్దియే యైదుమాసములకు ప్రాప్తంబగును. అట్టిఫలమే కలియుగంబునం దొకదినంబున సంభవించును. శ్రీ వేంకటాచలంబును సేవించువారల కట్టిఫలము ప్రతినిమేషంబునను కోటిగుణితంబై లభ్యంబగును. ఏమానవు లొకసారియైనను భక్తిశ్రద్ధాసమన్వితులై కీర్తింతురో, పూజ గావింతురో వారలకు గోదానాది దానఫలంబును, సమస్తక్రతుఫలంబును సంప్రాప్తంబగును. ఎవ్వ రాశ్రీనివాసుని ధ్యానింపకుందురో వారలు జ్ఞానహీనులని తలంపవలెను. ఆదేవుని కీర్తింపనివారలు మూగవారలై యనేకకష్టంబుల నొందగలరు. మానవజన్మము దుర్లభం బగునది. అట్టిజన్మము నొందియు శ్రీవేంకటేశుని పదరాజీవంబుల పూజింపనివారలు పశుతుల్యులని భావింపవలయును. శ్రీనివాసుని భక్తుల సమాదరముగ గాంచువారల కాదండధరకింకరులును భయ మొందుచుందురు. ఎవ్వారలు సర్వకాలంబులందును భోగముల ననుభవింపదలంతురో స్వర్గసుఖంబును గోరుచుందురో వార లాశ్రీనివాసు నర్చింపవలయును. సంతసంబునగాని, భయమొందిగాని వేంకటాచలేశుని స్మరించినవార లిహపరంబుల సుఖంబు నొందగలరు. జ్వలదనలంబునం దిధ్మంబులు భస్మమగునటుల వేంకటేశసందర్శనంబున కలుషంబులు భస్మంబగును. శ్రీనివాసునియందలి భక్తి యన నయ్యది యెన్మిదివిధంబుల దెల్పబడుచున్నది. వానిని వివరింతును. వినుండు- దేవదేవుని భక్తులయందు వాత్సల్యంబును, సంతసంబున శ్రీనివాసుని భక్తులనారాధించుటయు, శరీరంబు నాశ్రీకాంతుని సేవానిమిత్తంబుగ నర్పించుటయు, మాధవ



చరితంబుల వినుటయం దుత్సుకత కలిగియుండుటయు, మాధవుని చరితంబుల వినునపుడు స్వరమునందు, నేత్రములందు, శరీరమునందు వికారములు తోచుచుండుటయు, తాను స్వయముగ నాశ్రీకాంతుని పూజించుటయు, నెల్లపుడు నాకమలాకాంతుని స్మరించుచుండుటయు, శ్రీవేంకటాచలంబున నివసించుట, ఆపరాత్పరు నాశ్రయించియే తన జీవితంబును గడుపుట యను నీయెన్మిదివిధంబులగు భక్తివిషయంబులు మ్లేచ్ఛునియందు కలిగియున్నను యట్టివాడును ముక్తి నొందగలడు. మరియు నూర్ధ్వరేతస్కులగు యతీశ్వరులును వేదాంతశ్రవణం బొనరించి, జ్ఞానము నార్జించినగాని ముక్తి నొందలేరు. శ్రీనివాస దర్శనమాత్రంబున ముక్తి సంప్రాప్తమగును. ఏజాతివారలైనను ఏయాశ్రమమునందున్నవారలైనను పునర్భవశూన్యం బగు మోక్షము నొందగలరు. శ్రీ వేంకటాచలంబునం దిరుగుచుండు క్రిమికీటకాదులును, పశుపక్ష్యాదిజంతువులును, అచట నుండు మానవులును, ముక్తి నొందు ననుటకు సంశయం బిసుమంతయు వలదు. శ్రీనివాస సందర్శనమున కెనయగు పుణ్యప్రదమగు క్షేత్రము గానరాదు. ఏమానవాధముండు శ్రీవేంకటాచలేంద్రుని ద్వేషించి నిందావచనంబు లాడుచుండునో యట్టివాడు యమలోకంబున సకలవిధనరకంబుల ననుభవింపగలడు. స్వామిపుష్కరిణీతీర్థస్నానంబును, శ్రీనివాసదర్శనంబును గావించినవారల పుణ్యఫలంబును వర్ణింప సమర్థులు లేరని వచింపనగును. వేదవేదాంగాది శాస్త్రంబులను, పౌండరీకాది క్రతుసముదయంబును, శ్రీనివాసాయత్తంబని తెలియనగును. ఘటికాద్వయమాత్రకాల మెవ్వారలు శ్రీనివాసుని ధ్యానించెదరో వారలు వారివారి యిర్వదియొక్కకులములతో ముక్తి నొందెదరు. శ్రీవేంకటాచలాధీశుండు దయాసముద్రుడు. తన్నుం గాంచినవారి కేలోటు రాకుండ నెల్లకాలములందును గాపాడుచుండు నని వచించి సూతుండా శౌనకాదిమహామునుల కిటులనియె.

—: బ్రహ్మాది దేవతలు నిరంతరంబును శ్రీవేంకటాచలంబున నివాసముగ నుండుట :—

మునిసత్తములారా! కోట్లకొలంది లెక్కకు మించిన నదీనదంబులును, సప్తసముద్రంబులును, అనేకాశ్రమంబులును, పుణ్యక్షేత్ర సముదయంబును, వేదారణ్యాది మహారణ్యంబులును, వసిష్ఠాది మునిపుంగవులును, సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుషవర్యులును, ధరణీరమాకాంతలంగూడి మాధవుండును, సావిత్రీసరస్వతులంగూడి చతురాననుండును, హైమవతీసహితుండై త్రిపురాంతకుండును, హేరంబ, షణ్ముఖ పురందరాది బృందారకులును, సూర్యాది నవగ్రహంబులును, వసువులెనమండ్రును, పితృదేవతలును, లోకపాలురును, సర్వకాలములందును, మహాపాతకనాశకరంబగు శ్రీవేంకటాచలంబున నివసించియుందురు. అయ్యచలోత్తమదర్శనంబున మానవులకు బుద్ధియు, సుఖంబును, ముక్తియును కలుగును. వేంకటాచలమూర్ధంబున నివాసంబుగ నుండి, సిద్ధచారణరమణీమణులు సర్వకాలములందును, శ్రీవేంకటాచలేశు నర్చించుచుందురు. అంగలగ్నంబు లగు బ్రహ్మహత్యాది మహాపాతకంబులును, అగమ్యాగమనాది దోషంబులును అయ్యచలనిరీక్షణంబున నాశమొందును. వేంకటాచలంబును మనంబున ధ్యానించుచు, పుణ్యవర్ధనా! సకలామరనికరసంస్తూయమాన మహావైభవా! నాయఘంబుల బారద్రోలి నీమూర్ధంబున నివసించియున్న రమాకాంతుని నాకనులపండువుగ గనుపరుపుమని ప్రార్థించవలయును. పిమ్మట మెలమెల్లన నానగోత్తమంబు నధిరోహించి సకలకలుషనివారిణి యగు స్వామిపుష్కరిణీతీర్థంబున నియమపూర్వకంబుగ స్నాన మొనరించి సర్షపమాత్రంబైనను, శమీపత్రప్రమాణమైనను, పితరుల నుద్దేశించి పిండప్రదాన మొనరింపవలెను. ఆకారణంబున పిండప్రదానం బొనరించినవారి పితరులు నరకనివాసంబును విడిచి స్వర్గసుఖంబుల ననుభవించి మోక్షము నొందగలరు.



—: పాపవినాశనతీర్థమాహాత్మ్యము :—

తపోధనులారా! పుణ్యతమంబును, పవిత్రంబు నగు వేంకటాచలంబున, సకలభువనప్రసిద్ధంబును, సర్వతీర్థంబుల నుత్తమంబు నగు పాపనాశననామంబున ప్రఖ్యాతిం గన్న తీర్థము గలదు. అద్దాని నామసంకీర్తనంబున గర్భనరకబాధ నొందకుందురు. స్వామితీర్థంబున పిండదానం బొనరించినపిమ్మట పాపనాశనతీర్థంబున స్నాన మొనరింపవలయును. అనుటయు సూతుం గాంచి మునులందరును ఓమహానుభావా! పూజ్యతముం డగు వ్యాసమునీంద్రునివలన వినియున్నవాడవు గాన సవిస్తరంబుగ పాపనాశనతీర్థవైభవంబు నెరింగింపు మన సూతుం డిటులనియె. మునిచంద్రులారా! మున్ను హిమవత్పార్శ్వంబున నుండెడు బ్రహ్మాశ్రమంబున జరిగిన యొక కథను వినుపించెద వినుండు. హిమభూధరంబునం దొకపార్శ్వభాగంబున, నానావృక్షసమాకీర్ణంబును, బహుగుల్మలతాకీర్ణంబును మృగగణనిషేవితంబును, సిద్ధచారణసంసేవితంబును, పుష్పితలతావితానసంశోభితంబును, శాపాయుధవిరాజమానంబును, నియమవ్రతసంపన్నులును, భాస్కరభాసురాకారులు నగు భూసురులచే భాసురంబు, యోగదీక్షాయుతులును, నియతాహారునులు, వేదాధ్యయనసంపన్నులు నగు వైదికబృందపరివేష్టితంబును, స్వాశ్రమాచారనిరతులును, స్వవర్ణోచితధర్మతత్పరులు నగు బ్రహ్మచారి, గృహస్థ, భిక్షుక సమాకులంబును, వాలఖిల్యాది యోగిపుంగవసమాశ్రయంబు నగు బ్రహ్మాశ్రమంబు గలదు.

—: దృఢమతి యను శూద్రకులజుని వృత్తాంతము :—

అయ్యాశ్రమంబునకు మున్నొకనాడు మహాసాహసికుండును, నిజకులోచిత ధర్మపరిత్యాగియు, శూద్రకుల సంభవుండు నగు దృఢమతి యనువాడు జనుదెంచి మనంబున నించుకయు శంక నొందక భూసురాంతికంబునకుం జనిన నాతనిం గాంచి వారలందరును సాదరంబుగ గారవించిరి. ఆదృఢమతియు నావిప్రపుంగవులం గాంచి తన గోత్ర

నామంబులం దెలియబరచి వారల పాదంబులకు ప్రణామంబులాచరించి యందొకచో గూరుచుండి, వివిధయాగకర్తలును, దివ్యతేజోవిభ్రాజితులు నగు భూసురపుంగవులం గాంచి ప్రహృష్టాంతరంగుండై యుత్తమంబగు దపంబొనరింప నిచ్ఛ జనించుటంజేసి కులపతి యను తాపసవర్యున కిటులనెను. మహాత్మా! తపంబొనరింప నుత్సుకుడనై యుంటిని. నన్ననుగ్రహింపు మను పలుకుల విని యాకులపతి యిటు లనెను.

ఓయీ దృఢమతీ! హీనకులజుండవగు నీవు యాగదీక్ష వహించుట నీతిగాదు. నాపలుకులు నీకాదరణీయంబులగు నేని శుశ్రూషానిరతుండ వగుము. జాతిహీనున కెన్నండు నుపదేశ మొనర్పరాదు. అట్లుపదేశించినవారలు కలుషము నొందగలరు. శూద్రునకు వేదాధ్యయనంబు గూడదు. శూద్రునిచే యాగంబుల జేయింపరాదు. వ్యాకరణాదిశాస్త్రంబుల జదివింపరాదు. కావ్యనాటకాలంకార పురాణేతిహాసంబుల నుపదేశింపరాదు.

ఈచెప్పిన వానిలో నెద్దానినైనను శూద్రున కుపదేశించె నేని యట్టి ద్విజులను విప్రనివాసంబులనుండి వెడలగొట్టవలెను. శూద్రున కుపదేశాదికంబొనరించిన భూసురుని చండాలునిగా భావింపవలయును. అక్షరసమన్వితుం డగు శూద్రుని దూరంబున విడువవలయును. అందువలన నీవు బ్రాహ్మణులకు శుశ్రూష గావించుచుండుము. మన్వాదులందరును శూద్రునకు విప్రశుశ్రూషయే పరమధర్మం బని వచించియున్నవారు. నైసర్గికం బగు కర్మను వీడుట సమంజసంబు గాదు. అనుటయు నామునిపలుకు లాలించి యాతండు మనంబున నిటులాలోచించెను. అకటా! నేనిపుడేమిచేయువాడ. తపోనుష్ఠానంబున నాకెంతయు నిచ్ఛజనించియున్నది. మునివరుం డీరీతిని ప్రతికూలవచనంబుల వచించుచున్నాడు. కాని మ్మెటులనైనను నాకు సుజ్ఞానంబెత్తెరంగున బ్రాప్తించునో యందుల కనుకూలంబగు ప్రయత్న మొనరింతు నని మనంబున



దృఢనిశ్చయముం గావించి యాదృఢమతి యయ్యాశ్రమతలంబునకు దూరంబుగ బోయి, యట నొకపర్ణశాలను నిర్మించి తనదగు తపస్సిద్ధికయి దేవతాగృహంబును, పుణ్యాయతనంబులను, పుష్పారామంబులను, తటాకాదికంబులను నిర్మించి, యభిషేకార్చనాదికంబు లొనరించుచు నియమపూర్వకంబుగ నుపవసించుచు విప్రదానహోమాదికంబుల నెరపుచు ఫలాహారుండై, జితేంద్రియుండై కందమూలఫలాదులచేతను సుమవిసరంబులచేతను, సముపాగతులగు నతిథులబూజించుచునుండ గొంతకాలము గడచెను.

—: దృఢమతికి సుమతియను భూసురుండు
కర్మానుష్ఠానక్రమంబును తెలుపుట :—

పిమ్మట నొక సమయంబున నాపాదజుని యాశ్రమంబునకు గర్గకులోద్భవుండును, జితేంద్రియుండును, సత్యవాదియు నగు సుమతి యను ద్విజుండు విచ్చేసెను. దృఢమతి యాభూసురవరుంగాంచి నమస్కరించి స్వాగతవచనంబుల బల్కి ఫలాదికంబుల నాస్వాదింపజేసి కుశలం బడిగెను. దృఢమతియొనరించిన యర్ఘ్యపాద్యాది విధానంబునకెంతయు సంతసించి యాశీర్వచనంబుల నొసంగి యాశూద్రుని యుపచారంబుల కలరి నిజాశ్రమంబునకు బోయెను. అది మొదలుగ నాదృఢమతియం దమితప్రేమ ముదయించుటంజేసి ప్రతిదినంబునను వాని యాశ్రమంబునకు వచ్చుచు బోవుచుండ చిరకాలము గడచెను. క్రమక్రమంబున నాదృఢమతి యెటులాడిన నటు తలనొగ్గుటయేకాని వానికి వ్యతిరేకం బాడుటకును సమర్థుడు గాకుండెను. అంత నొక కాలంబున సుమతిం గాంచి దృఢమతి యిటులనెను. మహాత్మా! నీయందు నాకుండిన గురుభావంబు నాలోచించి హవ్యకవ్యవిధానంబును నాకుపదేశింపుమన నాతం డటు లుపదేశించి యాదృఢమతిచే పితృకార్యాదిక్రియలనొనరింపజేసెను. పితృకర్మానంతర మాశూద్రకులజుం డాద్విజుని విడిచిపుచ్చెను. అది మొదలుగ నాసుమతిని బాడబులందరును దమ నిక

టంబులకు జేరనీయకుండిరి. ఇట్టిరట్టడి సహింపలేకనో యన నచిరకాలం బుననే యాసుమతి పంచత్వమొంది యమపురాతిథియైపోయెను.

అందాపాపిని గాంచి యమకింకరు లందరు జాలిమాలి వివిధనరకంబుల గూలద్రోయుచు నక్కటికంబున మిక్కుటంబులగు నిక్కట్టుల బెట్టుచుండ నపరిమితఖేదంబునొందుచు ననేకకల్పంబు లానరకబాధల ననుభవించి యనేకరూపంబుల, జన్మంబుల నొందుచుండెను. ముందుగ స్థావరరూపమొందెను. పిదప గాడిదయై పుట్టెను. తర్వాత విడ్వరాహమయ్యెను. పిమ్మట సారమేయమై, యటుపిమ్మట వాయసజన్మంబు నొంది ఆయాజన్మములం దపారదుఃఖముల ననుభవించి, యటుపిమ్మట చండాలుండై పుట్టి యాపిదప వణిగ్గర్భసంజాతుండై యనంతర మొక యుత్తమక్షత్రియ వంశమునం దుద్భవమంది యాజన్మములందు తన కంటె బలవంతులగువారలచే ననేకంబులగు నిడుమలం బడి యాకడపట నొక విప్రకుటుంబంబున బుట్టువందెను. గర్భాష్టమంబున నుపవీతుండై స్వీయాచారాభ్యాసతత్పరుండై యుండెను. అంత నొక సమయంబున నేదేని కారణంబున ఘోరకాంతారంబునకుం బోయి యట సంచరించుచుండునంత నొక బ్రహ్మరక్షస్సాతని నావహింప రోదనం బొనరించుచు బరిభ్రమించుచు తొట్రుపాటునొందుచు నొడలెరుంగక బ్రేలుచు వికటాట్టహాసం బొనరించుచు భయంకరంబుగ హాహాకారంబు లొనరించుచు వైదికకర్మల వ్విడిచి సంచరించుచుండెను.

ఈతీరున భూతావిష్టుండై చరించు సుతునింగాంచి యాతని జనకుండెంతయు విచారసాగరనిమగ్నుండై తనయుని వెంటనిడుకొని సువర్ణముఖరీతీరంబున తపోనిష్ఠాగరిష్ఠులై యుండెడు కుంభసంభవాది మునిసార్వభౌముల చెంతకరిగి వినమితకంధరుండై ప్రణామము లాచరించి యందు కలశజుం గాంచి మునిశేఖరా! శరణంటిని. నను రక్షింపు మన నయ్యగస్త్యుం డావిప్రుంగాంచి యిటులనెను. నీవెందులకై యిటుల దుఃఖించుచుంటివి. కారణమును వివరింపుము. పిదప నావిచారోపశమనంబున కాలోచింతు నన నవ్విప్రుం డిటులనెను.



:— అగస్త్యాజ్ఞానుసారంబుగా దుర్గతిహరణంబున కాసుమతి వేంకటాచలంబున కరుగుట :—

మునిసత్తమా! ఈతండు నాకుమారుండు. ఫలసమిత్కుశాహరణంబునకయి విపినంబునకు బోవ నందొక బ్రహ్మరక్ష స్సావహించి యిడుమలంబెట్టుచున్నది. సుఖ మన నెట్టిదియో యెఱుంగడు. అనుభవించు కష్టములకు మితములేదు. నీదయాసముద్రతరంగశీకరంబుల వీనిపై బ్రసరింపజేసి మాపరితాపానలంబును జల్లార్పుము. నాకు వీడొక్కడే కుమారుడు. దయయుంచి రక్షింపు మనవు డయ్యగస్త్యుండు కొంతతడవాలోచించి యమ్మహీసురున కిటులనెను. విప్రోత్తమా! నీతనయుండు సుమతి యను నామంబున బ్రఖ్యాతిగన్న మహీసురుండయ్యు నొక శూద్రునితో స్నేహభావంబున జరించుచు వానికి వైదిక కర్మంబుల నుపదేశించెను. ఆకారణంబున దండధరుని కింకరులు గొంపోయి నగకంబుల బడద్రోయ నందనేకకల్పంబులు గతించుదనుక ననేకనరకంబు లనుభవించి పిదప ననేకయోనులంబుట్టి తుద కిపుడీ బ్రాహ్మణజన్మ మొందినాడు. ప్రారబ్ధకర్మవశంబున యమప్రేరితంబగు బ్రహ్మరక్షస్సు వీనింబట్టి పీడించుచున్నయది. నీతనయుండు బ్రహ్మరక్షస్సునుండి విడువంబడు నుపాయంబును వచింతు వినుము.

సకలమునిగణసంసేవితంబగు సువర్ణముఖరీతీరంబున సర్వసుపర్వసంస్తూయమాన మహావైభవోపేతంబగు వేంకటాచలంబుకలదు. అయ్యచలరాజంబున సర్వపాపవినాశకంబును, పుణ్యఫలప్రదంబు నగు పాపనాశన మను పేరంబరగు నుత్తమతీర్థంబు కలదు. అందలి స్నానమాత్రంబున భూతప్రేతపిశాచబ్రహ్మరక్షస్సులు వీడిపోవుటయే గాక శరీరంబునగల్గు రోగంబులును నాశమొందగలవు. ఆలసింపక నీతనయుం దోడ్కొని యాపాపనాశనతీర్థంబున మూడుదినంబులు స్నానము జేయించుము. ఈతని నావహించిన బ్రహ్మరక్షస్సు వీడిపోవును. వేగముగ పొమ్ము పొమ్మని తొందరసేయ నాసంయమివరుననుజ్ఞగైకొని

సుతసమన్వితుండై వేంకటాచలంబున కరిగి సంకల్పపూర్వకంబుగ నయ్యుత్తమతీర్థంబున మూడు దినంబులు కుమారుని స్నానంబు చేయించియాభూసురుండు నందున మూడుదినంబులు స్నానంబాచరించి యాహ్నికవిధానంబుల నిర్వర్తించి యందలి జలమును పానం బొనరించి శుద్ధాత్ముండయ్యెను. అవ్విప్రతనూభవుండును పాపనాశనతీర్థమహిమంబున బ్రహ్మరక్షస్సునుండి విముక్తుండై రోగంబులబాసి స్వస్థుండై మనోహరాకారంబునొంది సర్వసంపత్సమన్వితుండై యఖండభోగంబుల ననుభవించి దేహావసానంబున ముక్తినొందెను.

—: వైదికకర్మానుష్ఠానతత్పరుడగు దృఢమతియు దుర్గతిం బాయుట :—

భూసురోపదిష్టంబులగు వైదికకర్మల నాచరించిన దృఢమతియు శరీరావసానంబున చిరకాలము ఘోరనరకంబుల ననుభవించి తుదకు గ్రద్దయై పుట్టి యొకదినంబున దప్పింగొని జలపానాకాంక్షచే నుదకంబును వెదకుచు నెగురుచుం బోయి వేంకటాచలంబందలి పాపనాశన తీర్థముం గాంచి యందలి జలంబులం ద్రావి కొన్ని నీటిబిందువుల తనరెక్కలపై జల్లికొనునంతలోన సర్వాలంకారభాసురం బగు దివ్య రూపంబు నొంది దివ్యవిమానవరంబు నధిరోహించి నిర్జరాలయముం జేరెను.

సంయమీంద్రులారా! ఏతీర్థంబున స్నాన మొనరించిన మాత్రంబున పాపభూయిష్ఠులగు సుమతి, దృఢమతి యను నిర్వురును పాపవిముక్తులై సుగతి నొందగల్గిరో యేతీర్థరాజము తనయందు మున్కలిడిన వారి పాపంబుల బారద్రోలుటం జేసి పాపనాశననామంబున బ్రఖ్యాతి గాంచెనో యట్టి పాపనాశనతీర్థవైభవంబును మీకు వినుపించితి నని బల్కి వెండియు సూతుం డిటులనియె.

—: పాపవినాశనతీర్థమాహాత్మ్యవర్ణనము :—

తపోధనసత్తములారా! పాపవినాశనతీర్థమహిమంబును విశదీక



రించు నొక యితిహాసంబు కలదు. దాని వినిపించెద వినుండు. పూర్వకాలంబున వేదవేదాంతసంవేదియు, దరిద్రుండును, వృత్తిహీనుండు నగు భద్రమతి యనుపేరం బరగు విప్రశేఖరుం డొకరుం డుండెను. ఆతం డభ్యసింపని శాస్త్రంబును, వినని పురాణంబును, చూడని ధర్మశాస్త్రంబును లేవు. ఆవిప్రపుంగవునకు కృతయు, సింధువును, యశోవతియు, కామినియు, మాలినియు, శోభయు ననియెడు నార్వురు భార్యలు కలరు. వారలయం దామహీసురోత్తమునకు కుమాళ్ళిన్నూర్వురు జనించి క్షుత్తృష్ణాపరిపీడితులై యుండిరి. అట్టి దారపుత్రాదులం గాంచి దరిద్రుండగు భద్రమతి వ్యాకులచిత్తుండై దుఃఖించుచుండెను.

అక్కటా! భాగ్యరహితంబును, ధనహీనంబును, యశోవిహీనంబును, ఆతిథ్యశూన్యంబును, ఆచారవర్జితంబును, జ్ఞానవిరహితంబును, సుఖహీనంబును, బంధురహితంబు, బహుసంతానయుతంబునగుపుట్టువులు కాల్పనే; దారిద్ర్యాంబునిధినిమగ్నుండగు నతనిగుణగణంబును, సౌమ్యతయు విద్వత్తయు, సత్కులప్రసూతియు, శోభ నొందకుండునుగదా! ఐశ్వర్యవిహీనుండగు మానవుని పుత్రపౌత్రులును, కళత్రంబును, బంధుమిత్రులును, తోడబుట్టువులును, శిష్యసముదయంబును, తక్కంగల మానవులునుగూడ దూరంబుగ విడుతురు. భాగ్యవంతుండగు నరుండు చండాలుండైనను పూజనీయుండగును. దరిద్రుండగు నరుండు శవంబువలె లోకనింద్యుం డగును. సంపదగల నరుండు కఠినాత్ముండయ్యు దయామయుండని ఖ్యాతి గాంచును. ధనవంతుండగు పురుషుండు మూర్ఖుండయ్యు బండితశిఖామణి యనం బరగుచుండు. మానవునకు దరిద్రంబుకంటె దుఃఖజనకంబగునది వేరెద్దియు గానరాదు. దరిద్ర మాశను కలుగజేయును. ఆశాపిశాచ మావహించిన నరుండు పూజనీయుండు గాకుండును. ఆశకు దాసులగువారలు లోకంబంతకును దాసులగుదురు. ఆశను దాసిగా నొనరింపగల ధీరులకు లోకంబం

తయు దాస్య మొనరించును. సకలకళాప్రవీణుండయ్యు దరిద్రుండగు నేని మూర్ఖాగ్రేసరుండగును. దారిద్ర్యమకరగ్రస్తు లగువారలకు విమోచనంబు సున్న. దారపుత్రాదు లిట్టుల తినుట కన్నము లేక, కట్ట గుడ్డ లేక వనట నొందుచుండ వారలం గాంచి నిరతంబును దుఃఖించుచుండవలెను. తొలిజన్మంబుల నేమిపాప మొనరించితినో గదా! యని సర్వశాస్త్రవిశారదుం డగు భద్రమతి యైశ్వర్యప్రదంబగు ధర్మం బెద్దియేని కలదా యని మనంబున నాలోచించుచుండెను.

—: భద్రమతిని కామిని యను భార్య వేంకటాచల గమనంబునకు బ్రోత్సహించుట :—

అంత నొకసమయంబున మహాపతివ్రతయు, సద్గుణసంకలితయు నగు కామిని యను నవ్విప్రపత్ని పతిపాదంబుల కెరగి యిట్లు విన్నవించెను. మహాభాగా! సర్వశాస్త్రార్థవిశారదుండ వగు నీవిట్టుల విచారింపదగునే! నావిన్నప మాలింపుము. సకలమునిగణసంసేవితం బగు సువర్ణముఖరీతీరంబున వేంకటాచలంబు గలదు. సురాసుర నమస్కృతం బగు నయ్యద్రిరాజంబున పాపవినాశనంబను పవిత్రతీర్థము గలదు. దారపుత్రాదులం గూడి నీవా పవిత్రతీర్థంబునకుం బోయి యందు నియమంబున స్నానం బొనరింపుము. నే నాతీర్థమహిమంబును సురమునిచంద్రుం డగు నారదునివలన వింటిని. మున్నొకనాడు బాల్యచాపల్యంబున నాజనకుని తొడపై గూరుచుండి యాటలాడుచుండు నంతలో నారదుం డటకు విచ్చేసి ప్రస్తావవశంబున నిట్లు వచించె.

ఓయీ! సమస్తకలుషవినాశకంబును, మహాపుణ్యఫలప్రదంబును, సర్వదుఃఖవినాశకరంబును, సర్వసంపత్ప్రదాయకంబు నగు వేంకటాచలంబునందలి పాపనాశనతీర్థంబున సంకల్పపూర్వకంబుగ స్నాన మొనరించి విపులైశ్వర్యప్రదంబగు భూదానం బుత్తమబ్రాహ్మణునకు గావించినవార లఖండైశ్వర్యవంతులై మనోభీష్టంబుల నొందగలరనెను. ఆనారదుని పలుకుల నాలించి ప్రహృష్టాంతరంగుండై మజ్జన



కుండు శేషశైలముం జేరి పాపనాశనతీర్థజలంబుల స్నాన మొనరించి శ్రోత్రియుం డగు భూసురోత్తమునకు సర్వసంపత్ప్రదాయకం బగు భూదానము గావించి యందునం జేసి సర్వసంపత్సమన్వితుండై యిహంబున నఖండభోగంబు లనుభవించి పరంబున విష్ణులోకంబు నొందగల్గెను. కావున నీవుంగూడ నాపుణ్యనగోత్తమంబునకు బోయి పాపనాశనతీర్థ స్నాన మొనరించి శక్తి ననుసరించి భూదాన మొనరింపుము.

—: కామిని భూదానమహిమంబును వివరించుట :—

భూతభవిష్యద్వర్తమానంబుల భూదానసమం బగు దానముం గాంచము. శ్రోత్రియుండును, ఆహితాగ్నియు నగు భూసురున కేకొంచెమైనను భూదాన మొనరించినవారలు పునరావృత్తిశూన్యం బగు బ్రహ్మలోకంబు నొందగలరు. దశహస్తప్రమాణముగల భూమిని సత్పాత్రదానం బొనరించిన మానవులు సర్వపాపవినిర్ముక్తు లగుదురు. వృత్తిహీనుండును, దరిద్రుండును, వేదవేదియు నగు భూసురున కిచ్చిన భూదాన మమితపుణ్యప్రదం బగును. సకలయాగఫలంబును, సమస్త తీర్థాటనఫలంబును, గంగాదిపుణ్యనదీస్నానఫలంబును, భూదానంబున నొందనగును. నాథా! నీవుగూడ నటు లొనరింపు మను జాయావచనంబు లాలించి ప్రహృష్టాంతరంగుండై మనంబున శేషాచలవాసుని ధ్యానించి సౌమ్యుం డగు నా భద్రమతి కళత్రసమన్వితుండై వేంకటాద్రికి పయనమై పోవుచు మార్గమధ్యంబున సుశాలి యను నగరమునకు బోయెను.

—: భద్రమతి భూదాన మొసగిన కారణంబున సుఘోషుం డను నతడు సద్గతి నొందుట :—

ఆనగరంబున సర్వసంపత్సమన్వితుం డగు సుఘోషుం డను విప్రుని గాంచి పంచహస్తప్రమాణం బగు భూమిని యాచింప నాతండును సంతసంబున భద్రమతి కోరినటుల పంచహస్తప్రమాణం బగు భూమిని సుఘోషుడు-

శ్లో॥ పృథివీ వైష్ణవీ పుణ్యా పృథివీ విష్ణుపాలితా ।
పృథివ్యాస్తు ప్రదానేన ప్రీయతాం మే జనార్దనః ॥

అని యుచ్చరించుచు ధారాదత్తము గావించెను. ఆభూదాన ప్రభావంబునం జేసి యాసుఘోషుండు సమస్తభోగంబుల ననుభవించి తుదకు విష్ణులోకంబు నొంది శాశ్వతసుఖంబుల ననుభవించెను.

—: భద్రమతి భూదానం బొనరించుటకయి వేంకటాచలంబున కేగుట :—

భద్రమతియు సుఘోషుం డొసంగిన భూమిని పరిగ్రహించి పుత్రదారసమన్వితుండై సకలామరనికరసంసేవ్యమానంబగు వేంకటాచలంబునకు బోయి యందలి స్వామిపుష్కరిణీ నిర్మలజలంబుల కళత్రపుత్రసమన్వితుండై నియమపూర్వకంబుగ స్నానం బొనరించి తత్పశ్చిమతటంబున ధరారమణిం గూడియున్న శ్వేతవరాహమూర్తి నవలోకించి భక్తిశ్రద్ధాన్వితుండై యాదేవు నర్చించి, యటనుండి శ్రీనివాసాలయముం జేరి సకలవిబుధవందితుండగు వేంకటేశ్వరుం గాంచి మహాభక్తుండగు భద్రమతి భక్తవరగుండును, కృపానిధియునగు నాదేవదేవునకు భార్యాపుత్రసమేతుండై సాష్టాంగప్రణామంబు లాచరించి యటనుండి పాపవినాశతీర్థముం జేరి యందు విధ్యుక్తంబుగ స్నానసంధ్యాదిక్రియల నిర్వర్తించి యటుపిమ్మట, శ్రోత్రియుండును, వైష్ణవోత్తముండు నగు నొక భూసురవరుం బిలిచి యాతండే శ్రీనివాసుండని బుద్ధిం దలంచి వివిధోపచారంబుల బూజించి సుఘోషుండు తనకు దానమిచ్చిన భూమి నాద్విజసత్తమునకు దాన మొసంగెను.

-: భూదానమహిమంబున భద్రమతికి భగవంతుడు సాక్షాత్కరించుట :-

మహీదానసంప్రహృష్టమానసుండై శంఖచక్రగదాధరుండును వనమాలావిరాజితుండు నగు మాధవుండు విహంగతురంగ మాధిరూఢుండై పాపనాశన తీర్థతటంబున భద్రమతికి ప్రత్యక్షమయ్యెను.



ఆపుండరీకాక్షుం గాంచి భద్రమతియు నంజలి ఘటించి యిటుల నుతించెను—

శ్లో॥ నమో నమస్తేఽఖిలకారణాయ నమోనమస్తేఽఖిలపాలకాయ ।
నమోనమస్తేఽమరనాయకాయ నమోనమో దైత్యవిమర్దనాయ ॥
నమో నమో భక్తజనప్రియాయ నమో నమః పాపవిదారణాయ ।
నమో నమో దుర్జననాశకాయ నమోస్తు తస్మై జగదీశ్వరాయ ॥
నమో నమః కారణవామనాయ నారాయణాయామితవిక్రమాయ ।
శ్రీశార్ఙ్గచక్రాసిగదాధరాయ నమోస్తు తస్మై పురుషోత్తమాయ ॥
నమః పయోరాశినివాసకాయ నమోస్తులక్ష్మీపతయేఽవ్యయాయ ।
నమోస్తు సూర్యాద్యమితప్రభాయ నమో నమః పుణ్యగతాగతాయ ॥
నమో నమోఽర్కేందువిలోచనాయ నమోస్తు తే యజ్ఞఫలప్రదాయ ।
నమోస్తు యజ్ఞాంగవిరాజితాయ నమోస్తు తే సజ్జనవల్లభాయ ॥
నమో నమః కారణకారణాయ నమోస్తు శబ్దాదివివర్జితాయ ।
నమోస్తు తేఽభీష్టసుఖప్రదాయ నమో నమో భక్తమనోరమాయ ॥
నమో నమస్తేఽద్భుతకారణాయ నమోస్తు తే మంథరధారకాయ ।
నమోస్తు తే యజ్ఞవరాహనామ్నే నమో హిరణ్యాక్షవిదారకాయ ॥
నమోస్తు తే వామనరూపభాజే నమోస్తు తే క్షత్రకులాంతకాయ ।
నమోస్తు తే రావణమర్దనాయ నమోస్తు తే నందసుతాగ్రజాయ ॥
నమస్తే కమలాకాంత నమస్తే సుఖదాయినే ।
శ్రితార్తినాశినే తుభ్యం భూయో భూయో నమో నమః ॥

మునిచంద్రులారా! ఈతీరున భద్రమతి నుతింపగా విని శ్రీనివాసుం డెంతయు సంతసించి యోబాలకా! నీ వొనరించిన స్తోత్రంబు

నకు సంతసించితిని. నీకు శుభం బగుగాక. పుత్రపౌత్రాన్వితుండవై సకలైశ్వర్యయుతుండవై యీలోకంబున సుఖంబు లవ్వారిగ ననుభవించి దేహావసానంబున ముక్తి నొందు మని పల్కి యాశ్రీనివాసుండు ధ్యానగమ్యుం డయ్యె నని వచించి సూతుం డామునుల కిటులనియె.

—: రామానుజుండను స్మార్తబ్రాహ్మణుని వృత్తాంతము :—
(ఈతడు విశిష్టాద్వైతమతస్థాపకుడు గాడు)

మునిచంద్రులారా! ఆకాశగంగాతీర్థప్రభావంబును వినిపించెద. సావధానంబుగ వినుండు. సకలశాస్త్రపురాణార్థసంవేదియు, హరిభక్తుండును, జితేంద్రియుండును, వైఖానసమతాభిమానియు, నగు రామానుజుం డను విప్రపుంగవుండు గలండు ఆతండు తపశ్చర్యాసక్తుండై యాకాశగంగానికటతలంబున నియమవంతుడై గ్రీష్మకాలంబున పంచాగ్నిమధ్యంబున విష్ణుధ్యానపరాయణుండై నిలిచి యష్టాక్షరమంత్రరాజంబును జపించుచుండెను. వర్షాకాలంబునందును హృత్కమలంబున మాధవు నిల్పి ధ్యానించుచు నాకాశంబున నిలిచి జపించుచుండెను. హేమంతంబున జలంబున నిలిచి సకలభూతహితుండై దాంతుండై ద్వంద్వవినిర్ముక్తుండై తపం బొనరించుచుండెను. కొంతకాలము జీర్ణపర్ణంబుల భక్షించియు, మరికొంతకాలము జలాహారి యగుచు కొంతకాలము వాయుభక్షణము గావించుచు తీవ్రమగు తపం బొనరించెను

—: రామానుజుని తపస్సునకు సంతుష్టుండై భగవంతుండు ప్రత్యక్షంబగుట :—

పిమ్మట కొంతకాలమున కాపరాత్పరుం డారామానుజుని మహాఘోరతపశ్చర్యకు సంతుష్టినొంది వికచాంబుజపత్రాక్షుండును, మణిమయహారకేయూరాద్యలంకారభాసురుండును, కోటిసూర్యసమానప్రభాభాసురుండు నగు శ్రీమన్నారాయణుండు విష్వక్సేనుం డాదిగ గల్గు కింకరవర్గపరివేష్టితుండై, నారదాదు లొనరించు వీణావేణుమృదం



గాది వాదన గీయమాననిస్తులవైభవుండై. గరుడవాహనారూఢుండై యెదుట నిలిచియుండుటం గాంచి రామానుజుండు మహానందనాగరంబున నీదులాడుచు మహాభక్తిసమన్వితుండై కరములు ముకుళించి యాదేవదేవు నిటుల వినుతించెను.

—: రామానుజుం డొనరించిన శ్రీవేంకటేశస్తుతి :—

శ్లో॥ నమో దేవాదిదేవాయ శంఖచక్రగదాభృతే ।
నమో నిత్యాయ శుద్ధాయ వేంకటేశాయ తే నమః ॥
నమో భక్తార్తిహంత్రే తే హవ్యకవ్యస్వరూపిణే ।
నమః త్రిమూర్తయే తుభ్యం సృష్టిస్థిత్యంతకారిణే ॥
నమః పరేశాయ నమోతిభూమ్నే నమోస్తు లక్ష్మీపతయే, విధాత్రే ।
నమోస్తు సూర్యేందువిలోచనాయ నమో విరించాద్యభివందితాయ ॥
యో నామ జాత్యాదివికల్పహీన స్సమస్తదోషై రపి వర్జితో యః
సమస్తసంసారభయాపహారిణే నారాయణాయామితవిక్రమాయ ।
నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ శార్ఙ్గిణే ।
భూయో భూయో నమస్తుభ్యం వేంకటాద్రినివాసినే ॥

మునివరులారా! జగద్గురుండగు శ్రీనివాసు నిటుల నుతించి యారామానుజుండు మౌనము వహించి యుండెను. శ్రీనివాసుం డాభాసురుని స్తోత్రమునకు సంతసమంది శంఖాదిచిహ్నితంబులగు నాలుగు భుజంబుల నవ్విప్రపుంగవు నాలింగన మొనరించి సంప్రీతమనస్కుండై నీవొనరించిన భయంకరతపంబునకు సంతసించితిని. నీచిత్తంబునం దేమి యుద్దేశించి యిట్టి ఘోరతపం బొనరించితివో వచింపుము. నీవు కోరినవర మొసగెద; సంశయము వలదన రామానుజుం డిటులనియె.

—: రామానుజుండు భగవంతుని ప్రార్థించుట :—

ఓ రమామానినీమనోహరా! జగదాకారా! జగన్నాథా! జనార్దనా! శ్రీనివాసా! నీదర్శనయోగంబునం జేసి, నే గృతకృత్యుండ నైతిని. నాజన్మ సఫలంబైనది. ధర్మరక్షకుండవగు నీకు బ్రణామంబు లాచరించిన మానవులు ధర్మతత్పరులగుదురు. ఏ పరాత్పరుని బ్రహ్మేంద్రాదులును, శంకరుండును, వేదవేదాంతంబులు నెరుంగ నేరకుండునో యట్టి మోహనాకారుండవగు నిను గాంచుటకంటె కావలయు వరం బెయ్యదియో తోచకున్నది. ఏమహానుభావుని మహాయోగులును, నిరంతరయాగదీక్షాపరులును గాంచలేకుండిరో యట్టి నిను గాంచుటకంటె నాకు కావలయున దేమున్నది! నాచిత్తం బన్యాయత్తంబు గాకుండ నీపదపంకజధ్యానాయత్తంబై యుండుగాక యన శ్రీకాంతుం డిటులనియె.

—: భగవద్వర్ణితంబగు నాకాశగంగాతీర్థస్నానకాలనిర్ణయము :—

ఓయీ! రామానుజా! నాయందలి భక్తి దృఢంబుగ నుండుగాత. నీకొకవిశేషము దెల్పెద వినుము. ప్రభాకరుండు మేషరాశియందు సంక్రమించియుండు నవసరంబున చిత్రానక్షత్రయుతంబగు పౌర్ణమాసియం దెవ్వార లాకాశగంగాస్నాన మాచరింతురో వారలు పునరావృత్తిశూన్యంబగు విష్ణుధామంబు నొందగలరు. రామానుజా! నీవియ్యాకాశగంగాతటంబును వీడకుండుము. నీ ప్రారబ్ధదేహావసానంబున తప్పక మత్స్వరూపంబు నొందగలవు. మంగళప్రదంబు లగు నాకాశగంగాజలంబుల స్నానమొనరించువార లందరును భాగఃతోత్తము లగుదురు. అను పలుకు నాలించి రామానుజుం డిటులనియె.

—: భగవంతుడు భాగవతలక్షణములం దెలుపుట :—

దేవా! భాగవతలక్షణంబు లెయ్యవి? వానిని వివరించి తెలుపుమనగా నాశ్రీకాంతుం డిటులనియె. భాగవతలక్షణంబులను, వారల



ప్రభావంబును వినుపింతు వినుము. ఏవారలు సర్వజంతువులందును సమభావము నొంది యసూయాగ్రస్తులు కాక నిస్పృహులై, జ్ఞానులై యుందురో వారలు భాగవతోత్తములని యెరుంగుము. ఏమనుజులు మనోవాక్కాయములగు కర్మలచే పరపీడనం బొనరింపకుందురో వారలు భాగవతోత్తములు.

ఎవ్వారలు సత్కథాశ్రవణ సంసక్తమానసు లగుదురో, ఎవ్వారలు సాత్త్వికంబున బ్రవర్తించుచుందురో యెవ్వరు మత్పదనీరజంబుల నమ్మి గొలుచుచుందురో వారలు భాగవతోత్తములు. ఏమానవోత్తములు మాతృ, పితృ శుశ్రూషానిరతులై యుందురో, యెవ్వరు నిత్యంబును దేవారాధన మొనరించుచుందురో, యెవ్వారలు మాధవార్చనంబును గాంచి సంతసించుచుందురో వారలు భాగవతోత్తములు.

బ్రహ్మచారులను, యతీంద్రులను గాంచి వారలకు పరిచర్య జేయుచుండుటయు, పరుల నిందింపకుండుటయు, సకలకాలములందును ప్రియవచనంబు లాడుచుండుటయు, పరుల గుణగణంబుల గొనియాడుచుండుటయు, సకలభూతములందును దయగలిగి యుండుటయు, శత్రుమిత్రసమభావంబున జరించుచుండుటయు భాగవతలక్షణములు.

ఏపూరుషులు ధర్మశాస్త్రప్రవక్తలై, సత్యవాక్యరతులై యుందురో యట్టి యార్యుల కెవ్వారలు శుశ్రూష గావించుచుందురో వార లందరును భాగవతోత్తములు.

పురాణంబుల జదివెడువారు, ఆపురాణంబుల యర్థంబును గ్రహించువారలు, శ్రద్ధాభక్తిసమన్వితులై పురాణంబుల వినువారలు, గోబ్రాహ్మణసంఘంబులం గాంచి పరిచర్య లొనరించువారలు, తీర్థయాత్రాప్రసక్తమానసులగువారలు, పరుల యభివృద్ధిం గాంచి సంతసించువారలు, నిరంతరంబు నాశ్రీకాంతు నామస్మరణం బొనరించువారలును పరమభాగవతోత్తములు.

మరియు నారామంబుల ప్రతిష్ఠించువారలు, తటాక కూప నిర్మాణకర్తలు, దేవాలయనిర్మాణకులు, గాయత్రీమంత్రజపాసక్తులు, తులసీవనమును గాంచినంతనే నిలువంబడి నమస్కారం బొనరించినవారలు, తులసీకాష్ఠంబున జేయంబడిన పూసలపేరును గళంబున ధరించువారలు, తులసీదళంబుల నాఘ్రాణించువారలు, తులసీమూలమందలి మృత్తును ధరించువారలును భాగవతోత్తములని యెఱుంగుము.

తా నెరింగిన శాస్త్రంబుల నితరులకు దెల్పువారలు, అన్నదానరతులు, జలదానాసక్తమానసులు, ఏకాదశీవ్రతపారాయణులు, గోదాన, కన్యాదానాది వివిధదాననిరతులు, చిత్తంబును వ్యథాయత్తంబు గానీయక సర్వకాలములందును నా పదధ్యానం బొనరించుచు, మన్నామస్మరణం బొనరించువారలును భాగవతోత్తములు.

రామానుజా! వేయిమాటలేల, ఎవ్వారలు సద్గుణగణంబుల నొప్పుచుందురో వారలు భాగవతోత్తములు. నే వచించిన భాగవత లక్షణంబు లన్నియు నీయం దమరియున్నవి. నీవు ధన్యుండవని పల్కి వేంకటాచలేశుం డంతర్ధానంబు నొందెనని శౌనకాది మహామునులకు విశదంబుగ దెల్పిన విని సూతున కామును లిటులనిరి.

—: దానార్హసత్పాత్రనిర్ణయము :—

మహానుభావా! సూతమునీంద్రా! దానము లెట్టివారల కీయవలయునో దానం బొనరించుకాలము లేవియో ప్రతిగ్రహీత యెటు లుండవలెనో మాకు విశదంబుగ దెల్పుమన సూతుం డిటులనియెను. మునివరులారా! పావనం బగు వేంకటాచలంబుననుండు బ్రాహ్మణులందరును గురువులని యెఱుంగనగును ఏదానమైనను బ్రాహ్మణున కీయవలయును. బ్రాహ్మణేతరుండు దానార్హుండుగాడు. నపుంసకుండును, పుత్రహీనుండును, దంభాచారరతుండును, వేదముల ద్వేషించునాతండును, బ్రాహ్మణద్వేషియు, నిజకర్మపరిత్యాగియు నగు వాని కొసంగిన



దానము నిష్ఫలము. పరదారాసక్తుండును పరధనాసక్తుండు నగువాని కిచ్చిన దానము నిష్ఫలము. అసూయావిష్టమానసుండును, కృతఘ్నుండును, మాయావియు, జ్ఞానశూన్యుండును దానార్హులు గారు. నిత్యయాచకుండును, హింసారతుండును, వేదవిక్రేతయు, శాస్త్రవిక్రేతయు, ధర్మవిక్రయియు, పరోపతాపశీలుండును దానమునకు తగరు. ఎవ్వారలు పాపాచారాసక్తులో, ఎవ్వారలు సదా నిందితచరిత్రులై యుందురో యట్టివారలును దానంబునకు తగరు.

సత్కర్మనిరతుండును, శ్రోత్రియుండును, ఆహితాగ్నియు, దృష్టిహీనుండు, దరిద్రుండు, కుటుంబవంతుండు, దేవపూజాసక్తుండును దానార్హులు. దరిద్రునకొసగిన దానం బెంతయు బ్రశంసనీయంబగునది. విప్రపుంగవులు దానార్హులైనను, వారియందు గోడ్రాలిమగండు దానార్హుండు గాడు. అట్టివానికి దాన మొసంగినవాడు గార్దభమై జన్మించును. నాస్తికవాద మొనరించువాడు, చౌర్యద్యూతరతుండును, నమస్కారార్హులు గారు. పాషండమతావలంబియు, పతితుండును, వేదవిక్రేతయు, పాపకార్యనిరతుండును, కృతఘ్నుండును నమస్కారార్హులు గారు. స్నాన మొనరించుచుండువానికిని, సమిత్పుష్పంబులు హస్తంబుల గలవానికిని, చేతియందు జలపాత్రంబును బట్టినవానికిని నమస్కరింపరాదు. వివాదశాలికిని, వమనము చేయుచున్నవానికిని, భోజన మొనరించుచున్నవానికిని, జనసమ్మర్దంబున నున్నవానికిని, చేతులందు భిక్షాన్నముగలవానికిని, పరుండినవానికిని, నమస్కార మొనరింపరాదు. గోడ్రాలికిని, బహిష్ఠ యగు నాతికిని, జారిణికిని, ప్రసవించినయామెకును, గర్భపాతము గావించినదానికిని, వ్రతనియమమును విడిచినదానికిని నమస్కార మొనరింపగూడదు. సభయందును, యజ్ఞశాలయందును ప్రత్యేకంబుగ నొకనికి నమస్కార మొనరించిన వారలపురాకృతపుణ్యముగూడ నాశమగును. శ్రాద్ధవ్రతనియుక్తుండును, దేవపూజ గావించుచున్నవాడును, యాగ మొనరించుచున్నవాడును,

తర్పణం బొనరించుచున్న యాతండును, నమస్కారార్హులైనను అట్టి సమయంబులందు వారలకు ప్రణామ మాచరింపరాదు. వందన మొనరించు విప్రునకు ప్రతివందన మొనరింపకుండువారలకు నమస్కరింపరాదు. మతిమంతుండగు విప్రుం డేకాలంబునను వంధ్యాభర్తకు నమస్కారంబు గావింపరాదు.

—: ఆకాశగంగామాహాత్మ్యము :—

మునిశేఖరులారా! ఈవిషయంబున మున్ను నారదుండు సనత్కుమారున కెరుకపరచిన యొక యితిహాసంబు కలదు. దాని వినుండు గోదావరీతీరంబున సర్వకర్మపరాయణుండును, సత్యవాదియు, జితేంద్రియుండును, సర్వభూతదయాపరుండును, దేవాగ్నిద్విజపూజారతుండును, మాతాపితృపరిచర్యాసక్తుండును, బ్రహ్మణ్యుండును, దాక్షిణ్యాగుణసమన్వితుండును, సాధుసమ్మతుండు నగుపుణ్యశీలుం డను భూసురశ్రేష్ఠుండు గలడు.

—: వంధ్యాపతి నిమంత్రణంబున పుణ్యశీలునకు రాసభ ముఖంబు సంప్రాప్తంబగుట :—

సుగుణమణిఖని యగు నాద్విజచంద్రుని గృహంబున కొకదినంబున వేదవేదాంగపారగు డగు భూసురోత్తముం డొకరుండు జను దేర నాతనిం గాంచి ప్రహృష్టాంతరంగుండై శ్రోత్రియుండును, శాంతుండు నగు నమ్మహీసురునకు ప్రణామము లాచరించి మహాత్మా యీదినంబున మాతండ్రిగారి ప్రత్యాబ్దికంబు గాన ఆశ్రాద్ధభోక్తవుగా నుండ గోరుచుంటి నన నాతం డందుల కంగీకరింప నాపుణ్యశీలుండు విధ్యుక్తంబుగ పితృశ్రాద్ధంబును సాంగంబుగ నొనరించెను. పిమ్మట కొంత కాలంబున కాపుణ్యశీలుని ముఖము గార్దభాననాకారంబుగ గనుపింప జొచ్చెను. అందువలన పుణ్యశీలుండు మిగుల దుఃఖము నొంది మునిసంఘసుసేవితంబగు సువర్ణముఖరీతీరమందలి సర్వకామఫలప్రదంబగు మున్యాశ్రమంబునకు బోయి యందలి మునివరుల సేవించుచు నందగస్త్య



మునిం గనుంగొని సాష్టాంగ దండప్రణామంబు లాచరించి యిటులనెను. తపోధనసత్తమా! శాపాయుధనికరసంసేవితపాదపద్మా! నమస్కారము. వికృతాననుండనై మహాపాపినై యుంటిని. నను రక్షింపుము. మునివర్యా! నా కేదోషంబున నిట్టి వికృతాననంబు గల్గెనో యెఱుంగనైతి. మీ రెఱుంగని విషయంబు లీరేడుజగంబుల నెందును గానరాదు. ఈ దుఃఖమును భరింపజాల ననుటయు నాకుంభసంభవుం డిటు లనెను. ఓయీ పుణ్యశీలా! నీవికృతాననంబునకు గారణము వచించెదను వినుము. నీవు పితృశ్రాద్ధంబున వేదవేదాంగవేదియు, శ్రోత్రియుండును, పుత్రహీనుండు నగు నొకవిప్రుని నిమంత్రణంబు గావించి శ్రాద్ధ మొనరించితివి. ఆమహాదోషంబునం జేసి నీకిటుల ముఖవికారము సంప్రాప్తం బైనది. హవ్యకవ్యాదులందు వంధ్యాపతిని నిమంత్రణంబు సేయరాదు. శ్రేయస్కాములగువారలు వంధ్యాభర్తనుగాని, వృషలీపతింగాని నిమంత్రణంబు సేయుట రాసభరూపంబు నొంద కారణం బగును. సత్కులజాతుండైనను, సత్కర్మనిరతుండైనను, మరి యెట్టి సుగుణంబులు కలవాడైనను వంధ్యాపతి యగుచో వాని దూరంబుగ విడువవలయును యోగ్యుండగు విప్రుండు లభింపనిచో యజ్ఞోపవీతమాత్రజీవియు, పుత్రవంతుండు నగువానిని శ్రాద్ధంబున నిమంత్రణంబు గావింపవలయును. అట్టివాడును లభింపనిచో కుమారునైనను, సోదరునైనను నిమంత్రణంబు గావింపవచ్చునుగాని వంధ్యాపతిని విడువవలయును. ఇద్ది సత్యంబని బాహువునెత్తి ముమ్మాటికి నక్కాణించుచుంటిని. ఏశ్రాద్ధకర్త వంధ్యాభర్తను శ్రాద్ధంబున నిమంత్రణంబు గావించునో యాశ్రాద్ధం బాసురశ్రాద్ధ మని యెఱుంగనగును. అట్టి శ్రాద్ధకర్త ఘోరనరకంబుల ననుభవింపగలడు.

—: ఆకాశగంగాస్నానంబున పుణ్యశీలుని ముఖంబు తొల్లిటిరూపంబు నొందుట :—

ఈదోషనివృత్తికై నేనొకయుపాయంబును వచించెద వినుము. స్వర్ణ

ముఖీతటంబున సురనరనికరసంసేవితంబును, మేరుసముద్భవంబును, సర్వకామప్రదంబును, దోషౌఘవినాశకంబు నగు వేంకటాద్రి యున్నది. అయ్యచలరాజంబున సర్వపాపప్రశమనంబును, ఆయురారోగ్యవర్ధకంబు నగు నాకాశగంగ యను మహత్తరంబగు తీర్థంబు గలదు. నీవానగవరంబున కేగి ముందుగ స్వామి పుష్కరిణీతోయంబుల నవగాహన మొనరిచి యటుపిమ్మట గంగాతీర్థంబునకు వెడలి తీర్థవిధానంబున సంకల్పము గావించి స్నాన మొనరింపుము. ఆస్నానప్రభావంబున నీముఖవికార మాక్షణముననే నాశ మొందగలదు. త్వరితగతి నటకేగు మను కుంభసంభవు పలుకు లాలకించి యపరిమితానందంబునొంది యమ్మునికి వందనం బాచరించి యనుజ్ఞాతుండై శేషాచలంబునకేగి స్వామి పుష్కరిణీజలంబుల స్నానంబు గావించి యటుపిమ్మట నాకాశగంగాసలిలంబుల నియమపూర్వకంబుగ నయ్యగస్త్యుం డానతిచ్చిన తెరంగున స్నాన మొనరించునంతలో పుణ్యశీలునిముఖంబు సంపూర్ణచంద్రభాసుర మయ్యెను. మునివర్యులారా! నారదుండు సనత్కుమారునకు తెల్పిన యీపుణ్యచరితంబును మీకు నే వినిపించితి నని సూతుండు మరల నిటులనెను.

—: చక్రతీర్థమహిమానువర్ణనము :—

మునిచంద్రులారా! చక్రతీర్థమహిమంబును వినుండు- గోదాన, అన్నదాన, జలదానాదులందు విముఖులగువార లందరును చక్రతీర్థస్నానంబున విగతకల్మషు లగుదురు.

—: పద్మనాభుం డను విప్రవర్యుం డొనరించిన
తపఃప్రభావవర్ణనము :—

మున్ను శ్రీవత్సగోత్రసముద్భూతుండును, జితేంద్రియుండు నగు పద్మనాభుం డను భూసురోత్తముండు చక్రపుష్కరిణీతీర్థంబున దయాయత్తచిత్తుండై ద్వంద్వవిరహితుండై కొంతకాలము జీర్ణపర్ణాశనుండై మరికొంతకాలము జలపానం బొనరించుచు, కొన్నిహాయనంబులు



వాయుభక్షకుం డగుచును పండ్రెండువత్సరంబులు మహాఘోరతపం బొనరించెను. ఆతపంబున కింద్రాదిబృందారకు లందరును వెరగొందిరి. కమలాకాంతుం డావిప్రుని తపశ్చర్యకు సంతసమంది వికసితసరోజదళసమాననయనుండును, మణికుండలప్రభాభాసమానగండభాగుండును, కౌస్తుభభాసురవక్షస్థలుండును, శంఖచక్రగదాధరుండు నగు దేవదేవుం డాపద్మనాభునకు సాక్షాత్కరించెను. అంతలోన నామహీసురోత్తముండును నయనంబుల దెరచి దయాసముద్రుండును, శాంతుండు నగు శ్రీనివాసుం గాంచి కరంబుల జోడించి యిటుల నుతించెను —

—: పద్మనాభాఖ్యద్విజకృత శ్రీనివాసస్తుతి :—

శ్లో॥ నమో దేవాదిదేవాయ వేంకటేశాయ శార్ఙ్గిణే ।
నారాయణాద్రివాసాయ శ్రీనివాసాయ తే నమః ॥
నమః కల్మషనాశాయ వాసుదేవాయ విష్ణవే ।
శేషాచలనివాసాయ శ్రీనివాసాయ తే నమః ॥
నమ స్త్రైలోక్యనాథాయ విశ్వరూపాయ సాక్షిణే ।
శివబ్రహ్మాదివంద్యాయ శ్రీనివాసాయ తే నమః ॥
నమః కమలనేత్రాయ క్షీరాబ్ధిశయనాయ తే ।
దుష్టరాక్షససంహర్త్రే శ్రీనివాసాయ తే నమః ॥
భక్తప్రియాయ దేవాయ దేవానాం పతయే నమః ।
ప్రణతార్తివినాశాయ శ్రీనివాసాయ తే నమః ॥
యోగినాం పతయే నిత్యం వేదవేద్యాయ విష్ణవే ।
భక్తానాం పాపసంహర్త్రే శ్రీనివాసాయ తే నమః ॥

ఇటుల నుతించు ద్విజపుంగవుం గాంచి యాదేవదేవుండు సుధామధురభాషణంబుల నిట్లనెను.- భూసురోత్తమా! మత్పదకమలార్చనారతుండవగు నీవీచక్రతీర్థంబున నన్నారాధించుచు కల్పాంతంబువరకు

నిట నుండుమని బల్కి యంతర్ధాన మొందెను. పద్మనాభుం డాపద్మనాభాజ్ఞానుసారంబుగ చక్రతీర్థంబున నివసించి యుండెను. ఇటులుండ గొంతకాలంబునకు భయంకరాకారుం డగు నొక రక్కసుండు శ్రీమన్నారాయణపదపంకజారాధనపరాయణుం డగు పద్మనాభు నవలోకించి క్షుత్తృష్ణాపీడితుం డగుటం జేసి యవ్విప్రుని భక్షింపదలచి బలాత్కారంబున నాతనిం బట్టిన నాపద్మనాభుం డారక్కసు నేమియుం జేయ లేక దయాసముద్రుండును, ఆపన్నరక్షకుండు నగు చక్రధరుని శరణంబు వేడెను. భక్తవరదుండగు భగవంతుం డాపద్మనాభుని మొరాలించి భక్తరక్షణం బొనరింపదలంచి రాక్షసవధార్థమై నాశితరిపుచక్రం బగు చక్రంబును విడిచెను. ఆచక్రరాజంబును మహావేగంబున చక్రపుష్కరిణీతటంబును జేరిన నయ్యనంతాదిత్యసంకాశంబును, నిరుపమాన జాజ్వల్యమానహుతాశనజ్వాలాకరాళంబును, మహాసురవిమర్దనంబును, భయంకరనాదసమన్వితంబు నగు సుదర్శనచక్రముంగాంచి రాక్షసుండు పలాయన మొనరింప మొదలిడెను.

—: భగవత్ప్రేరితంబగు చక్రంబు రాక్షసుని వధించుట :—

అంత జ్వాలామాలాదురాసదం బగు నాచక్రంబును విడువక వాని వెన్వెంట బరువిడి యారక్కసుని యుత్తమాంగంబును దునిమిన నాతండు నేలకు వ్రాలెను. విప్రవరుం డాధరణీపతితుం డగు రాక్షసునిం గాంచి యానందభరితాంతరంగుండై చక్రరాజంబును నుతింపదొడంగెను. విశ్వరక్షణదక్షా, నారాయణకరాంభోజభూషణా ! సమరదుర్మదదానవదోర్దర్పహరణకుశలా ! భక్తార్తినాశనా ! భయాక్రాంతుండ నగు నను రక్షింపుము. చక్రరాజమా, లోకహితంబొనరించు నీవీ చక్రతీర్థంబున సర్వకాలములందును నివసించి భక్తులకలుషంబుల బాపుచుండుము. నీకివియే వేవేలు నమస్కృతు లనియెడు మహీసురోత్తముని పలుకుల నాలించి, యాచక్రరాజము సుధామయోక్తుల పద్మనాభున కిటు లనెను.



—: ద్విజప్రార్థనంబునంజేసి చక్రవర్యము వరంబులనొసంగుట :—

ఓయీ ! పద్మనాభా ! పుణ్యప్రదంబగు నీచక్రతీర్థంబున లోకహితంబునకై తప్పక నివసించియుందును. దురాత్ముండగు రాక్షసుండు నీకొనరించిన బాధలదలంచి మాధవుండంప నతిరయంబున నేనిటకువచ్చితిని. నీకు బాధగలుగ జేసిన మాంసాశనాధముండు నాచే నిహతుం డయ్యె. హరిభక్తుండవగు నీవీభయంబువలన విముక్తుండవైతివి. సకలకలుషాపహంబగు నీచక్రతీర్థంబున సర్వకాలములందును, లోకరక్షాచణశీలినై నివసించియుండెద. నేనిందు వసించుటంజేసి నేడాదిగ నీకుగాని మరెవ్వరికిగాని భూత, రాక్షసగణంబులవలన పీడ గలుగకుండును. నేనిందువసించియుండుటంజేసి మన్నామాంకితంబై యీతీర్థము చక్రతీర్థంబనం బరగు. ముక్తిప్రదంబగు నీచక్రతీర్థంబునం దెవ్వారలు స్నానమొనరింతురో వారలందరును, వారల పుత్రపౌత్రాదులును, వారల వంశమునం దుద్భవించినవారలందరును ధూతకల్మషులై వైకుంఠంబు నొందగలరని మృదుమధురంబుగ బల్కి పద్మనాభుండాదిగగల్గు భూసురశిఖామణులందరుగాంచుచుండ సకలకలుషహారిణి యగు చక్రపుష్కరిణి యందు బ్రవేశించెను. మునివరులారా ! యీ చక్రతీర్థమహిమంబు నెవ్వారలు పఠింతురో యెవ్వారలు వినియెదరో వారలందరును చక్రతీర్థస్నానఫలంబు నొందగలరన విని యమ్మునిశేఖరు లాసూతున కిటులనిరి.

—: సుందరుండను గంధర్వుండు రాక్షసత్వము నొంది మరల నిజరూపము నొందిన వృత్తాంతము :—

మహాత్మా ! విష్ణుభక్తాగ్రేసరుం డగు భూసురోత్తముని యిడుమలం బెట్టిన రక్కసుం డెవ్వండు ? వాని చరితంబును వినిపింపుమన సూతుం డిటులనియె.

తొల్లి వైకుంఠనగరసదృశంబగు శ్రీరంగనగంబున వసిష్ఠాత్రిప్రముఖులగు మహామును లందరును ముక్తికాంతాకరగ్రహణంబును కోరి నివసించి యుండిరి. అందు నత్తాపసోత్తము లందరును భక్తాభయ

వరదుండగు శ్రీరంగనాథుని పదవనజంబుల ధ్యానించుచు కాలము గడుపుచుండిరి. ఇటులుండ నొకసమయంబున వీరబాహుని కుమారుండును, మహాబలసమన్వితుండు నగు సుందరుండను గంధర్వవరుండు విటగోష్ఠీపరాయణుండై తరుణీలలామంబులం గలసి జలక్రీడారతుండై వస్త్రవిహీనుండై వసనవిహీనలగు రమణీమణులం గూడి జలక్రీడ నొనరించుచుండెను. అంతలోన మాధ్యాహ్నికక్రియాకలాపంబును నిర్వర్తింపదలంచి వసిష్ఠమునీంద్రుండు తోడిమునిపుంగవులం గలసి శ్రీరంగమందిరంబునుండి బయలుదేరి కవేరజాతీర్థంబునకుం బోయెను. వచ్చుచుండెడు మునిచంద్రులం గాంచి భయకాతరలై యాపన్నెలాడు లందరును సంభ్రమమంది పుట్టంబులం గట్టుకొనిరి. మహాసాహసి యగు సుందరుండు మాత్రము పుట్టంబును గట్టకుండెను. ఆ తెరంగుం గాంచి కుపితుండై వసిష్ఠుండు పండ్లు పెటపెట గీటుచు కన్నుల నిప్పులు గురియ నాగంధర్వుని గొరకొరం గాంచుచు నిటులనెను.

ఓరీ సుందరా ! మమ్మందరం గనుంగొనియు నీవించుకయు సిగ్గునొందక వసనంబును గట్టకుంటివి. నీవు శీఘ్రంబుగ రాక్షసభావము నొందుము. నీచా! నీకీగర్వంబు కూడునే. దానిఫలం బనుభవింపుమని శాపవచనంబులం బలుక నయ్యువతీమణు లందరును భయమంది కరంబుల ముకుళించి భక్తిపురస్సరమ్ముగ వందనంబు లాచరించి మునిమండలమండనాయమానుం డగు వసిష్ఠున కిటులనిరి. సర్వధర్మవిశారదా, చతురాననందనా! దీనురాండ్ర మగు మమ్మవలోకించి కోపంబును వీడి మాయెడల బ్రసన్నుండ వగుము. మహాత్మా! యువతుల కలంకారము పతియేగదా. పతిహీన యగు సుదతి శతసుతాన్వితయయ్యు లోకంబున విధవ యనం బరగుచుండును. అనాథ యగు నాతి జన్మ నిరర్థకం బగును. మాయెడల కనికరముం జూపి యబలల మగు మా దీనాలాపంబుల నాలకించి మానాథు ననుగ్రహింపుము. శాంతమనస్కులగు తపోధను లొకయపరాధంబును క్షమింపవలయుగాన భవచ్ఛిష్య



సముండగు సుందరుని యపరాధంబును మన్నించి పతిభిక్ష నొసగు మని యెడు సుందరసుందరీమణుల దైన్యంపుబలుకుల నాలకించి ప్రసన్నుండై వసిష్ఠుం డయ్యంగనలం గనుంగొని యిటులనియె.

-:వసిష్ఠుండు సుందరునకు రాక్షసభావనివృత్త్యుపాయంబును దెల్పుట :-

లలనామణులారా ! నేనాడిన మాటలు వ్యర్థంబులు గానేరవు. మీకొక యుపాయంబును వచించెద వినుండు- మీనాథుం డగు సుందరునకు నేనొసంగిన శాపము పదునారువత్సరము లనుభవింపదగినదై యున్నది. ఈపదునారువత్సరంబులు గతించుదనుక సుందరుం డందందు స్వేచ్ఛగ సంచరించుచు తుదకు సకలకలుషహరంబును, మంగళప్రదంబు నగు వేంకటాచలమునందలి చక్రతీర్థంబునకు బోవంగలండు. ఆతీర్థరాజతీరంబున పద్మనాభుం డను యోగిపుంగవుండు కలండు. సుందరుం డామునివరు నవలోకించి యాతని దినుట కుద్యమించును. అంతలో భూసురరక్షణంబునకయి చక్రధరప్రేరితంబగు చక్ర మాసుందరుని శిరంబును కాయంబునుండి వేరుపరుపంగలదు. పిమ్మట నిజరూపంబునొంది శాపవిముక్తుండై త్రిదివంబునొంది మనోహరాకారుండై మిమ్ముంగలసి క్రీడింపగలం డని వసిష్ఠుం డామందయానలకుం బల్కి- త్వరితగమనంబున శ్రీరంగనాథసన్నిధానమందలి నిజాశ్రమతలంబునకుం జనెను.

పిమ్మట నాసుందరు లాత్మభర్త యగు సుందరు నాలింగనముం గావించుకొని విచారసాగరనిమగ్నలై రోదన మొనరించుచుండు నంతలోన సుందరుని సుందరవదనేందుమండలంబు దంష్ట్రాకరాళంబయ్యె. నవమోహనాకారంబు భయంకరాకారంబయ్యె. గండుతుమ్మెద బారుల నీసడించు శిరోరుహంబులును, భాసమానంబులగు మీసంబులును రక్తవర్ణంబులై గాంచువారలకు భయ మొదవించుచుండెను. ఇట్టి భయంకరంబగు రాక్షసరూపముం గాంచి భయగ్రస్తమానసలై యామృగశాబవిలోలవిలోచనలు త్రివిష్టపంబునకు బోయిరి.

పిదప రాక్షసత్వమునొంది భీకరాకారుండగు సుందరుండు నయనగోచరంబగు జంతుజాలంబును బట్టి భక్షించుచు పల్లెలు, పట్టణంబులు, నగంబులు, వనంబు లనక యెల్లెడల దిరుగుచు ప్రచండమారుతవేగంబున వేంకటాచలంబునకుం జేరి క్రమక్రమంబుగ నాపాపాత్ముండు చక్రతీర్థంబున బ్రవేశించెను. అప్పటి కమ్మహర్షిచే నిర్దేశింపంబడిన పదునారుహాయనంబులు గతించినవి. మునివరులారా! షోడశాబ్దావసానంబున నారాక్షసుండు చక్రతీర్థనివాసి యగు పద్మనాభుని భక్షింపదలంచి శరవేగంబున నాతనిపయింబడి మ్రింగ నుంకించి పట్టినంతలోన నాభూసురుండు దీనావనతత్పరుండగు దైత్యాంతకుని శరణంబువేడి పలుతెరంగుల ప్రార్థింప నమ్మధుసూదనుండు సదయుండై భక్తరక్షణార్థంబుగ నిజకరకలితంబగు సుదర్శనచక్రంబును విడువ నయ్యాదియు మహాధ్వానంబున బ్రహ్మాండకటాహంబును బ్రద్దలుగావించుచు బ్రచండవేగంబున జనుదెంచి పిశితాశిశిరంబును ద్రుంచి పద్మనాభుని రక్షించెను.

—: సుందరుండు రాక్షసరూపంబును విడిచి నిజరూపంబు నొందుట :—

పిదప సుందరుం డారాక్షసరూపము న్విడిచి దివ్యవపుర్ధరుండై విమానవరంబు నధిరోహించి యంబరతలంబునుండి సుమవిసరంబును వర్షించుచు ప్రాంజలియై చక్రరాజంబునకు నమస్కృతు లొనరించుచు శ్రుతిమనోహరవచనంబుల నీతీరున నుతించెను. కమలాక్షకరకమలభూషణా, దుష్టదానవభంజనైకదక్షా, నైకప్రభాకరసంకాశతేజోవిరాజితా, సుదర్శనచక్రరాజమా! నీకివియే ప్రణామశతంబులు. నీయనుగ్రహవిశేషంబున రాక్షసరూపంబును వీడి నిజరూపంబు నొందగల్గితిని. విరహానలదందహ్యమానమానసలై నారమణీమణు లందరును భరింపనలవికాని విచారంబున మ్రగ్గుచున్నవారు. నేను త్రిదివంబునకేగి వారల దుఃఖోపశమన మొనరింపబోవుటకయి నాకనుజ్ఞనొసంగు మను సుందరుని పలుకు లాలించి యాచక్రరాజం బనుజ్ఞ నొసంగి పోయి



రమ్మనునంత నాతం డట నుండెడు పద్మనాభునకు ప్రణామంబు లొనరించి యాతనియాజ్ఞం గైకొని నిజాలయంబున కేగెను.

అటుపిమ్మట పద్మనాభుం డాచక్రవర్యముం గాంచి మహాత్మా! నీ వెల్లపుడు నీచక్రతీర్థంబున నివసించియుండి యిందుల స్నాన మొనరించువారల కలుషంబుల బాపుచుండు మని ప్రార్థింప నచ్చట గలవారందరు గాంచుచుండ నాచక్రరాజ మాతీర్థజలంబుల బ్రవేశించెను. ఆకారణంబున నాతీర్థంబు చక్రతీర్థంబని ఖ్యాతి వహించినది. మునిముఖ్యులారా! చక్రతీర్థప్రభావంబును విశదంబుగ వినుపించితినని మరల సూతుం డిటు వచించెను.

—: జాబాలితీర్థమాహాత్మ్యము :—

తపోధనాగ్రేసరులారా! యేతీర్థస్నానమాత్రంబున దురాచారుం డగు నాతండు ముక్తుం డయ్యెనో యట్టి జాబాలితీర్థమహిమంబును వినుండన మును లిటులనిరి. పౌరాణికోత్తమా! దురాచారుం డన నెవ్వండు, వాడొనరించిన పాతక మెట్టిది? ఆతం డేతెరంగున దోషముంబాసి ముక్తుం డయ్యెను? సవిస్తరంబుగ వినుపింపుమన, సూతుం డిటుల జెప్పదొడంగెను.

మునిశేఖరులారా! దురాచారుం డొనరించిన దురాచారం బెద్దియో, యాతం డెటుల పాపవినిర్ముక్తుండై ముక్తి నొందెనో వివరించెద వినుండు- దురాచారుం డను భూసురుం డొకరుండు క్రూరకర్మరతుండై కావేరీనదీతీరంబు నాశ్రయించి యుండువాడు. ఆతండు బ్రహ్మఘ్నులతోడను, సురాపానాసక్తచిత్తులతోడను, సువర్ణస్తేయనిరతులగువారలతోడను, గురుదారసంగదూషితులగువారలతోడను మైత్రి నెరపి సంసర్గదూషితుండై యుండువాడు. మహాపాతకసంసర్గదోషంబునం జేసి యాబ్రాహ్మణుని బ్రాహ్మణ్యం బంతయు నష్టమయ్యెను. ఏవిప్రుం డొక్కదినంబున బాపాత్ములం గలసి సంచరించుచుండునో యాతని బ్రాహ్మణ్యంబునం దొకయంశము నాశమొందును. పాపా

తుమ్మల సేవించుచు, వారలం దాకుచు, వారలతో శయనించుచు, వారల తోడం గలసి భుజించుచు రెండుదినంబుల గడపినవారల బ్రాహ్మణ్యంబున రెండుభాగములు గతించును. అటులనే మూడుదినంబులు గడిపెనేని మూడుభాగంబులును, నాలుగుదినంబు లుండెనేని బ్రాహ్మణ్యం బంతయు నాశ మొందగలదు. అంతకు మించి యెక్కువ దినంబులు పాపులతో శయనాసనభోజనంబు లొనరించుచుండెనేని వాడును వారలతో సమానుం డగును. దురాచారుం డట్టిపాపులం గలసి దురాచారంబు లొనరించుచు మహాపాతకి యగుటంజేసి ఘోరాకారుండగు భేతాళుం డాభూసురాధము నావేశించి పీడింప మొదలిడెను.

భేతాళావేశంబున నొడ లెరుంగక యాదురాచారుండు నొక దేశంబునుండి మరియొక దేశంబునకును, ఒకవనంబునుండి యింకొక విపినంబునకును, ఒకనగంబునుండి యింకొక గిరివరంబునకును దిరుగుచు వాని పూర్వజన్మసుకృతయోగంబున సకలకలుషవినాశకంబగు వేంకటాచలంబునకుం బోయెను.

—: జాబాలితీర్థస్నానంబున దురాచారభేతాళులకు
పాతకనివృత్తి యగుట :—

పిశాచానుద్రుతుం డగు దురాచారుండు నయ్యచలోత్తమునుం జేరి యందలి పావనం బగు జాబాలితీర్థంబునం దవగాహన మొనరింప నాక్షణంబుననే భేతాళవిముక్తుండై స్వస్థత నొంది యిటు లాలోచించెను. కావేరీతీరనివాసి నగు నేనిటు లెందుల కేతెంచితిని ? సువర్ణముఖరీతటంబునందలి యానగరాజం బెయ్యది ? యని యాలోచించుచు నాతటినీతటంబున నుండెడు జాబాలి యను మునీంద్రుకడకుం బోయి వందనం బాచరించి మహానుభావా ! యీనగరాజం బేనామంబున బ్రసిద్ధి గాంచినయది ? నేను కావేరీతీరవాసి నగు దురాచారుం డను భూసురుండను. నే నీయచలంబున కెటుల రాగలిగితినో యించుకేనియు నెరుంగకుంటిని. నాయందు దయయుంచి నాచరితంబును విను



పింపు మన, నమ్మునివరుం డించుక ధ్యానించి యాదురాచారున కిటు లనెను.

—: జాబాలి పార్వణశ్రాద్ధం బొనరింపకుండుటవలన
సంభవించు దోషంబుల దెల్పుట :—

ఓయీ ! మహాపాపులతోడి సంపర్కంబువలన నీబ్రాహ్మణ్యం బంతయు భగ్నం బగుటంజేసి భేతాళుండు నిన్నావహించెను. అది మొదలుగ నీవు వివశుండవై మూఢచిత్తుండవై యచ్చటచ్చట దిరుగుచు నిటకు జేరితివి. భేతాళుం డీపావనతీర్థజలంబుల నిను ముంచెను. ఇందు గావింపబడిన స్నానప్రభావంబున మహాఘోరపాతకంబునుండి విముక్తుండవైతివి. ఏనరు లీజాబాలితీర్థంబున స్నాన మొనరింతురో వారలు గావించిన పంచమహాపాతకంబులును నాశ మొందును. సత్కర్మసాధనంబులగు నీతీర్థజలంబుల గావించిన స్నానమాత్రంబున నీదగు మహాపాతకసంసర్గమోక్షం బంతయు విలయంబు నొందినయది. నిన్నావేశించిన భేతాళుండును మున్నొక మహీసురుం డయ్యు పితృమరణదినంబున బార్వణవిధానంబున శ్రాద్ధం బొనరింపమింజేసి యాతని పితరుల వలన శపింపబడి భేతాళరూపము నొందియుండెను. ఆతండును జాబాలితీర్థస్నాన మహిమంబున భేతాళరూపమును విడిచి విష్ణులోకము నొందెను. తల్లిదండ్రులుమరణంబునొందిన దినంబునం దేదురాత్ముండు విధ్యుక్తంబుగ శ్రాద్ధం బొనరింపకుండునో యాతండు భేతాళరూపంబు నొంది పిదప మహాదారుణనరకంబులం బడి యపరిమితబాధల నొందగలడని యాదురాచారచరితంబును సవిస్తరంబుగ జాబాలి తెలియబరచెను.

మునివరులారా ! మహాపాపి యగు దురాచారుండు జాబాలితీర్థస్నానంబున పునరావృత్తిశూన్యం బగు విష్ణులోకంబు నొందెను. ప్రాయశ్చిత్తశూన్యంబులగు మహాపాపంబు లన్నియు నాజాబాలి తీర్థస్నానంబున నాశ మొందగలవు. శూద్రునిచే పూజింపబడు శివలింగ

మునకును, మాధవవిగ్రహంబునకు పూజానమస్కారాదికంబుల నొనరించిన భూసురునకు మహర్షు లేస్మృతులందును ప్రాయశ్చిత్తంబును వివరించి యుండ లేదు. అట్టి పాతకమైనను, జాబాలి తీర్థస్నానమాత్రంబున విలయ మొందగలదు. విప్రనిందకునకును, విశ్వాసఘాతకునకును, కృతఘ్ననకును, సోదరభార్యాసక్తునకును, ధర్మశాస్త్రంబుల ప్రాయశ్చిత్తము విధింపబడి యుండ లేదు. అట్టి యఘములుసైత మాజాబాలితీర్థస్నానంబున నాశ మొందగలవు. మునిశేఖరులారా! సమస్తదోషనివారకం బగు జాబాలితీర్థమహిమంబును వినుపించితి నని సూతుండు వెండియు నిటుల నెను.

—: తుంబురు (ఘోణ) తీర్థమాహాత్మ్యము :—

పురాణకథాశ్రవణకుతూహలాక్రాంతచిత్తులగు మునిసత్తములారా! సమస్తపాపాపనోదకం బగు ఘోణాతీర్థమహిమంబును వినుపించెద వినుండు-- ఉత్తరాఫల్గునీనక్షత్రసమన్వితం బగు శుక్లపక్షమందలి పర్వదినంబున నందు స్నానం బొనరించినవారల జన్మాంతర తపఃప్రభావంబును వర్ణింప నశక్యంబు. దినకరుండు మీనరాశియందు బ్రవేశింప నపరాహ్ణసమయంబున గంగాది సమస్తతీర్థంబులును తుంబురు తీర్థంబున బ్రవేశించియుండు నన విని, యమ్మహర్షు లిటులనిరి-- పౌరాణికోత్తమా, సూతమునివరా! గంగాది పవిత్రతీర్థంబు లన్నియు మీనరాశియందు దివాకరుండు సంక్రమించిన సమయంబున తుంబురు తీర్థంబున నేకారణంబున బ్రవేశించునో సవిస్తరంబుగ దెల్పుమన, సూతుం డిటుల వచించెను.

పాపాత్ములగు మానవు లందరును మాయందు స్నానంబు గావించి వారల కలుషంబుల మాయందు డించి పావనులై పోవుచుండిరి. మాయందు విడువబడిన పాపంబుల నెటుల బాయగల మని గంగాది సమస్తతీర్థంబులును బాగుగ నాలోచించి సురమునిచంద్రుం డగు నారదుని యుపదేశంబున సర్వపాపనిషూదనంబును, మనోహరంబు



నగు వేంకటాచలంబునకుం బోయి యందలి స్వామిపుష్కరిణీజలంబుల ముందుగ స్నాన మొనరించి యటుపిమ్మట భాస్కరుండు మీనరాశిగతుం డగుచుండ నుత్తరాఫల్గునీనక్షత్రయుతంబగు శుక్లపక్షమందలి పర్వదినంబున ఘోణాతీర్థంబున స్నాన మొనరించుచుండును. అట్టి పుణ్యతీర్థమహిమంబును వర్ణింప ముల్లోకంబుల నొక్కరుండైన సమర్థుండు గలడే!

—: ఘోణతీర్థస్నానవిముఖు లగువారలకు మహాదోషంబులు సంక్రమించుట :—

గంగాదిమహాపుణ్యతీర్థంబు లన్నిటికిని సంసేవ్యమానం బగుటం జేసి యాతీర్థం బన్నిట నుత్తమంబయ్యెను. ఆరామంబుల ఛేదించువాడును, కన్యావిక్రేతయు, హయవిక్రేతయు, దేవద్రవ్యాపహారియు, దానమిచ్చి మరల గైకొనువాడును, తటాకంబులను, నీటికట్టలను ఛేదించువాడును, పరస్త్రీలోలుండును, సురాపానరతుండును, గురుజనంబుల ద్వేషించునాతండును, ఆత్మస్తుతిపరాయణుండును, పరనిందాసక్తుండును, సంస్కారహీనంబగు నన్నమును భుజించువాడును, పితృశేషాన్నభోక్తయు, పితృశేషాన్నదాతయు, తల్లితండ్రుల ద్వేషించువాడును, సువర్ణంబును దొంగిలించువాడును, పరవనితాసంగమాసక్తుండును,సోదరకళత్రరతిప్రియుండును, చండాలునితో సంభాషించువాడును, సర్వకాలంబులదర్భపాణియగువాడును, రజస్వలయగునాడుదానిమాటల వినుచుండియు, గుక్కలు మొఱుగుచుండవినుచుండియు,చండాలునిమాటల నాలకించుచును భుజించువాడును, పురాణశ్రవణంబునకును, పరిణయంబునకును, మౌంజీబంధనాదికర్మలకును విఘ్నం బొనరించువాడును, శరణాగతుల హింసించువాడును, పుణ్యతీర్థపరాఙ్ముఖుండును, పితృయజ్ఞపరిత్యాగియు, భార్యాపరిత్యాగియు, ఘోణాస్నానవిముఖుండును, స్వర్ణస్తేయ, సురాపాన, గురుదారసంగమ, గోవధాదులందు సంభవించు మహాపాపంబుల నొందగలరు.

దారుణమహాపాపంబులును, వానికి సమానమగు పాపంబులును క్షుద్రపాపంబు లన్నియునుం గూడ ఘోణతీర్థస్నానవిముఖు నాశ్రయింపగలవు. మహాపాపరతుండును, కులాధముండును, కులాంతకుండును, శ్వపచుండును, నిజకర్మవివర్జితుండును, పశుహింసకుండును, త్యాగహీనుండును, పరద్రోహచింతనుండును పిశునుండును, అసత్యవాదియు, దాంభికుండును, భ్రూణహత్య నొనరించినవాడును, కృషికర్మపరుండును, స్వామిద్రోహంబొనరించినవాడును, పితృఘాతియు, సర్వదేవపరాఙ్ముఖుండును, దుష్పాత్రదాన మొనరించువాడును, సత్కార్యంబులకు విఘ్న మొనరించువాడును, ఫలపుష్పపరిశోభితంబులగు తరువరంబుల నరికెడువాడును, పుత్రహీనుండును, విషప్రయోగ మొనరించువాడును, గురుద్వేషియు, దంపతుల నెడబాపువాడును, గ్రామాధిపత్యదేవాలయాధిపత్యముల నొనరించువారలును, భృతికి వేదంబును జెప్పువాడును పాపు లనంబరగుచుందురు. అట్టివారుగూడ ఘోణతీర్థజలస్నానపానాదులచే పవిత్రు లగుదురు. జ్ఞానాజ్ఞానకృతదోషనివహంబు లందలి స్నానంబున నివర్తించును.

—: తుంబురుం డను గంధర్వుని చరిత్రము :—

మునిచంద్రులారా! యిందులకొక యితిహాసంబుగలదు వినుండు. అయ్యదియు మిగుల పావనమై యున్నది. మున్ను సకలకళాప్రవీణుండును, సర్వజ్ఞుండును, నియమవంతుం డగు గార్గ్యుం డను మహాముని దేవలుండను మహర్షి కడకుం బోయి నమస్కృతుల నొనర్చి మహాత్మా! ఘోణతీర్థప్రభావంబును వినుటకు కుతూహలినై యుంటిని. వినుపింపు మనగా దేవలుం డిటు వచించెను. తుంబురుం డను గంధర్వవరుండొకరుండు సాధ్వీమణి యగు భార్యను శపించి యా ఘోణతీర్థస్నానంబున బవిత్రుండై పునరావృత్తిరహితంబగు విష్ణులోకంబు నొందె నన, గార్గ్యుం డిట్లనెను. మునిశేఖరా! సకలవిద్యాపారంగతుం డగు తుంబురుం డేమికారణంబున సుగుణాలవాలయును, పతివ్రతయు నగు



భార్యను శపించెనో యాచరితం బంతయు సవిస్తరంబుగ వినుపింపు మన, దేవలుం డిటులనెను.

—: తుంబురుండు తనభార్యకు ఘోణతీర్థస్నాన విధానంబు నుపదేశించుట :—

మునివరా! తుంబురుండు నిజకళత్రంబును గాంచి సుందరీ! మాఘత్రయంబున భాస్కరుం డుదయించినతరుణంబున నేనన్నుం గలసి నులాపకర్షణస్నాన మొనరించి యాతీర్థతటంబున మాధవార్చనం బొనరించుటకై యొకప్రదేశంబును గోమయంబుచే బరిశుభ్రంబుగ నలికి యందు స్వస్తికపద్మధాతువులచేతను, రంగవల్ల్యాదులచేతను మనోహరంబుగ నలంకారంబు గావించి మంగళప్రదంబగు నవ్విష్ణుప్రీతికరం బగు నీమూలంబున నాకు శుశ్రూష గావింపుము. నీవీమాఘమాసంబున మాధవు నుద్దేశించి దీపంబుల వెల్గింపుము. సుగంధధూపంబుల నర్పింపుము. రమాకాంతునకు పరిశుద్ధంబులును, రుచికరంబులునగు భక్ష్యంబుల బచనంబు గావింపుము. నాతోడం గూడి దేవదేవునకు బ్రదక్షిణనమస్కారంబుల నొనరింపుము. ప్రతిదినంబునను విష్ణుపురాణకథాశ్రవణంబు గావింపుము. నిత్యంబును స్నానమొనరించి ప్రయత్నపూర్వకంబుగవిష్ణుపాదోదకపానంబొనరింపుము. సంతతంబును శ్రీమహావిష్ణు నామసంకీర్తనంబు గావించుచుండుము. క్రోధ, మాత్సర్య, లోభాది దుర్గుణంబుల విసర్జించి నేనాదేశించినతీరున వ్రతమాచరింపుము.

ఇటు లొనరించిన ముక్తి నొంది శాశ్వతంబగు విష్ణులోకంబు నొందగలవు; శాశ్వతసుఖంబు నొందగల వనియెడు పతివచనంబుల నాలకించి యాగంధర్వరమణి పతి కిటులనెను. శీతాతిశయంబుగ నుండు మాఘమాసంబున దినకరుండు మందోదితుండగు సమయంబున స్నాన మొనరించుట కష్టముగదా? నీవు నాకిపుడు తెలియజేసిన పను లెవ్వియు నే నొనరింపజాలను. నీతోగూడి ప్రాతఃకాల

స్నాన మొనరింపలేను. శీతబాధను సహింపలేక నేను మరణము నొందెదను. నను రక్షించువార లెవరు గలరు ? ఈవిషయంబున నీవు జెప్పినటుల జేయుదానను కాన నెను.

ఆపలుకులు ములుకులై చెవులకు నాటునంత నాగంధర్వపుంగవుండు శాంతుండయ్యు నామెపలుకుల కలిగి క్రోధతామ్రాక్షుండై యిటు లనెను. ధర్మవిముఖుం డగు తనయుండును, అప్రియభాషిణి యగు భార్యయు, అబ్రహ్మణ్యుం డగు నరపాలుండును శాపంబున దండింపతగినవార లని మనంబున దలంచి యోదుష్టచారిణీ! నావచనంబుల దృణీకరించి యప్రియవచనంబుల బల్కితివిగాన సర్వపాపవినాశకరంబగు వేంకటాచలమందలి ఘోణతీర్థతీరంబునం గల పిప్పలతరువరకోటరంబున మండూకమవై బడియుండు మని శపించెను.

గంధర్వరమణి యాశాపవచనంబు నాలకించి భయకంపితగాత్రియై రోదనం బొనరించుచు పతిపదంబుల వ్రాలి శాపమోక్షంబును ప్రార్థింప, తుంబురుం డిటులనియె. తరుణీ! నాశాప మమోఘంబు; నీ వనుభవింపక తీరదు. నీవొనరించు రోదనంబు వినిన జాలి వొడముచున్నదిగాన నాపలుకు లాలింపుము. జితేంద్రియుండును, తపోనిధియు నగు కుంభసంభవుండు పర్వతిథియందు, పూర్ణిమయందు ఘోణతీర్థస్నాన మొనరించి యాతీర్థరాజతటంబునం దుండెడు అశ్వత్థవృక్షసమీపంబున గూరుచుండి తనశిష్యవర్గంబునకు ఘోణతీర్థమహిమంబును వినుపించుచుండును. అయ్యశ్వత్థతరుకోటరంబున నివసించియుండు నీ వామునివరుండు పలికెడు ఘోణతీర్థప్రభావంబును విని విగతకల్మషవై మరల నన్నుం గలియగలవని పలికి యూరకుండెను.

అంతలోన నాగంధర్వతరుణి భర్తృశాపవశంబునం జేసి మండూకరూపమునొంది మెలమెల్లన వేంకటాచలశిఖరమందలి ఘోణతీర్థంబునకు దక్షిణతీరంబున నుండెడు పిప్పలద్రుమకోటరంబునం బ్రవేశించి పదివేల వత్సరంబు లందు వసించియుండెను.



పిదప కొంతకాలంబున కయ్యగస్త్యమునిచంద్రుండు తన శిష్యసమన్వితుండై మనోహరంబగు వేంకటాచలంబునకుం జేరి నియమవంతుండై యందలి స్వామి పుష్కరిణీజలంబుల స్నాన మొనరించి యాతీర్థంబునకు దక్షిణతటంబునం దుండెడు వరాహస్వామిని దర్శించి నమస్కృతు లొనరించి, పూజించి యటుపిమ్మట వేంకటేశాలయంబునకరిగి వేదవేద్యుండును, పద్మపత్రవిశాలాక్షుండును, పురాణపురుషుండు నగు శ్రీనివాసునకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి పిమ్మట ఘోణతీర్థముం జేరి యయ్యోగిపుంగవుండు శిష్యసహితుండై యందఘమర్షణస్నాన మాచరించి యాతీరమందలి యశ్వత్థతరువరచ్ఛాయయందుపవిష్టుండై బ్రహ్మహత్యాది మహాపాతకనాశకంబును, సర్వసంపత్ప్రదంబును, సకలశుభదాయకంబు నగు ఘోణతీర్థప్రభావంబును శిష్యుల కుపదేశించుచుండెను.

—: కుంభసంభవుని దర్శనంబున తుంబురు ధర్మపత్ని
శాపవిముక్తి నొందుట :—

రావిచెట్టు తొఱ్ఱనుండి కుంభసంభవుండు వచించు ఘోణతీర్థప్రభావంబునాలించి యాగంధర్వపత్ని యాకోటరంబునుండి వెలికివచ్చి మండూకరూపము న్విడిచి ఘటసంభవుని పదంబుల వ్రాలి సుందరంబగు సుందరీరూపంబున నిలిచి ముకుళితహస్తయై మునిశేఖరా, పతివాక్యనిరాకరణం బొనరించిన పాతకురాలను. నను రక్షింపు మనియెడు నామెపలుకుల విని యమ్మునివరుం డిటుల నెను

లలనామణీ! నీవెవ తెవు ? నీకు శుభం బగుగాక. తొలిపుట్టువునందు నీ వెద్దియో మహాపాతక మొనరించినకతంబున గప్పవై యుండవలసివచ్చిన దన, నయ్యువిద యిటులనెను. మునీంద్రా! తుంబురుండను గంధర్వవరుండు నామగండు. తపోనిధియు, సర్వజ్ఞుం డగు నానాథుం డొకనాడు నను జేరంజీరి ధర్మము లెన్నియో నాకుపదేశించి యాధర్మంబుల ననుష్ఠింపుమన బరలోకోపకారంబులగు పతివచనంబుల

నాలించి దుర్బుద్ధినై దుర్గతిప్రదంబులును, అసహ్యంబులగు వచనంబుల బల్కితి నన, విని కలశజుం డిటులనెను.

—: కుంభసంభవుండు పతివ్రతాధర్మంబుల దెలుపుట :—

తరుణీ! కుశాగ్రబుద్ధియగు నీభర్త క్రోధంబున నిను శపించెను. పతివాక్యనిరాకరణం బొనరించిన నీకాశాపము తగియున్నది. ఏనాతి పతివచనంబుల దృణీకరించునో, ధర్మమును వీడి స్వేచ్ఛగ నేయువిధ సంచరించుచుండునో యట్టి వనిత యాచంద్రతారకంబుగ నరకంబుల ననుభవించును. ఆడుదానికి స్వతంత్రత లేదు. పతిభాషణంబుల నతిక్రమింపరాదు. పతిశుశ్రూష యొనరించుచు పాతివ్రత్యమును కాపాడుకొను నాతి విష్ణుపదంబు నొందగలదు. వ్రతము లెన్నియైనను పతిశుశ్రూషకు సాటికావు. నారీమణులకు పతియే జగదంబిక, పతియే శివుండు, పతియే మాధవుండు, పతియే వాణీధవుండు పతిసేవయే పుణ్యతీర్థసేవన మని బుధులు వల్కుచుందురు. పతివచననిరాకృతి యొనరించిన వ్రతాదికంబు లన్నియు నిష్ఫలంబు లగును పతివిహీన యగు నారి ధర్మజ్ఞు లగు గురువుల నాశ్రయించి వార లుపదేశించిన తీరున వ్రతాదుల నొనరింపవలయును. పతియుతయగు పడతి నాథుని ప్రేరణంబున పతిభక్తిపరాయణయై వ్రతాదుల నొనరింపవలయును.

ఏరమణీమణి పతిపదాబ్జంబుల గడిగి యాజలంబున స్నాన మొనరించునో యయ్యతివ గంగాది సర్వతీర్థస్నానఫలంబు నొంది యారమాకాంతున కెంతయు సమ్మతమైనదై యుండును. భర్తృవచననిరాదరణదోషంబున నింతకాలంబును దాని కనుగుణమగు ఫల మనుభవించితివి. ఈనాడు నాశిష్యుల కుపదేశించు ఘోణతీర్థవైభవంబు నాలకించిన కతంబున శాపమోక్షంబు నొంది మనోహరంబగు సుందరీరూపంబు నొందితివి. తరుణీ! యీకారణంబున నిదిమొదలుగ ఘోణతీర్థము తుంబురుతీర్థమని ప్రసిద్ధి నొందగలదు. ఈతీర్థంబున కెనయగు తీర్థ మెందును గానరాదు. మునిచంద్రులారా! సర్వపాపవినాశకరంబును,



మహాపుణ్యఫలదంబు నగు ఘోణతీర్థంబున పౌర్ణమీదివసంబున స్నాన మొనరించినవారలు సమస్తక్రతుఫలంబును, తీర్థాయుతస్నానఫలంబు నొందగలరు.

తుంబురుతీర్థస్నాన మొనరించిన మానవుండు కపిలాగోసహస్ర దానఫలంబు నొందగలండు. ఘోణతీర్థావగాహనంబున రత్నకోటి సహస్రంబులను, మదగజసహస్రంబును, హయాయుతంబును ప్రతి దినంబును దాన మొనరించిన ఫలమబ్బును. కోటికన్యాదానంబున గల్గు ఫల మయ్యది ఘోణతీర్థస్నానమాత్రంబున బొందనగును. కురుక్షేత్రంబునం దొనరించిన హేమాంబరాది దానంబులు ఘోణ తీర్థస్నానంబునకు సాటిరావు. గురునిమిత్తంబునను, భూసురనిమిత్తంబునను, ప్రభునిమిత్తంబునను తనువును విడిచినవానికి ప్రాప్తంబగు ఫలం బొకమారు తుంబురుతీర్థస్నానంబున బొందవచ్చును.

ఆపన్నార్తిహరులకును, తీర్థసేవాపరులకును, సత్యవ్రతనిరతు లగువారలకును గల్గు ఫలము తుంబురుతీర్థస్నానంబున సంప్రాప్తంబగును. అమావాస్యయందు పితరులకు శ్రాద్ధ మొనరించినవారలకు గలుగు ఫలము ఘోణతీర్థస్నానమున బొందనగును. గంగా, నర్మదా, సరయూ, చంద్రభాగా ప్రముఖంబులగు సమస్తతీర్థంబులం దవగాహన మొనరించువారల కబ్బెడు ఫలము పావనంబగు ఘోణతీర్థస్నానంబున సంభవించును. అందువలన ఘోణతీర్థ మన్నితీర్థంబుల నుత్తమమై లోకంబున ప్రఖ్యాతి గాంచినయది. సకలకలుషాపహారకంబగు నీఘోణ తీర్థప్రభావంబు నెవ్వారు శ్రద్ధాభక్తిసమన్వితులై వినియెదరో వారలు వాజపేయశతఫలంబు నొంది విష్ణుసాయుజ్యంబు నొందగలరని వచింప, నాసూతమునీంద్రునకు నమస్కారంబు లొనరించి శౌనకాది మహామును లిటులనిరి.

—: వేంకటాచలము సర్వతీర్థాధార మని వివరించుట :—

పౌరాణికోత్తమా! సర్వసంకటనాశకం బగు వేంకటాచలంబు

నందెన్ని తీర్థంబులు గలవో, వానియందు ముఖ్యమైన వెన్నియో, వానియందు నత్యుత్తమంబులగున వెన్నియో వాని సంఖ్యను వినుపింపుము. మరియు వాటియందు సద్ధర్మప్రవర్తకంబులును, జ్ఞానప్రదంబులును, భక్తివైరాగ్యదాయకంబులును, ముక్తిప్రదంబులునగు వానిని వివరంబుగ దెల్పుమన సూతుం డిటులనెను. మునివరులారా! యయ్యచలోత్తమంబున పుణ్యతమంబు లగు తీర్థంబు లరువదియారు కోట్లున్నవి. వానిలో నష్టోత్తరసహస్రతీర్థంబులు ముఖ్యమైనవి. సద్ధర్మరతిప్రదంబులగు తీర్థంబులు నూటయెన్మిది గలవు. అందును భక్తివైరాగ్యంబుల నొసంగునవి యరువది కలవు.

—: స్వామి పుష్కరిణ్యాది షట్తీర్థస్నానకాల నిర్ణయము :—

మరియు నవ్వేంకటాచల మూర్ధంబున నారుతీర్థంబులు ముక్తి నొసంగునవి యున్నవి. అవియు స్వామిపుష్కరిణి, వియద్గంగ, పాపనాశిని, పాండుతీర్థము, కుమారధారికాతీర్థము, తుంబురుతీర్థ మను నామంబుల బ్రసిద్ధి నొందియున్నవి. కుంభమాసమందలి పౌర్ణమీదినంబున మఘానక్షత్రయోగంబు గల్గునపుడు సమస్తతీర్థంబులును కుమారధారికాతీర్థంబున బ్రవేశించియుండును. ఆ సమయంబున నందు స్నాన మొనరించినవారలకు రాజసూయఫలంబు సంప్రాప్తంబయి ముక్తి నొందగల్గుదురు. ఆప్రదేశంబున సదక్షిణాకంబుగ నన్నదాన మొనరింపవలయును. భానుండు మీనరాశియందు సంక్రమింప శుక్లపక్షమందలి పూర్ణిమాతిథియం దుత్తరాఫల్గునీనక్షత్రము ప్రాప్తించెనేని యాసమయంబున తీర్థవర్యంబు లన్నియు తుంబురుతీర్థంబున బ్రవేశించియుండును. ఆతీర్థమునం దపరాహ్ణసమయంబున స్నాన మొనరింప మోక్షము సిద్ధించును. ఆప్రదేశంబున ధనదాన మొసంగి యుపనయన వివాహాది శుభకార్యంబు లొనరించుటవలన నఖండపుణ్యఫల మబ్బును.

దివాకరుండు మేషరాశిగతుండై యుండ చిత్రానక్షత్రయుతంబగు పూర్ణిమయందు వియద్గంగాతీర్థంబున తీర్థంబు లన్నియు బ్రవేశించి



యుండును. ఆసమయమం దాకాశగంగాస్నాన మొనరించువారలు శతక్రతుఫలము నొందగలరు. అందు సువర్ణదాన, కన్యాదానంబులు ప్రశస్తంబులు. ప్రభాకరుండు వృషభరాశియందు సంక్రమించియుండు నవసరంబున శుక్లపక్షమందైనను, కృష్ణపక్షమందైనను, ఏకాదశీ, ద్వాదశీతిథులు భౌమవాసరసమన్వితంబు లగునేని యట్టి పుణ్యసమయంబున ముల్లోకంబుల గల్గు తీర్థంబులన్నియు పాండుతీర్థంబున బ్రవేశించును. అందాసమయంబున స్నానం బొనరిచి గోదానం బొనరించినవారలు సకలప్రతిబంధకంబులనుండియు విముక్తి నొందగలరు. ఆశ్వయుజమాసంబున శుక్లపక్షమందలి సప్తమీదినంబున భానువాసరంబును, ఉత్తరాషాఢానక్షత్రంబును గలసినచో సమస్తతీర్థంబులును పాపనాశనతీర్థంబు నొందగలవు.

మరియు నుత్తరాభాద్రతో గూడిన ద్వాదశియందైనను సంక్రమింపగలవు. అందాదినంబుల స్నాన మొనరించి సాలగ్రామశిలాదాన మొనరించిన మానవులు జన్మకోటిశతోద్భవంబు లగు కలుషంబుల బాసి ముక్తు లగుదురు. ధనుర్మాసంబున శుక్లపక్షద్వాదశీతిథియం దరుణోదయసమయంబున సమస్తతీర్థంబులును స్వామి పుష్కరిణీజలంబుల సంక్రమించియుండును. ఆసమయంబున నందు స్నాన మొనరించు నరుండు నిస్సంశయంబుగ ముక్తుం డగును. ఏనరుండు జన్మసహస్రంబులందును పాప మొనరింపకుండునో యట్టి పుణ్యాత్ములకుగాక నితరులకా తీర్థస్నానము లభింపదు. అందు స్నాన మొనరించి విభవానుగుణంబున సాలగ్రామదాన, గోదానప్రముఖంబులగు దానంబుల గావింపవలయును.

—: పురాణశ్రవణప్రాశస్త్యవర్ణనము :—

ఏమానవులు లోకపావనకరంబులగు విష్ణుచరితంబుల నాకర్ణింతురో వారలు మానవలోకంబున విష్ణుభక్తు లగుదురు. సర్వదా వినుటకశక్తుండేని పురుషోత్తముని కథ నొకముహూర్తకాలమందైనను, ఒక

క్షణకాలమైనను వినిన మనుష్యునకు దుర్గతు లన్నియును తొలగును. సమస్తయాగఫలంబును, దానము లన్నిటియందు గల్గు ఫలం బొకపరి యైనను విష్ణుకథ నాకర్ణించినవారలకు గల్గును. కలియుగంబున పురాణశ్రవణముకంటె నుత్తమంబగు ధర్మంబు వేరొకటి లేదని తెలియనగును. విష్ణుకథాశ్రవణంబును, విష్ణునామసంకీర్తనంబును అనునివి రెండును మానవులకు పుణ్యాద్రిమహాఫలంబులుగా నెఱుంగనగును. అమృతపాన మొనరించినవా డొకరుండే జరామరణవర్జితుం డగును. విష్ణుకథామృతపానము వంశమంతను జరామరణవర్జితంబుగా జేయును.

—: పురాణముం జెప్పువాడు సర్వపూజ్యుండని దెల్పుట :—

శాపాయుధాగ్రేసరులారా! బాలుండైనను తరుణవయస్కుం డైనను, వృద్ధుండైనను, దరిద్రుండైనను, పురాణవేదియగునేని యట్టి పుణ్యాత్ముం డందరకును వందనీయుండగును.

ఏమహానుభావుని ముఖమునుండి వెల్వడిన మాటలు శరీరధారులకు కామధేనుసమానంబు లగునో యట్టి పురాణజ్ఞు నొకప్పుడైనను నీచబుద్ధిచే నిందింపరాదు. జన్మంబు లనేకంబులుగా నెత్తి ప్రతిపుట్టువునందును దుఃఖంబు లపరిమితంబుగ ననుభవించువారలకు పునరావృత్తిరహితంబగు శాశ్వతపదంబు నొసగెడు పురాణజ్ఞునికంటె గురుం డెందును గానరాడు. వ్యాసాసనసమారూఢుండై పౌరాణికుండు పురాణము జెప్పుచుండునంతవరకును నతం డెట్టివాడైనను నమస్కారపాత్రుం డగును. ఆసభయం దితరులకు నమస్కార మొనరింపరాదు. దుర్జనసమాకీర్ణంబును, శూద్రశ్వాపదావృతంబును, ద్యూతగృహంబు నగు ప్రదేశంబుల మతిమంతుండగువాడు పుణ్యకథలను వచింపరాదు. మంచి బుద్ధిగలవారు, యోగ్యులు నివసించు గ్రామంబునను, సుజనాకీర్ణంబగు ప్రదేశంబునను, సుక్షేత్రంబునను, దేవతాయతనంబునను, పుణ్యనదీతీరంబునను పుణ్యకథలు వినుపింపవలయును. శ్రద్ధాభక్తిసమన్వితులై యితర కార్యచింతావిహీనులై వాఙ్నియమముకలవారై శుచి



ర్భూతులై యెవ్వారలు వినియెదరో వారలే పుణ్యఫలంబు నొందగలరు. భక్తివిహీనులై పుణ్యకథ లాకర్ణించు మానవాధములు పుణ్యఫలంబు నొందకుండుటయేగాక ప్రతిజన్మంబునను దుఃఖపరంపర ననుభవింపగలరు.

ఎవ్వారలు తాంబూలాద్యుపాయనంబుల నొసంగి పురాణంబును పూజించి భక్తిసంయుక్తులై కథనాకర్ణింతురో వారలను పాపంబులును, దరిద్రంబు నంటకుండును. కథామధ్యంబునం దెవ్వార లితరకార్యచింతచే వెడలిపోవుదురో వారల భోగంబుల కంతరాయంబు సిద్ధించును. వారల దారపుత్రాదులు నశించెదరు. శిరంబునం దుష్ణీషంబును ధరించి పురాణంబును వినియెదరో వారలు మనుజాధములై జనింతురు. తాంబూలము నమలుచు పుణ్యకథాశ్రవణ మొనరించిన నీచులు శునకపురీషభక్షకులై మహాఘోరనరకంబుల ననుభవింతురు. ఏమానవులు దాంభికులై యున్నతాసనంబుల నధిష్ఠించి పుణ్యకథ లాలించువారలు వాయసజన్మము నొందగలరు. వీరాసన సింహాసనాసీనులై పురాణంబును వినువారలు మద్దిచెట్లులై బుట్టుదురు. నమస్కార మొనరింపక పుణ్యకథ లాకర్ణించువారలు విషవృక్షంబులై జనింతురు. శయనించి పురాణంబును వినువారలు కొండచిలువలై పుట్టుదురు. పౌరాణికుని పీఠంబునకు సమానమగు పీఠంబున గూర్చుండి పురాణంబును వినువారలు గురుతల్పసమానదోషము ననుభవించగలరు. పౌరాణికునిగాని, పాపంబుల శమింపజేయు పురాణకథనుగాని నిందించువారలు నూరుజన్మంబుల గుక్కలై పుట్టుదురు. పుణ్యకథలను వినుచు దురుక్తులాడినవారలు ముందు కొన్నిజన్మల గాడిదలయి బుట్టి పిదప గొన్నిజన్మంబుల తొండలై పుట్టగలరు. ఒకపుడైనను పుణ్యకథ నాలించనివారలు దారుణనరకబాధల ననుభవించి పిమ్మట నడవిపందులై బుట్టెదరు. ఏమనుజులు పుణ్యకథాకథనంబునకు విఘ్న మొనరింతురో వారలు గ్రామసూకరంబులై జనింతురు.

ఏవారలు పురాణకథల నెన్నండును విననివారలయ్యు కీర్తనీయంబులగు పుణ్యకథల ననుమోదింతురో వార లవ్యయంబగు శాశ్వత పదంబు నొందగలరు. పౌరాణికంబులగు పుణ్యకథల వినుపించువార లనేకకల్పంబులు గతించుదనుక బ్రహ్మలోకంబున వసింపగలరు పౌరాణికున కెవ్వారలు కూరుచుండుటకై కంబళాజినాంబరాదుల నొసగెదరో వారలు స్వర్గసుఖంబుల ననుభవించి సత్యాదిలోకంబుల నొందగలరు. మహాపాతకోపపాతకసమన్వితులగువార లందరును పురాణచరితంబుల వినుటంజేసి పరమపదంబు నొందగలరని వచించు సూతుని పలుకు లాలించి మునిముఖ్యు లందరును పౌరాణికోత్తముండగు సూతునకు యథాన్యాయంబుగ బూజల నొనరించి యాతపోధనున కిటులనిరి.

—: కటాహతీర్థమాహాత్మ్యము :—

వేదవేదాంతతత్త్వవేత్త వగు సూతమునిచంద్రమా! శ్రీవేంకటాచలంబున పావనంబగు కటాహతీర్థంబు గలదని ముల్లోకంబులందును ప్రసిద్ధమై యున్నది. మాయందు దయయుంచి దాని విశేషంబుల దెల్పుము. మున్నొక సమయంబున శతానందనందనుండగు నారదుండు నైమిశారణ్యంబునకు విచ్చేసెను. ఆపుణ్యారణ్యంబున నివసించియుండు మేమందరమును ఆసురమునిచంద్రున కెదురేగి తోడ్తెచ్చి సముచితార్ఘ్యాదికంబుల నుపచరించి, పవిత్రమగు కుశాసనంబున సముపవిష్టుం గావించి, వినయానతకంధరులమై నమస్కృతు లొనరించి యిటుల ప్రార్థించితిమి. దేవమునిసత్తమా! భువనత్రయంబున వసించియుండు తపోధను లందరిలో నీవలె ధర్మోపదేశకుండగు నాతం డింకొకరుండు గానరాడు, సర్వసుపర్వసంసేవితంబును, వైకుంఠాగతంబును, సిద్ధసాధ్యకింనరకింపురుషసేవితంబును, మనోహరం బగు వేంకటాచలమందలి కటాహతీర్థవిశేషంబుల వినుపింపుమన నాదేవముని యిటులనెను.

శౌనకాదిమునిపుంగవులారా! కటాహతీర్థమహిమంబును వచింప నెరికిని శక్యముగాదు. ఆతీర్థమహిమం బామహాదేవుం డొకరుండు దక్క



పెరవార లెరుంగరు. బ్రహ్మాండాంతర్గతంబులగు మహాపుణ్యతీర్థంబు లన్నియు తమ కలుషంబుల బాపికొనుటకయి కటాహతీర్థంబు నాశ్రయించియుండును. బ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును శూద్రు లనంబరగు నాలుగువర్ణంబులవార లేగాక మరి యితరజాతుల వార లందరు నందలి జలంబుల స్పృశింతురని తలంచి యెవ్వార లానీరంబులు స్పర్శదూషితంబు లని తలంచెదరో యామనుజాధములు చండాలయోనియందు జనించుటయేగాక కుంభీపాకనరకంబునం గడు యిడుమలు నొందగలరు.

బ్రహ్మచారియు, గృహస్థుండును, వానప్రస్థుండును, యతీశ్వరుండును గూడ నాతీర్థసేవనంబున పరమపదంబు నొందగలరు. శ్రుతిస్మృతిపురాణేతిహాసములం దాపుణ్యతీర్థము పంచమహాపాతకనాశకం బని వర్ణింపబడి యున్నది. తపోధనులారా! అత్యద్భుతంబును, సకలలోకైకపావనంబు నగు నా కటాహతీర్థస్నానమునంజేసి బ్రహ్మహత్యాది మహాపాతకంబు లన్నియు విలయము నొందగలవు. ప్రాయశ్చిత్తశూన్యంబు లగు వివిధపాతకంబు లన్నియు కటాహతీర్థావగాహనంబున నాశ మొందును. కుష్ఠాదిరోగయుతు లగువారలైనను భగవత్పదకమలనిస్సృతంబులగు కటాహతీర్థజలంబుల ద్రావుచుండురేని రోగవిహీనులై విష్ణుపదంబు నొందగలరు.

భక్తశివంకరుం డగు శంకరుండు మున్నొకసమయంబున పార్వతికి తీర్థమహిమంబు నుపదేశించెను. మునివరులారా! యిది యంతయు నర్థవాదం బని వచించు నాస్తికుల నాల్కలపై కాలకింకరులు పరశువులం గాల్చి పెట్టెదరు. కటాహతీర్థమందలి నీరంబుల ద్రావినవారలు కలుషవిదూరులై సర్వాభీష్టంబుల నొందగలరు. అందువలన నాతీర్థంబును సేవింపవలయునుగాని నిందింపరాదని పలికి నారదుండు త్రిలోకపావని యగు కాశికాపురికి బోయెను. పౌరాణికోత్తమా! సురమునిశేఖరుండు కటాహతీర్థమహిమంబును సంక్షేపంబుగ దెల్పిన

నాటినుండియు నాతీర్థవైభవంబును సవిస్తరంబుగ వినవలయు నని సముత్సుకులమై యుంటిమన విని సూతుం డిటులనెను.

—: కటాహతీర్థ జలపానక్రమము :—

మునిశేఖరులారా! కటాహతీర్థమహిమంబును సవిస్తరంబుగ వినిపించెద వినుండు. కటాహతీర్థము సర్వసంపత్కరంబై, సర్వపాప ప్రశమనంబై, మహావిఘ్నవిధ్వంసకంబై, సకలదుఃఖనాశకంబై, శాంతి కరంబై లోకము లన్నిట బ్రసిద్ధి గాంచినయది. ఏమనుజు లీతీర్థరాజ నామంబునైన నాలకించుచుందురో వారల కలుషంబులు నాశ మొంద గలవు. అష్టాక్షరమంత్రము నుచ్చరించుచు నందలి యుదకంబుల ద్రావవలయును. అటుల గాదేని కేశవాది నామము లుచ్చరించుచు పాన మొనరింపవలయును. తుదకు నామత్రయోచ్చారణ మొనరిం చుచునైనను జలపాన మొనరింపవలయును. వేంకటేశాష్టాక్షరమంత్ర జప మొనరించుచు జలపాన మొనరించుట భుక్తిముక్తిప్రదం బగును.

ఏనరుండు మంత్రహీనంబుగ జలపాన మొనరింప దలంచునో యాతండు మనంబున నాజన్మాంతరకృతపాపసంచయము నశించుగాక యని తలంచుచు జలపానంబు నొనరింపవలయును. స్వామి పుష్కరిణీ స్నానంబును, 'వరాహ దేవదర్శనంబును, కటాహతీర్థస్నానంబు నను నీ మూడును త్రైలోక్యదుర్లభంబులని యెరుంగనగును. మునిశేఖరు లారా! వేయిమాటలేల, కటాహతీర్థసమం బగు తీర్థ మెందును గాన రాదు.

—: కేశవుండను భూసురుని వృత్తాంతము :—

మున్ను కేశవుండను మహీసురుండు మహామోహమోహితుండై వేదవేదాంగవిశారదుండును, శ్రోత్రియుండు నగు నొకభూసురోత్త ముని ఖడ్గంబున దెగనరికి బ్రహ్మహత్యాదోషదూషితుండై కటాహ తీర్థజలపానంబున దోషవిముక్తుం డయ్యెనన మును లిటులనిరి —



మహాత్మా! కేశవుం డెందలివాడు? వానితండ్రి పేరెయ్యది? భూసురు నెందుకు హత్య గావించెను? ఆచరితంబును విపులంబుగ దెల్పుమన సూతుం డిటులనియె.

మనోహరంబును, గంధర్వోపసేవితంబు నగు తుంగభద్రానదీ తటంబున వేదవిదులగు భూసురులకు నివాసంబగు వేదాఢ్యం బను నొక యగ్రహారంబు కలదు. అందు వసించు మహీసురు లందరును వేదవేదాంగవిశారదులును, శబ్దశాస్త్రపారంగతులును, జ్యోతిశ్శాస్త్ర నిష్ణాతులును, మీమాంసా తర్కశాస్త్రనిపుణులును, వేదాంతవాదకు లును, ధర్మశాస్త్రనిరతులును, నిరతాన్నదాతలును, సుపుత్రవంతులు నై యుండిరి.

—: గణికాలంపటుండగు కేశవునకు సంక్రమించిన బ్రహ్మహత్యాక్రమము :—

ఆభూసురులందు పద్మనాభుండనునతనికి కేశవుండనుకుమారుం డుద యించెను. ఆతండు సర్వకర్మబహిష్కృతుండై జననీజనకులను, పతివ్రత యగు భార్యను విడచి యన్నివేళలయందును భోగకాంతాసక్తచిత్తుండై వెలపూబోడుల యిండ్లయందు సంచరించుచుండెను. ఇటులుండ నొక దినంబునం దొకవేశ్యయింటికిం బోయి యందు రెండుదినంబు లావెల యాలిం గూడి యుండి దాని కీయదలచిన నిష్కద్వయంబు నర్పించి యెందేని వెడలి మరల మూడవదినంబునం దాభోగాంగన యింటికిం జేరునంత వానిం గాంచి యవ్వేశ్యకాంత యిటులనెను.

ఓయీ! నీవు నిర్ధనుండవు. ముందుగ నాకిచ్చెడు వెల యొసంగి నాతో క్రీడింపుము. కాదేని వచ్చినత్రోవనుబట్టి పొమ్మన, నాతం డయ్యంగనాసక్తచిత్తుండై యచ్చటచ్చట ధనమును దొంగిలించి తెచ్చి దాని కొసంగుచు, దానింగూడి రమించుచు, దానియింటనే భుజించుచు చాలకాలము గడపెను. నీచమతియై యవ్వేశ్యంగూడి వారలిర్వురు నొకపాత్రతోడనే సురాపాన మొనరించుచుండిరి. ఇటులకొంతకాలము

గడువ, నమ్మహీసురాధముం డొకదినంబున కొందరు కిరాతులంగలసి తానుగూడ కిరాతవేషధారియై కరంబున గరవాలంబును గీలించి ధనాపహారణం బొనరింప నొక విప్రగృహంబున బ్రవేశించి తద్గృహస్వామి యగు మహీసురుని తనచేతి నిశితఖడ్గంబున ఖండించి యాగృహమందలి ధనము నంతను గ్రహించి వేశ్యాగృహంబునకు బోయెను. గణికాగృహంబునకు బోవుచుండ కేశవుని వెనుదవిలి భయంకరాకారయు, నీలవసనధారిణియు, రక్తశిరోరుహయు నగు బ్రహ్మహత్య భయంకరంబుగ నార్చుచు భూమ్యంతరిక్షమధ్యంబును కంపింపజేయుచు బరువిడి వచ్చుచుండ నాతం డద్దానిం గాంచి భయమంది జగతీతలంబున పరిభ్రమించుచు, విప్రబంధువగు కేశవుండు స్వగ్రామముం జేరెను. అపుడును బ్రహ్మహత్య విడువక వచ్చుచుండ భీతినొంది నిజాలయంబున బ్రవేశింప, నాహత్యయు నతిరయంబున వానితోగూడ సదనంబున బ్రవేశించెను. అంత నాద్విజాధముం డేమిచేయుటకుం దోపక జనకుని పాదంబుల వ్రాలి తండ్రీ! రక్షింపుము, రక్షింపు మని యేడ్చుచుండ, కుమారా! భయపడకు మని యూరడించుచు సుతుని రక్షింప నుద్యుక్తుండై యుండునంత భయంకరాకార యగు బ్రహ్మహత్య పద్మనాభున కిటులనెను.

—: స్వసుతరక్షణోద్యుక్తుం డగు పద్మనాభునితో బ్రహ్మహత్య గావించిన సంభాషణక్రమము :—

భూసురోత్తమా! నీపీకుమారుని పరిగ్రహింపకుము. ఈతండు సురాపానరతుండు. సువర్ణస్తేయంబు నొనరించినవాడు. బ్రహ్మహత్య నొనరిచి మహాపాతకియై యున్నవాడు. అంతియగాక మాతృపితృద్రోహియై యున్నవాడు. గుణవతి యగు కళత్రంబును విడిచినవాడు. గణికాసక్తచిత్తుండు. ఇట్టి యధమాధముని పరిగ్రహించుట పాపపరిగ్రహం బగును. నీవు నాపలుకు లాలింపక సుతప్రేమంబున వీనిం బరిగ్రహించితివేని మీయింటియందలివారల నందరను మ్రింగి పోయెద.



నీకుమారుని విడిచితివేని వీని నొక్కరుని భక్షించి పోయెద నన, విని పద్మనాభుం డిటులనెను. పుత్రవాత్సల్యం బెంతయు నను బాధించుచున్నయది. నేనెత్తెరంగున తనయుని విడువగలనో వచింపు మన, నాహత్య యిటులనెను. భూసురవర్యా! నీకుమారుండు వర్ణాశ్రమాచారవిహీనుండు, పతితుడై యున్నవాడు. నీ వీనిందితచరితునియెడ స్నేహభావమును విడువుము. వీని ముఖముం గాంచినవారలును పాపాక్రాంతు లగుదురు. పుత్రవాత్సల్యము న్వీడి వీని వదలుమని పలుకుచు నా కేశవుని వీపుపై కరతలంబున మోదినంత, నాప్రహారమును సహింపలేక తండ్రీ రక్షింపుము, రక్షింపు మని రోదన మొనరించుచుండ నాతనిజననీజనకులును, భార్యయుగూడ మిగుల దుఃఖించుచుండిరి.

—: భరద్వాజమహర్షి పద్మనాభునకు బ్రహ్మహత్యావిముక్త్యుపాయంబును దెలుపుట :—

ఆసమయంబున వారల పూర్వపుణ్యావశంబున నయ్యెడకు భరద్వాజుం డను మునిచంద్రుండు విచ్చేసెను. పద్మనాభుం డాతపోనిధిం గాంచి నమస్కృతు లొనరించి శరణంబు వేడి యిటుల బ్రార్థించెను. మునిశేఖరా! నీవావిష్ణువంశంబున జనించినవాడవు. పాపాత్ములకు నీదర్శనంబు దుర్లభమగును. బ్రహ్మఘ్నుండును, సురాపాయియు, దురాచారరతుండు నగు నాకుమారుని హింసించుటకయి బ్రహ్మహత్య వచ్చియున్నయది. నాయం దనుగ్రహముంచి నాతనయుం డెటుల పాపవిముక్తుం డగునో, బ్రహ్మహత్య యెటుల విలయంబు నొందునో వచింపుము. ఏకైకపుత్రకుండ నగు నన్నుద్ధరింపుము. నావంశంబునకు మూలాధారమగువాడు తనయుం డొకరుండుగాక మరెవ్వరును లేరు. వీడు మరణించెనేని నావంశం బంతమునొందును. పితరులకు పిండదాన తిలోదకంబుల నొసంగువారు లేరు. నాయందు కరుణాకటాక్షవీక్షణంబుల బరపి పుత్రభిక్ష నొసంగ వేడుచుంటి నన నాభరద్వాజుండు పద్మనాభున కిట్లనెను.

ఓయీ! నీతనయుండు భయంకరంబగు పాపకర్మ నొనరించియుండెను. దానికి వినాశంబు ప్రాయశ్చిత్తంబులు పదివేలొనరించినను కలుగనేరదు. నీసుతుని పాపవిమోచనంబునకు నేనొకయుపాయంబును వచించెద వినుము.

గంగానదికి దక్షిణదిగ్భాగంబున రెండువందలయోజనంబుల దూరంబునను, పూర్వసముద్రతీరంబునకు పశ్చిమంబునం దైదుయోజనంబుల దూరంబునను, సువర్ణముఖరీతీరంబున కుత్తరంబున క్రోశమాత్రదూరంబునను, సర్వలోకనమస్కృతంబును, మేరుసముద్భవంబును, వైకుంఠసమానీతంబును, మహావిష్ణునకు క్రీడాచలంబు నగు వేంకటాద్రి యున్నది. అయ్యచలరాజంబున శ్రీమన్నారాయణుండు శ్రీ భూ నీళాలలనామణులం గలసి వేంకటేశనామంబున సాక్షాన్మోక్షప్రదాయకుండై వసియించియున్నవాడు. ఆవేంకటేశ్వరాలయంబున కుత్తరదిగ్భాగంబున మంగళప్రదంబును, బ్రహ్మహత్యాది పాపౌఘవిధ్వంసకంబును, వాంఛితార్థప్రదాయకంబు నగు కటాహతీర్థమున్నది. నీవు సుతసహితంబుగ నటకు వెడలి యాతీర్థజలంబుల నీకుమారునిచే ద్రావింపుము. పాపవిమోచనం బగు నను వేదసమ్మితంబులగు భరద్వాజుని పలుకుల నాలించి యమ్మునికి ప్రదక్షిణనమస్కారంబు లొనరించి పద్మనాభుండు సుతసహితుండై వేంకటాచలంబున కరిగి స్వామిపుష్కరిణీజలంబుల స్నాన మొనరించి పిమ్మట వరాహస్వామిని సందర్శించి యటనుండి శ్రీనివాసాలయముం జేరి విమానంబునకు ప్రదక్షిణం బొనరించి, నమస్కారంబుల గావించి, దురాచారుం డగు కేశవునితోడం గలసి కటాహతీర్థమునకు బోయి బ్రహ్మహత్యాదోషవినాశకరంబు లగు కటాహతీర్థజలంబుల నాకేశవునిచే పాన మొనరింపజేసెను. అంతలోన వాని బాధించుచుండిన బ్రహ్మహత్య విలయ మొందెను. పిమ్మట నాపద్మనాభుండు సుతసహితుండై కృపానిధి యగు వేంకటేశుని సందర్శించెను. శ్రీనివాసుండు వారలకు నయన



గోచరుండై పద్మనాభా! కటాహతీర్థజలపానంబున బవిత్రులై, కృతార్థులైతిరి. నీతనయుండు బ్రహ్మహత్యావిముక్తుం డయ్యెను. కటాహతీర్థ స్నానపానంబులు సకలకలుషహరంబు లగుటంజేసి యందరకును సేవింపదగినవై యున్నవి. ఈతీర్థజలంబుల ద్రావినవారలు నాలోకంబు నొందగలరని వచించి శ్రీవేంకటేశుం డంతర్ధానంబు నొందెను. మునిచంద్రులారా! మున్ను నేను వినినతెరంగున కటాహతీర్థమహిమంబును మీకు తెలిపితి నని వచించు సూతున కామును లిటులనిరి.

మునిశేఖరా! సమస్తపుణ్యతీర్థనదీనదగిరివరక్షేత్రసరోవరప్రభావంబు లెన్నియో నీవలన వింటిమి. సువర్ణముఖరీతీర్థంబును సరసిజసంభవునాదేశంబున కుంభసంభవుండు భూతలంబునకు దెచ్చె నని వచించితివి. తదుత్పత్తిప్రభావంబులను, దాని నాశ్రయించియున్న తీర్థసముదయంబును వినుట కభిలషించుచుంటిమి గాన దయయుంచి వినిపింపుమన, సూతుండు శంకరునకును, నందీశ్వరునకును, కుమారస్వామికిని, వ్యాసమునీంద్రునకును ప్రణామంబు లాచరించి మునుల కిటుల వచించెను. మునివరులారా! మంగళకరంబును, వినువారల కమందానందసంధాయకంబును, పుణ్యఫలదంబు నగు నాఖ్యానంబును మున్ను భరద్వాజుం డను మునివరుండు పార్థునకు వినుపించెను. సకలకలుషాపహంబగు నాకథను మీకు వినుపించెద, సావధానంబుగ వినుండు.

కుంతీనందనులు ప్రాజ్ఞుం డగు ద్రుపదనరపాలునివలన యాజ్ఞసేనిం బడసి ధృతరాష్ట్రునిదేశంబున హస్తినాపురికిం జని యచట కురువృద్ధుం డగు భీష్మునిచే నుపలాలితులై దుర్యోధనాదులంగలసి యాకరిపురంబున నైదువత్సరంబులుండిరి. అటుపిమ్మట భీష్మాది కురువృద్ధులును, వాసుదేవుండును అంగీకరింప నాధృతరాష్ట్రుండు పాండవులకు ఖాండవప్రస్థం బను పురవరంబుతోగూడ నర్ధరాజ్యం బొసంగెను. పాండవులు భీష్మాదుల యనుజ్ఞగైకొని యాజ్ఞసేనీసహితులై యింద్ర

ప్రస్థపురంబునకు బోయి విశ్వకర్మ పరిరక్షితం బగు నాపురీవరంబున వసియించి సానుజుండై ధర్మనందనుండు ధర్మమార్గంబున ధరాపాలన మొనరించుచుండెను. నారదానుశాసనంబున మాధవుండు నిజపురంబునకు బోవ నాపాండునందనులు ద్రౌపదీవిషయంబున నీతీరున బ్రతిజ్ఞ గావించుకొనిరి.

—: అర్జునతీర్థయాత్రాప్రశంస :—

ఇయ్యాజ్ఞసేని యొక్కొకవత్సరము నిర్ణయపూర్వకంబుగ నొక్కొకరి గృహంబున వసియింపనగును. మనలో నెవ్వారలు పరగృహవర్తిని యగు కృష్ణను గాంతురో వార లొకవత్సరము తీర్థయాత్ర నొనరింపవలయును. ఈతీరున పాండుభూపాలనందనులు కృతప్రతిజ్ఞులై లోకసామాన్యంబులగు వ్యాపారము లొనరించుచు నతంద్రితులై కాలముగడుపుచుండిరి. ఇటులుండ నొకదినంబున భూసురుం డొకరుండు రాజమందిరాంగణంబునం బ్రవేశించి నాధేనువును తస్కరులు హరించిరని మొరలిడుచుండ గాంచి ధనంజయుం డాభూసురు నూరడించి త్వరాన్వితుండై శస్త్రంబుల గొనివచ్చుటకై శస్త్రాలయంబునకుం బోవ నంతకుమున్నె యం దుపవిష్టులై యుండెడు పాంచాలీయుధిష్ఠిరులం గాంచి తొల్లి గావించుకొనిన ప్రతిజ్ఞ నెరిగినవాడయ్యు ధనువును, తూణీరయుగంబును గైకొని రయమ్మున బోయి తస్కరుల దునుమాడి ధేనువును మరలించి సాదరంబుగ భూసురోత్తమున కొసంగి యటుపిమ్మట ధర్మనందను దరిజేరి శతక్రతునందనుండు వినయమ్మున నిటు వచించెను.

అన్నా! ధర్మనందనా! ప్రతిజ్ఞాభంగ మొనరించుటం జేసి నేనొక సంవత్సరము గతించుదనుక తీర్థయాత్ర గావింపవలసియున్నది. పోయివచ్చెద నను పాండవమధ్యముని పలుకుల నాలించి ధీరుం డగు ధర్మనందనుండు సాదరంబుగ నిటులనెను. ప్రియసోదరా! ధనంజయా! ధేనువుం గూర్చియు, భూసురనిమిత్తంబునను వచించిన



యనృతవచనంబులును, అందులకై గావించిన యసత్కార్యములును నిందనీయంబులు గావని యార్యులు వచింపుచుందురు. సహోదరా! గోబ్రాహ్మణనిమిత్తంబుగ నీవొనరించిన కార్య మకృత్యం బెటులగునో వచింపుము. ప్రజాపాలనం బొనరించునాతండు తస్కరుల నుపేక్షించిన బ్రహ్మహత్యాపాతకంబును, వారల శిక్షించినచో హయమేధఫలంబును పొందగలండు. దేశోపద్రవకారులగు చోరులను, దుస్సాధ్యులగు రిపులను నరనాథుండు శిక్షింపకుండినచో సుఖము నొందజాలడు. నీవిపు డొనరించిన కార్యము లోకహితంబును, ప్రభుధర్మంబునై యున్నయది. అందువలన నీ కేవిధమగు దోషంబును లేదు. నామాట విని తీర్థయాత్రాప్రసంగంబును వీడుమనియెడు ధర్మనందనుని వచనంబుల నాలించి రచితాంజలియై పురుహూతనందనుం డిటులనెను.

అన్నా! భూపాలతిలకుండవగు నీ వెరుంగని ధర్మంబు లెందును లేవు. ధర్మమూర్తి వగు నీ కెదురాడుచుంటినని యాగ్రహ మొందకుండుము. నామనవిని వినుము. ప్రతిజ్ఞాభంగ మొనరించినవాని పాపమునకు మేరయున్నదే! కృత్యాకృత్యంబుల నెరింగి సర్వకార్యదక్షుండగువాడు మున్ను తా వచించిన ప్రతిజ్ఞను భంగపరచి సంచరించుటకంటె తప్పు గలదే! బంధువులయొక్కయు, గురువులయొక్కయు పలుకుల ననుసరించి ధర్మమార్గమును విడిచి సంచరించుటయు, ప్రతిజ్ఞాభంగ మొనరించుటయు, తానాడిన మాటకు మారుమాటాడుటయు, నశక్తునకు లక్షణంబులు. అనుజుండ నగు నాయెడల జాలినొంది తీర్థయాత్రనుండి నను మరలించితివేని భగ్నప్రతిజ్ఞుండ నగు నన్నవలోకించి జను లొనరించు నిందల నివారింప సమర్థులుందురే! అది యటుండనిమ్ము.

అగ్రజా! నాకు చిరకాలమునుండియు మనంబున తీర్థయాత్ర గావింపవలయు నను కుతూహల మున్నది. అయ్యది యీనా డీరీతిని సంప్రాప్తమైనది. గాన నన్నీయుద్యమమునుండి మరలింపవలదు.

రాజేంద్రా! నాయందు దయయుంచి తీర్థగమనంబున కనుజ్ఞ నొసంగుము. ప్రభువులు వారల యనుజీవుల ప్రతిజ్ఞను గారవింతురు. అన్నా పోయివచ్చెద నని వచించి తక్కుంగల సహోదరుల యనుమతి నొంది ప్రణామప్రక్రియాదులచే ధర్మజుని సంతసింపజేసి వివిధంబులగు మంగళాచరణంబుల నంది పౌరాణికోత్తములును, మౌహూర్తికులును, భిషగ్వరులును, శిల్పకళావిశారదులును, సూతమాగధగణంబులును వెంటరా నాఖండలనందనుండు ధరణీసురపరివేష్టితుండై పయనమై పోయెను. యుధిష్ఠిరాజ్ఞానుసారంబుగ భోగత్యాగక్షమం బగు ధన మపరిమితంబుగ గొని కోశాధికారు లాపురందరనందనుం గలసి పోవుచుండిరి.

—: అర్జునుండు గంగాది సకలతీర్థంబుల నవగాహన మొనరించి సువర్ణముఖరీతీరముం జేరుట :—

పురుహూతనందనుం డిలు బయలువెడలి ముందుగ గంగానదిం జేరి గంగాద్వారంబును, ప్రయాగక్షేత్రంబును, కాశికాపురంబును సేవించి, యటనుండి జాహ్నవీతీరోపాంతమార్గంబున నడచుచు నందందుగల తీర్థంబుల నవలోకించుచు, మహోత్తుంగతరంగమాలికాభాసురం బగు దక్షిణసముద్రతటంబును జేరి యటనుండి మహానదికిం జని యందు స్నాన మొనరిచి, యటుపిమ్మట పురుషోత్తమక్షేత్రంబును దర్శించి, యందుండి సింహాచలంబునకు బోయి యందలి నరసింహస్వామిం గనుంగొని ప్రణామంబు లాచరించి, యటనుండి గోదావరీనదీతీరంబునం బ్రవేశించి, సకలకలుషప్రశమనకారణంబులగు గౌతమీజలంబుల నియమపూర్వకంబుగ స్నానాది క్రియాకలాపమును నిర్వర్తించి, యచ్చట భూదాన సువర్ణదాన గోదానాదికంబు లగు వివిధదానంబు లొనరించి, యచ్చటనుండి మలాపహా యను నది నవలోకించి యందుండి సరిద్వరంబగు కృష్ణవేణీనదిం జేరి యటనుండి శంకరు నియతావాసంబును, చతుర్ద్వారసమన్వితంబును, నానాతీర్థగణాకీర్ణంబు నగు శ్రీశైలమునకుంబోయి మల్లికార్జునస్వామి నారాధించి, పిమ్మట



పినాకినీనదిం దాటి సర్వసుపర్వసేవితంబును, నారాయణప్రియావాసంబు నగు వేంకటాచలంబునకుం బోయి యన్నగోత్తుంగమంగళశృంగంబున నుండిన సకలభువనరక్షాదక్షుం డగు శ్రీనివాసు నర్చించి, యయ్యచలశిఖరంబు నవతరించి సిద్ధసాధ్యమునినికరసంసేవితంబును, కుంభసంభవసమానీతంబును, సకలలోకపావనంబు నగు సువర్ణముఖరీనదిం గాంచెను.

మునిశేఖరులారా! యత్కూలమంజులనికుంజపుంజంబుల సిద్ధసాధ్యకిన్నరకింపురుషాంగనలు సుఖంబుగ గ్రీడించుచుందురో, యేనదీతటంబున శీకరాసారశీతలంబు లగు మందమారుతంబులు చల్లగ వీచుచుండునో, యేసరిద్వరం బుత్తుంగతరంగనికరకరంబులచే వియద్గంగానది నాలింగన మొనరించుచుండునో, యేతటినీతటాశ్రమభూము లాహుతిసముద్భవధూమంబులచేతను, తరువరనికరశాఖలనారగట్టుటం జేసి యిటునటు చలించుచు కాషాయదీధితుల దిక్కుల బర్వంజేయు నారచీరలచేతను మనోహరంబులై యుండునో, యత్కూలద్వితయంబున మునివరసురనికరస్థాపితంబు లగునవియై శివంకరంబు లగు శివలింగంబు లనేకంబులుగ బ్రకాశించుచుండునో, యదీయసైకతావాసవిశ్రాంతంబులై విహంగమోత్తమంబులగు మరాళంబులు మానససరోవరంబును మానసమునందైన దలంపకుండునో, యేనదీవరంబు శమితాపగ్రహాతంకంబులును, కుల్యాముఖవినిర్గతంబులు నగు పావనజలంబులచే లోకరక్షాక్షమంబులగు సస్యంబుల నభివృద్ధి నొందించుచుండునో, యేపుణ్యస్రవంతి మనోహరచక్రవాకకుచయై, యుత్తుంగవీచివళీవిభూషితయై, యావర్తనాభిభాసురయై, విపులసైకతశ్రోణిమండలయై, ప్రఫుల్లపద్మవదనయై, చలన్మీనయుగేక్షణయై, విలసత్ఫేనాంబరయై, హంసయానమనోహరయై, జలపక్షిరవాలాపయై, నయనానందకారిణియై, యపూర్వకామినీరూపంబున సముద్రునకు పట్టమహిషియై యుండెనో యట్టి సువర్ణముఖరీనదీమతల్లిం గాంచి సమస్తతీర్థనిరీక్షణసముత్సుకుం డగు

ధనంజయుం డపరిమితామోదంబునొంది యానదీవరంబును నయనానందంబుగ గాంచుచు నాపుణ్యస్రవంతికి ప్రాగ్భాగంబున నుదగ్రశృంగాభోగసముల్లిఖితాంబరతలంబును, కాళహస్తిసమాహ్వయంబు నగు నుత్తుంగనగంబును గాంచెను.

—: ధనంజయుండు సువర్ణముఖరీతటమందలి కాళహస్తీశ్వరాదిదేవతల దర్శించుట :—

అచ్చట మహానదీజలంబుల గ్రుంకి యయ్యచలోత్తమంబున సకలామరనికరసమభ్యర్చితుం డగు శ్రీకాళహస్తీశ్వరు నవలోకించి శ్రద్ధాభక్తిసమన్వితుండై నగేంద్రతనయాసక్తచిత్తుండును, నాగభూషణుండు నగు శ్రీకాళహస్తీశ్వరుని వివిధోపచారంబుల బూజించి యాగిరివరంబున గల్గు నద్భుతవిశేషంబుల దిలకింపదలంచి యందంద దిరుగుచు, నాగిరిసానువులం దబలాసమన్వితులై దేవదేవుని చరితంబుల గాన మొనరించు సిద్ధమిధునంబులం గాంచెను. ఇంకొకయెడ పుష్పాసవపానమత్తులై యప్సరోలలనామణులం గలసి నికుంజంబుల గ్రీడించు గంధర్వవర్యుల గాంచెను. మరొకప్రదేశంబునకు బోవ నందు శివధ్యానపరాయణులై యమందానందసంమోహచిత్తులగు యోగిపుంగవుల దిలకించెను. ఇంకొకవంక బ్రశాంతంబులగు నాశ్రమంబులం గనుగొనెను. బలినీవారశోభితంబులగు మున్యాశ్రమద్వారభూములం జూచెను. నిరాహారులును, వాయుభక్షకులును, జీర్ణపర్ణభోజనులును, ఆతపాశనులును, శాంతులును, నియతేంద్రియులును, వీతరాగులు నగు మునిశేఖరులం జూచెను. ఇక నొకయెడకుం బోవ ఫుల్లసౌగంధికామోదసువాసితదిగంతరంబు లగు కమలాకరంబు లాపురందరనందననయనద్వంద్వంబున కుత్సవంబు గల్పించినయవి. ఇంకొకవంక మృగయాసక్తచిత్తులై విలునమ్ములంగొని శరసంధాన మొనరించి మృగంబుల నెమకుచు నందంద దిరుగుచుండు కిరాతీయుతులగు కిరాతకులం గనుగొనెను.



—: సురరాజనందనుండు సువర్ణముఖరీతీరమందలి భరద్వాజాశ్రమంబునకు బోవుట :—

మరియు నయ్యద్రిరాజ దక్షిణదిగ్భాగంబున దిరుగుచు కదళీనారికేళామ్రకోలతక్కోల చంపక చందనాశోకహింతాలతాలతమాలకృతమాల కేతకీదాడిమజంబూకదంబకతకఖదిరార్జునపాటల నాగపున్నాగసరల దేవదారు కరంజక లవంగలుంగలవలీప్రియంగుతిలకవిభీతకశ్రీఫలాశ్వత్థకపిత్థమధూకప్లక్ష కేసరపూగజంబీరనారంగ నింబామలక కౌశిక ప్రముఖంబు లగు ఫలపుష్పసమాకీర్ణంబు లగు తరువరనికరమనోహరంబును, అపూర్వసౌరభాకృష్టభ్రమరీనినాదముఖరితంబును, వాసంతీకుందజాత్యాదిలతాపరివేష్టితంబును, చక్రవాక బక క్రౌంచహంస కారండవసమాశ్రయంబులై, సౌగంధికోత్పలకల్హారసరసిజకైరవసముదయవిరాజితంబులై మధునిష్యందిమధురంబులగు నీరంబుల భాసురంబు లగు కాసారంబుల కాశ్రయమై యుండునదియు, శోభాసమన్వితంబును, కౌతుకైకనికేతనంబును, సింహ, దంతావళ, వ్యాఘ్రతరక్షురురంకుప్రముఖంబులగు పరస్పరవిరోధిమృగగణంబు లన్యోన్యహితంబుగ మెలగుచుండునదియును, నిర్జితచైత్రరథోద్యానంబును, అతిరమణీయంబు నగు భరద్వాజాశ్రమముం గనుంగొనెను.

ఏయాశ్రమంబున మృదువచోవిభాసురంబులగు శుకంబులు తమ కందువుల కమందానందంబున దివ్యంబులగు శైవాగమములందలి యర్థజాతంబును వినుపించుచుండునో, ఏయాశ్రమమందలి హోమధూమంబు లాకసంబు నావరించి యకాలజలదంబు లనుభ్రమను కల్పించి ఆశ్రమమయూరంబుల నటింపజేయుచుండునో, ఏయాశ్రమంబున విహారవిశ్రాంతంబు లగు మృగేంద్రంబులకు స్వేచ్ఛాసమాగతంబులగు కరీంద్రంబులు నిజకరజలశీకరంబులచే విశ్రాంతి నొసంగుచుండునో యట్టి మున్యాశ్రమముం గనుంగొని విస్మయాక్రాంతమానసుండై పార్థుం డత్తపోధనుల మహిమంబును ప్రశంసించుచు పరిజనంబుల నందంద

నిలువంజేసి భూసురులం గలసి యాశ్రమంబునం బ్రవేశించి యెదుట స్ఫురత్పావకతేజుండును, మునివరనికరపరివేష్టితుండును, భస్మానులిప్తదేహుండును, మృగచర్మోత్తరీయుండునై నవనీరదావృతం బగు కైలాసాచలంబుతీరున బ్రకాశించుచు, ప్రలంబమానంబులై సువర్ణకాంతుల జిమ్ముచుండు జటాకలాపంబుచే స్థిరవిద్యుల్లతాసమాకీర్ణం బగు శారదాంబుదంబుచందంబున డంబుమీఱుచు, శ్రుతిస్మృతిపురాణార్థంబు లన్నియు నేకీభావంబు నొంది మానవాకారంబు నొందెనో యన మించి నిత్యజ్ఞానయుతుండై, ధృతిక్షాంతిదయాపుష్టిశాంతిసంసేవితుండై, యఖండబ్రహ్మతేజోభాసురుం డగు భరద్వాజమునిశేఖరు దరిజేరి సుభద్రాప్రాణనాథుండు తత్పదవనజంబులకు కరసరసిజంబుల జోడించి సమాలింగితభూతలుండై సాష్టాంగదండప్రణామం బాచరింప నాశాపాయుధశిరోమణి పదకంజంబుల వ్రాలిన భూపాలనందనులేవనెత్తి ప్రహృష్టాంతరంగుండై వివిధాశీర్వచనంబు లొనరించి ప్రియాతిథియగు శతక్రతునందను నర్ఘ్యపాద్యాదివిధానంబుల సత్కరించి పవిత్రతమంబగు కుశాసనమం దుపవిష్టుం గావించి కుశలప్రశ్నాదికంబుల నయ్యర్జునుమానసంబు నానందపరవశము గావించెను.

—: భరద్వాజుం డర్జునున కాతిథ్య మొసంగుట :—

పిదప నమ్మునిచంద్రుండు మనంబున కామధేనువుం దలంచునంత లోన నయ్యమరగవియు జనుదెంచి రుచికరంబులగు భక్ష్యభోజ్యాదికంబుల సిద్ధంబు గావించెను. సానుచరుండగు పాండవమధ్యముం డాపదార్థంబుల దృప్తిగ భుజించి మునిసత్తము నుపాసించుచు నాదిన శేషంబును కథాలాపకౌతుకంబున వెడలనడచి, సాయంకాలం బగుడు సంధ్యావందన మొనరిచి,హుతపావకుండై విప్రామాత్యసహితంబుగ మునిశేఖరుని పర్ణశాలకుం బోయి యందాసీనుండై మునిచంద్రు నాశీర్వాదంబుల బడసి సుఖోపవిష్టుండై యుండునంత మనంబున నొకయూహ జనించెను. ఈమహానది యెందుండి యిటకువచ్చెనో, యెవ్వార లేగిరి



వరంబునుండి యిటకు దోడ్తెచ్చిరో యాచరితం బంతయు నీమునివర్యు నడిగి తెలిసికొనవలయు ననియెడు తలంపు వొడముటంజేసి యామునివరు నిటుల బ్రశ్నించెను.

—: ధనంజయుండు సువర్ణముఖరీమహిమంబును వినిపింపుమని భరద్వాజు నడుగుట :—

మునిచంద్రమా ! నీచే పుత్రవిశేషంబుగ నాదరణంబు నొందినకతంబున నాకంటె ధన్యుం డీలోకంబున నెందును గానరాడని గర్వంబు నొందుచుంటిని. భవదాదరసంజాతకౌతుకం బగు నామానసము భవద్వాక్యామృతపానంబునకై త్వరబడుచున్నది. మహాత్మా ! యిమ్మహానది యేనగంబున జనించినయది? ఎవ్వార లీనది నిటకు దోడ్తెచ్చిరి ? ఇందు స్నానాదిక్రియల నొనరింప నెట్టిఫల మబ్బును ? ఈచరితం బంతయు దాసుండ నగు నాయందు దయయుంచి వినుపింపుమను పలుకు లాలించి యింద్రనందనుముఖము నవలోకించుచు నిటులనెను. అర్జునా! నీవు కురుకులపావనుండవు. ధర్మనందనసహోదరుండవగుటంజేసి మాకెంతయు మాననీయుండవు. ఆర్జవధైర్యాదార్యదయాగాంభీర్యంబుల నీకెనయగువా డొకరుండును గానరాడు. కులంబును, విద్యయు, ధనంబును మానవులకు మదకారణంబులు. నీకవియన్నియు వినయకారణములై యున్నవి. పూజ్యమగు రాజ్యంబు సకలభోగంబుల ననుభవింపదగినదై యుండ నించుకయు గర్వంబు నొందక జరించు నీకంటె ధన్యుడింకొకరుండు గానరాడు. లోకోత్తరంబు లగు నీగుణంబుల వలన నీకు వశుండనై యుంటిని. కౌతుకాయత్తచిత్తుండ వగు నీకు వినుపింపరాని దేదియైన గలదే! ఏపుణ్యకథ నాలకించినవారలు దురిత నికరంబును వీడి సుఖించెదరో యట్టి దివ్యంబును, మునిముఖవినిర్గతంబు నగు నొకకథను వినుపించెద వినుము.

—: భరద్వాజకథిత శంకరవివాహవృత్తాంతము :—

తొల్లి దాక్షాయణీదేవి జనకునివలన దిరస్కృతయై శరీరంబును

విడిచి గిరివరుండగు హిమవంతునకు తనూజయై జనించెను. సప్తమహర్షులు నానగరాజు దరిజేరి గిరీంద్రా! నీతనూజాత యగు పార్వతిని జగదారాధ్యుం డగు మహాదేవున కొసంగి వివాహ మొనరింపు మని ప్రార్థింప, నాధరణీధరవరుండందుల కంగీకరించెను వృషభవాహను డాసర్వమంగళను వివాహమాడుటకు పయనమై యోషధీప్రస్థం బను నామంబున బ్రకాశించు నన్నగరాజపురంబునం బ్రవేశింప, నాశంకరాజ్ఞానుసారంబున స్థావరజంగమాత్మకంబులగు భూతము లన్నియు భూతనాథుని వివాహముం గనుగొను వేడుక నాపురంబునకు వెడలెను.

ఆసమయంబున నయ్యుత్తరభూభాగం బంతయు భూరిభారసంభగ్నమై కుంగి పాతాళము నొందుచుండెను. భారవిహీనంబగుట దక్షిణదిగ్భాగంబంతయు నూర్ధ్వలోకంబుల గనబోవుచుండెను ఆవైపరీత్యముం గాంచి పెండ్లికై జనుదెంచినవార లందరును భయాకులచిత్తులై మొరలిడజొచ్చిరి. మహేశ్వరుం డాభూతలవికృతిం గనుంగొని తపోధనసత్తముండగు కుంభసంభవు నవలోకించి మహాత్మా! యిటు రమ్మని చెంతకు జేరంజీరి యిటులనెను. పరిణయాలోకనకౌతుకంబున భూతసంచయ మంతయు నిటకు వచ్చుటంజేసి యియ్యుత్తరభూభాగ మంతయు పాతాళమునం బ్రవేశించుచున్నట్లున్నది. భూమండలమును సమభావంబుగ నిలుప నీవె సమర్థుండవు. ఇతరుల కియ్యది సాధ్యము కాదు. వత్సా! నీవు నా తేజంబున బుట్టినవాడవు. అందున లోకరక్షణదక్షుండవైతివి. శీఘ్రంబుగ నీవీభూమిని సమీకరణంబు గావింపుము. నాదగు పాణిగ్రహణమహోత్సవముం గన నందరు నిట నుండ నీవుకూడ నిటనుండుట యుక్తమే. కాని నీవాదక్షిణదిగ్భాగంబున లేకున్న నీభూమి తలక్రిందు లగును. ఈవికృతిని మాన్ప నితరు లోపరు. త్వరితంబుగ బొమ్ము. నీవెందున్నను పార్వతీపరిగ్రహణ మహోత్సవంబు నీకనులయెదుట నీవు కనుగొనునటు లొనరించెద. నాలసింపకు మని వచించి యమ్ముని శేఖరు నాలింగనముం గావించుకొని రయమ్మున పొమ్మని విడిచెను.



—: అగస్త్యమునీంద్రుండు భూసామ్యకారణంబున
హిమనగంబునుండి దక్షిణదిశకు బోవుట :—

అగస్త్యుం డాప్రమథాధినాథుని వచనానుసారంబుగ నాక్షణంబుననే బయలువెడలి వింధ్యాద్రి నతిక్రమించి యింకను కొంచెము దక్షిణముగ బోవునంత నియ్యవనీతలంబు సామ్యంబు నొందెను. భూవికారంబును మాన్పిన కలశసంభవుని సురగరుడోరగ కిన్నరాదు లందరును సంతోషితస్వాంతులై వివిధవిధంబుల నుతించిరి. పిమ్మట నామునిశేఖరుం డించుక యామ్యదిశకుం బోయి వితతపాదపసమన్వితంబును, మహౌషధీనిలయంబును, మణిగణంబుల కాకరంబును, తేజంబుల కాలయంబునై యత్యుదారధారాసంపన్నంబులగు శిఖరంబు లనేకంబులు గల్గి రాజిలు నొక యచలంబు నవలోకించి మెలమెల్లన నాశైలం బధిరోహించి మనోహరంబగు నయ్యద్రిశిఖరంబున వసియింప నిశ్చయించి యన్నగశృంగంబున పద్మోత్పలమండితంబును, వివిధతరువరవిసరపరివృతంబును, స్వాదుజలసంపన్నంబు నగు నొక కాసారముం గాంచి దాని కుత్తరతటంబునం దాశ్రమంబు నేర్పరచి విధివిధానంబున పితృదేవర్షుల నారాధించి, వాస్తుపూజం గావించి మునిగణావృతుండై సిద్ధగంధర్వాప్సరస్సంఘసమాకీర్ణం బగు నమ్మహేంద్రంబున నివాసంబుగ నుండెను. కుంభసంభవుం డిట్లు తపస్సమావేశచిత్తుండై యందు వసియించిన కారణంబున నయ్యద్రివరం బగస్త్యాచలం బను నామంబున బ్రసిద్ధి నొందెను.

—: నద్యుత్పాదనంబునకై కుంభసంభవుని కాకాశవాణి
వచించిన వాక్యములు :—

కుంభసంభవుం డొకదినంబున పూర్వాహ్నకకృత్యంబుల నిర్వర్తించి శంకరారాధనంబునకై దేవతాగారంబున బ్రవేశించి యుండెను. అంత నవ్యక్తవర్ణసముజ్జ్వలంబును, మృదుమధురంబునగు నాకాశవాణి విన నయ్యెను. మునిసత్తమా! నదీహీనం బగు నీప్రదేశ మెంతయు

మనోహరమయ్యు జ్ఞానహీనుండగు భూసురునిచందంబున శోభ నొంద కుండెను. దక్షిణాహీనం బగు యాగదీక్షవలెను, చంద్రికావిరహితం బగు శర్వరియుం బోలె బ్రకాశింపకున్నయది. కాన నో మహీదేవోత్తమా! లోకహితంబునకై దురంతదురితభయవినాశనకారిణి యగు నొక నది నిట బ్రవహింపజేయుము. సమస్తభూతవ్రాతంబున కయ్యది యుపకారిణియై యుండును. సర్వలోకహితావహంబును, సర్వజనసమ్మతంబునగు నది నెందుండియైన నిటకు దోడ్తెమ్ము. తెమ్ము తెమ్మని యెడు నశరీరవాణి నాలించి యొక క్షణమాత్రము చింతాకులస్వాంతుండై దేవపూజ నొనరించినపిదప నాశ్రమబహిర్వేదికపై గూరుచుండి యయ్యాశ్రమవాసులగు మునుల నందర న్బిలిచి వారల కాదివ్యవాణీరితంబులగు వచనంబుల వినుపింప నయ్యద్భుతవచనంబుల నాలకించి మునులందరును సంప్రహృష్టమానసులై వందనంబు లాచరించి మైత్రావరుణి కిట్టులనిరి.

మునీంద్రా! ఆశ్చర్యంబు లన్నిట నత్యాశ్చర్యంబును, మంగళంబు లన్నిట నత్యంతమంగళంబు నగు నీచరితంబున కీభువనత్రయంబున సాటి వేరొండులేదు. నీవొనరించిన హుంకారమాత్రంబున నహుషుం డమరపురీవరంబగు నమరావతినుండి ధరణికి వ్రాలి కాలాహియయ్యెను. సమావృతధరాచక్రంబును, తరంగశీకరార్ద్రీకృతాంబరంబు నగు సాగరంబు నాచమించితివి. సూర్యగమనంబున కడ్డుతవిలిన వింధ్యనగంబును గర్వభంగ మొనరిచి నేల కొరగునటు లొనరించితివి. నీయద్భుతకర్మంబుల నభివర్ణింప సమర్థు లేలోకంబునందైన గలరే! మాయదృష్టవశంబున నిన్ను గలసి యియ్యాశ్రమంబునవసింపుచుంటిమి.

సమస్తవస్తుసంపూర్ణంబయ్యు నీనగవరంబు నదీహీనంబగుటం జేసి శోభింపదయ్యెను. అలబ్ధపావననదీజలస్నానవిహీనంబు లగు మాజన్మంబులు వ్యర్థంబులు గాకుండునే! పుణ్యనదీవిరహితం బగు దేశంబున వసించుటకంటె భూమిపై బుట్టకుండుటయే మేలని తలంచుచుంటిమి.



మహాత్మా! యేనాడు మేమీనగవరంబున పావననదీజలస్నాన మొనరిచి ధన్యుల మగుదుమోగదా? వేయిమాటలేల. మునివరా! పవిత్రజలహృద్యం బగు నొక సరిద్వరంబు నిటకు రప్పింప నీకంటె సమర్థు లెవరును గానరారు. తగు ప్రయత్న మొనరింపు మను తోడియోగిపుంగవుల పలుకుల నాలకించి, మునులారా! మీయభిప్రాయాను సారంబుగ దప్పక ప్రయత్న మొనరించి యొక పుణ్యనది నిటకు రావించెద నని వచించి దృఢనిశ్చయుండై మునినికరాభ్యనుజ్ఞాతుండై యిష్టదైవంబుల బూజించి త్రిపురసంహారకుండగు హరునకు విధ్యుక్తంబుగ విశేషార్చన మొనరించి బహుక్లేశదుస్సహం బగు గాఢవ్రతము నంగీకరించి యనన్యసులభంబగు తపం బొనరించెను.

— : సువర్ణముఖర్యావిర్భావంబునకై యగస్త్యమహర్షి గావించిన తపఃప్రకారవర్ణనము : —

అర్జునా! కుంభసంభవుం డొనరించిన తపఃప్రకారంబును వినుము. అసహ్యాతపభయంకరంబు లగు గ్రీష్మదివసంబుల నలుగెలంకుల జ్వాలామాలికాకరాళంబులగు నగ్నులమధ్య నిలువంబడి చూపు నర్కునియందు నిలిపియు, వార్షికదినంబులందు మహోగ్రవాయుసంపాతదుస్సహంబులగు ధారావర్షంబులచే తాడ్యమానుండగుచును, హేమంతసమయంబున గంఠదఘ్నంబులగు జలంబుల నిలిచియు జపధ్యానపరాయణుండై యించుకయు వికృతి నొందకుండెను. ఇట్టు లెంత కాలము తపం బొనరించినను తలంచిన కార్యం బనుకూలింపక విలంబనం బగుడు వెండియు లోకభయంకరంబును గాఢతరం బగు నియమవలంబించి మనోవృత్తుల నిగ్రహించి నిరాహారుండై యింద్రియగ్రామంబును జయించి బహిర్వ్యాపారంబు నెరుంగక కేవల మొక పాషాణంబు తెరంగున నుండి తపం బొనరించుచుండెను.

ఇట్టుల తపం బొనరించుచు మునిశేఖరుని సర్వావయవంబులనుండి జ్వాలామాలికల బర్వం జేయుచు వైశ్వానరుండు భయంకరంబుగ

బయలు వెడలెను. అయ్యగ్నిశిఖాజాలంబు లన్నిదిశలను వ్యాపింప జను లందరును సముదగ్రభయోద్విగ్నమానసులై మొరలిడుచుండిరి. ఆజగత్సంక్షోభముం గాంచి దేవత లందరు నొక్కుమ్మడిగ కమలాసను దరి జేరి తత్పదవనజంబుల సాగిలి మ్రొక్కి యగస్త్యతపఃప్రభావంబును విన్నవింప చతురాననుం డయ్యమరుల దిగులువాన్పి, సిద్ధనికరపరివేష్టితుండై దారుణతపశ్చర్యాసక్తుండగు కుంభసంభవు నగ్రభాగంబున బ్రత్యక్షమయ్యెను.

—: చతురాననుం డగస్త్యాశ్రమమునకుం బోవుట :—

మునీంద్రుండు నాచతుర్ముఖునిం గాంచి వందన మొనరించి వివిధంబులగు నుతు లొనరించి ప్రహృష్టాంతరాత్ముని గావించెను. వినమితకంధరుండై యెదుట నిలువంబడిన మైత్రావరుణిం గాంచి ప్రసాద సుముఖుండై చతుర్ముఖుం డిటులనెను. మునివరా! నీవు తపోనిష్ఠాగరిష్ఠుల నగ్రగణ్యుండవు. నీవొనరించిన తపశ్చర్య కెంతయు సంతోసమయ్యెను. నీవెందులకై యిట్టి దారుణతపం బొనరింపగడంగితివో వచింపుము. తప్పక నీయభీష్టంబును నెరవేర్చెద నన, నయ్యగస్త్యముని యిటులనెను. మరాళవాహనా! నీయనుగ్రహంబున నాకెందును కొరంతలేదు. కాని నాకోరిన వరంబును నిస్సంశయంబుగ దీర్తునటు లేని నాయభీష్టంబును వినుపింతు నన, హిరణ్యగర్భుండును ముమ్మాటికి నీకోరిక నెరవేర్చెద ననుటయు నమ్మునిచంద్రుం డిటులనెను.

పుణ్యానదీవిహీనంబగు నీప్రదేశముం గాంచుచుండు నామనం బత్యంతదుఃఖాక్రాంతం బగుచున్నది. అర్థావబోధరహితం బగు వేదపఠనంబువలె పుణ్యానదీవిరహితం బగు నీదేశము ప్రకాశింపకుండెను. నాకోరిన వరంబు నొసంగ నిచ్ఛ గలదేని పావనజలవిభాసితంబగు నొక సరిద్వరంబు నిట బ్రవహించునటు లొనరింపుమనుటయు నళినసంభవుండు మనంబునం దాకాశగంగను దలంచెను.



—: అగస్త్యప్రార్థనంబునంగీకరించి యాపరమేష్ఠి గంగను ప్రేరేపించుట :—

ఆహా! మహాత్ముల మహిమంబు లనూహ్యంబులుగదా! విరించిసంస్మరించినంతలోన నవ్వియద్గంగ పరమేష్ఠి. పురోభాగంబున ముకుటవిన్యస్త ప్రశస్తాంజలిభాసురయై నిలిచెను. నిజశాసనంబు నతిక్రమింపక జను దెంచి వినయానతమస్తకయై నిలిచిన సకలజగద్ధాత్రియగు నాకాశగంగ నవలోకించి యవ్విరించి యిటులనెను. సకలభువనపావనీ! గంగామతల్లీ! పుణ్యానదీరహితం బగు నీదేశంబున సకలలోకహితార్థంబుగ నిందొక సరిద్వరంబును ప్రవహింపజేయుమని కలశజుండు కోరుచున్నవాడు. నీవిపుడ ధరణి కవతరించి నీదగు నొక యంశంబున నీమునిచంద్రుం డనుసరించిన మార్గంబున బ్రవహించి ధరాతలగతులగు జనుల బవిత్రుల గావింపుము. మునిశేఖరులును, సిద్ధసాధ్యకిన్నరకింపురుషాదులును సర్వకాలంబుల నిను సేవింపుచుందురు. నదు లన్నిట నుత్తమం బని ప్రఖ్యాతిగాంచి నిన్నాశ్రయించినవారల రక్షింపుచుండుము. ఈకుంభసంభవునకు ప్రియం బొనగూర్పుము. నాపలుకుల నన్యథా దలంపకుము. నీపావనజలంబుల మున్కలిడినవారల కలుషంబుల బాపి వారల కామితంబుల దీర్చుచుండు మని పల్కి కుంభసంభవుండును, వియద్గంగయు గావించిన పూజానమస్కారంబుల గైకొని చతురాననుం డంతర్ధానంబునొందెను.

పిమ్మట నాగంగాదేవి మునిపతి పురోభాగంబున స్వాంశసంభవయు, దివ్యతేజోవిరాజితయు నగు నొక మూర్తిం గనుపరచి యిటులనెను. మునిసత్తమా! వీని నాయంశంబుగా నెరుంగుము. ఇయ్యది నదీరూపంబు నొంది నీయభీష్టంబును నెరవేర్చగలదు. సందియ మొందకు మని వచించి వియద్గంగ తిరోధానంబు నొందెను. అంతలోన నాకాశగంగాంశసంజాతయగు నాసరిద్వరం బయ్యగస్త్యమునిం గాంచి మునిసత్తమా! నేనేమార్గంబున బోవలయు నని యడుగ,

నమ్మునిసార్వభౌముం డిటులనెను. కల్యాణీ! ముందుగ నే నడచుచుందును. నన్ననుసరించి నీవును నడువు మన నటుల నొనరించెద నని యాసరిద్వరంబు నందుల కంగీకరించెను. పిమ్మట నామునిశేఖరుండు ప్రముదితమానసుండై యానగరాజశిఖరమునుండి దిగి నది ప్రవహించుటకు తగు మార్గంబును జూపుచు ముందు నడచుచుండ, వెనుక నాసరిత్తు ప్రవహించుచుండెను.

—: సువర్ణముఖరిని పురందరాది బృందారకులు నుతించుట :—

కుంతీనందనా! ఆసమయంబున దివ్యవిమానారూఢులై పురందరాది బృందారకు లందరును కలశజు ననుసరించి నడుచుచుండు నది ననుసరించి పోవుచుండిరి. మునివరు లందరును నవావతారిణి యగు దివ్యనదిం గాంచి కృతాంజలులై నుతులొనరించుచు వచ్చుచుండిరి. సిద్ధచారణగంధర్వాదు లందరును గుమిగూడి యాస్రవంతిని, మునిశేఖరునింగూడ ననేకరీతుల బ్రశంసించుచుండిరి. భూతలమందలి జను లందరును నిర్మలమై, యమృతోపమానమై యుండు నుదకము లభించుటంజేసి కౌతుకాయత్తచిత్తులై మహానందసాగరంబున నోలలాడుచుండిరి.

—: వాయుకథిత సువర్ణముఖరీనామనిష్పత్తి :—

అపుడు కమలాసననిదేశంబున పవనుం డమరులందరు వినుచుండ నిటులనెను. సువర్ణంబువలె లోకులందరకును భాగధేయమై ముఖరీకృతదిఙ్ముఖమై యీనదీవరంబు భూతలంబున కయ్యగస్త్యమునిచే గొనిరాబడినదిగాన సకలలోకాభినందితవైభవసమన్వితమై, కైవల్యనిలయమై సువర్ణముఖరి యను నామంబున బ్రఖ్యాతి నొందగలదనియు, ఈసువర్ణముఖరీనది నదు లన్నిట నుత్తమం బనియు నమరులకును, మానవులకును సేవింపదగినదనియు చతురాననుండు వచించె నని యెడు పవమానుని పలుకుల నాలించి కలశజుండు విస్మయాక్రాంతచిత్తుండై, పులకీకృతాంగుండై యమందానందంబు నొంది యిటులనెను.



—: అగస్త్యుండు తా దోడ్తెచ్చిన సువర్ణముఖరీ మహిమంబును వర్ణించుట :—

ఈమహానది స్నానపానాదికంబులచే మానవులకు సౌఖ్యావహమై భూమండలంబున మిగుల ప్రఖ్యాతి నొందగలదు. చతుర్ముఖాజ్ఞానుసారంబుగ వియద్గంగ సువర్ణముఖరీనామంబున భూమి కవతరించి తన్నాశ్రయించినవారల పూతుల గావింపగలదని నుడివెను. ధనంజయా! వివిధనగంబులను, దుర్గమంబులను, కాంతారంబులను మరియు ననేకంబులగు జనపదంబులను క్రమక్రమంబుగ నతిక్రమించి వివిధశిలోచ్చయసంభవంబులగు ననేకనదులం గలసి, రోగపీడితులు, నధికాతురులు నగువారల కనానుమైకప్రీతిపాదకంబులును, అంతస్తాపబహిస్తాపనివారకంబులును, ప్రియకరంబులును, భ్రమరభాగ్యైకనికేతనంబులును, సౌరభసంవాసితదిగంతంబులు నగు సరసిజకైరవసౌగంధికాది శోభితంబులును, జలక్రీడాగతసురసుందరీసీమంతసంక్రాంతసిందూరరజోరుణంబులును, అమరనితంబినీకేశపాశచ్యుత పారిజాతసుమగంధాదివాసితంబులును, మంగళాయతనంబులును, మధురంబులును, నిర్మలంబులును, పాపప్రశమనకారణంబులు, నమృతోపమానంబులు నగు సలిలంబుల భాసిలుచు, జలవిహారాయాత మదమాతంగతుండాదండాఘాతసముద్భూతబిందుసందోహంబుచే ప్రభాకరునకు సంతతంబున బుష్పోపహార మొసగుచుండు నదివలె గనుపించుచు నానది యగస్త్యశైలంబున బుట్టి కుంభసంభవునిచే భూమికి దేబడి యనేకతీర్థంబులం గూడి దక్షిణసాగరంబున బ్రవేశించెను.

ఆసరిత్పతియు దనకై వచ్చెడు నదీమతల్లిం గాంచి శీకరాక్షతవిన్యాసంబులతోడను, రత్నదీపహారములతోడను ఎదురేగి యుత్తుంగతరంగహస్తంబుల నాలింగనంబు గావించుకొని యాఘోషభాషణంబుల నెంతేని ప్రియంబు గల్పించెను. తన కనుకూలవతి యగు ప్రేయురాలు లభించుటంజేసి యాసముద్రుని జీవనం బభివృద్ధి నొందెను. ఇటు

లానది సముద్రినిం గలియ గృతకృత్యుండై కుంభసంభవుం డాసరిత్సరి త్పతుల ననుజ్ఞం గొని నిజాశ్రమమునకుం బోయెనన విని పురుహూత నందనుం డాభరద్వాజముని కిట్లనెను.

—: భరద్వాజవర్ణితసువర్ణముఖరీమాహాత్మ్యము :—

భూసురోత్తమా! మహానదీసముద్భవంబును వినుపించితివి, దయయుంచి, యీనదీప్రభావంబునుగూడ సవిస్తరంబుగ దెల్పు మన, భరద్వాజుం డిట్లు వచించెను.

ధనంజయా! సర్వశ్రేయస్కారణం బగు సువర్ణముఖరీమహిమంబును వినుము. ఉత్తమం బగు మానవజన్మంబు నొంది జ్ఞానులగువారలకు సువర్ణముఖరీస్నానము లభించును. ఏమానవుండు నూఱామడల దూరంబుననుండియు సువర్ణముఖరీనదిని తలంచునో యామానవుండు సర్వపాప వినిర్ముక్తుం డగును. సువర్ణముఖరీజలంబున నిక్షిప్తంబులగు నస్థికలు బ్రహ్మలోకాధిరోహణంబునకు సోపానంబు లగును. మానవు లితరనదీజలంబుల మున్గుచు సువర్ణముఖరిని తలంతు రేని వారల కత్యుత్తమఫలము సిద్ధించును. సువర్ణముఖరీనదీస్నానము లభించునంతదనుక పాపములు పీడించును. ఆనదీస్నానము లభించెనేని కలుషము లన్నియు వీడిపోవును. దివ్యాంతరిక్షభౌమంబులగు తీర్థములన్నియు ప్రతిదినంబునను ప్రాతఃకాలంబున సువర్ణముఖరీనదిని స్మరించుచుండును. అగస్త్యాచలంబున బుట్టు దక్షిణసాగరంబునం గలసి స్వర్ణముఖరీనామంబున ప్రసిద్ధి నొందిన యీమహానది తలంచినంత మాత్రంబున పాపసముదయంబును నాశన మొనరించును. సువర్ణముఖరీస్నానము నాశించి, సురసిద్ధగంధర్వకిన్నరకింపురుషాదు లందరును మానవలోకంబున బుట్టువు నొందదలంచుచుందురు. సువర్ణముఖరీతోయంబుల నభివృద్ధింగాంచిన సస్యంబులవలన ఫలించిన ధాన్యాదుల ననుభవించిన మనుజులు దుష్టాన్నభోజనంబున సంభవించిన మహాదోషంబు నొందకుందురు. పాన మొనరింపబడిన సువర్ణముఖరీజలం



బులు దేహధారుల కలుషంబులను రయమ్మున ధ్వంస మొనరించును. మానవజన్మంబు నొందియు సువర్ణముఖరీస్నాన మొనరింపని మానవుని జన్మము నిరర్థకంబని యెఱుంగనగును.

సువర్ణముఖరీస్నానం బొకటియును, భాగీరథీజలావగాహానంబులు కోటియును సమంబులగును. దేవతలందు గోవిందునివలె, తారకంబుల శశాంకునిరీతి, మానవులందు భూపాలునిచందంబున, భూరుహంబుల గల్పకంబుభాతి, పంచభూతంబుల నాకసంబురీతి, నిఖిలశక్తులందు మాయ తెఱంగున, మంత్రంబు లన్నిట గాయత్రిమంత్రంబురూపున, సమస్తాయుధంబుల వజ్రాయుధంబు చాడ్పున, తత్త్వంబులం దాత్మతత్త్వంబువడువున, యజుస్సులందు రుద్రాధ్యాయంబుభంగి, భోగివరులం దనంతుని మహిమంబున, నగము లన్నిట హిమనగంబుభాతి, క్షేత్రంబుల వరాహక్షేత్రంబుతీరున, ఇంద్రియంబు లన్నిట మానసంబురీతి, నదులన్నిటియందును సువర్ణముఖరీనదియే పావనమై యత్యుత్తమంబై యున్నది పవిత్రతను, క్షేమారోగ్యంబులను, సుఖంబును గోరెడువారలు ప్రతిదినంబునను మంగళాలయ యగు సువర్ణముఖరీనదిని స్మరించి నుతించుచుండవలయును.

శ్లో॥ అగస్త్యాచలసంభూతాం దక్షిణోదధిగామినీం।
సమస్తపాపహంత్రీం త్వాం సువర్ణముఖరీం శ్రయే॥
మహాపాతకవిప్లుష్టం గాత్రం మమ తవోదకైః।
క్షాళయామి జగద్ధాత్రి! శ్రేయసా యోజయస్వ మామ్॥

అను సూక్తద్వయంబు నుచ్చరించి నియమపూర్వకంబుగ సువర్ణముఖరీజలంబులం దవగాహన మొనరించి పరిశుద్ధుండై పరమానందంబు నొందగలడు. ముందుగ కమలసంభవునిచే సృజింపంబడి, పిమ్మట కుంభసంభవునిచే సమాహృతయై మందాకినీరూపం బగు సువర్ణముఖరీనది శుభార్థు లగువారలచే గీర్తనీయం బగు ప్రభావము నొందియున్నది. శుభంబును గోరువార లీనదీజలంబున స్నాన మొనరింపవలయును.

సోమసూర్యోపరాగంబులందు సువర్ణముఖరీస్నాన మొనరించి గావించిన దానంబు లమేయఫలయుక్తంబు లగును. రవిసంక్రమణసమయంబులను, వ్యతీపాతయోగంబులను గావించిన సువర్ణముఖరీస్నానము కోటికులంబుల నుద్ధరింపగలదు. జన్మనక్షత్రంబునను, జన్మదినంబునను సువర్ణముఖరీజలంబుల విధివిధానంబున స్నాన మొనరించిన పుణ్యాత్ముండు క్షేమారోగ్యసుఖసంపదల నొందగలండు. దుస్స్వప్నదోషంబులును, కార్యవిఘ్నంబులును, దుస్థానస్థితరవ్యాదిగ్రహదోషంబులును, భూతప్రేతపిశాచపీడలును సువర్ణముఖరీస్నానంబున శమించును. సువర్ణముఖరీతీరంబున గోష్పాదపరిమితం బగు భూమిని దాన మొసంగిన వారలు భూమండలమునంతను దాన మొసగిన ఫలము నొందగలరు.

ఆనదీజలంబున గోవును దివ్యాంబరభూషణాదులచే నలంకరించి దాన మొనరించినవారలు సత్యలోకంబున వసింపగలరు. ఇహాముత్రఫలావాప్తికై సువర్ణముఖరీతటంబున వివిధంబు లగు దానంబుల నొనరింపవలయును. సువర్ణముఖరీతటంబున గావించిన జపతపంబులును, హోమంబులును, పితృకర్మయు, సురార్చనయు నూరురెట్లధికఫలదంబు లగును. పృథానందనా! సుఖభోగంబుల ననుభవింపదలంచువారలు ప్రతివత్సరంబునను సువర్ణముఖరీతటంబున గావింపదగిన యత్యుత్తమవ్రతంబును వినుము. వర్షాకాలంబున దినకరకరనికరంబులచే తిరోధానంబు నొందిన మిత్రావరుణనందనుం డేనా డుదయంబు నొందునో యానాడు నియతేంద్రియులై యానదియందు స్నాన మొనరించువార లొకకల్పంబు గతించుదనుక సురసదనంబునం దఖండభోగంబు లనుభవించుచు నివసింపగలరు.

మరియు నద్దివసంబున నగస్త్యప్రతిమను సువర్ణంబున జేయించి విధ్యుక్తంబుగ భూసురోత్తమునకు దాన మొసంగినవారలు శాశ్వతం బగు బ్రహ్మలోకంబు నొందగలరన విని పురందరనందనుం డిటులనెను. భూసురశేఖరా! నీవిపుడు వినుపించిన వ్రతం బెటు లొనరింపవలయును?



దాని విధానం బెట్టిదియో దయయుంచి విశదంబుగ దెల్పుమన, భరద్వాజుం డిటు వచించెను.

—: అగస్త్యప్రతిమాదానవిధానము :—

శ్వేతవాహనా! అగస్త్యోదయదినంబును తెలిసికొని నియతమానసుండై శక్త్యనుసారంబుగ సువర్ణంబుచే భాసురాకారంబును, జటాబంధమనోహరంబును, కరకమలకృతజపమాలాకమండలువిరాజితంబును, మృదులవల్కలధరంబును, మృగచర్మోత్తరీయంబును, భస్మాంకరుచిరంబును, రుద్రాక్షమాలాలంకృతంబును, సౌమ్యంబు నగు నగస్త్యప్రతిమను చేయించి సువర్ణముఖరీతోయంబుల నవగాహన మొనరిచి, యాచార్యుని గంధపుష్పాదులచే యథావిధిగ బూజించి, యాప్రతిమ నాఢకపరిమితతండులములపై నుంచి, వస్త్రయుగ్మంబు నర్పించి, ప్రతిమాపూజనంబును యథావిధిగ నొనరిచి-

శ్లో॥ వింధ్యసంస్తంభనో వార్ధి చులకీకృత పేశలః ।
బ్రహ్మదిసర్వదేవానాం తేజసా సుప్రకాశితః ॥
అగస్త్యకుంభసంభూతో దేవాసురనమస్కృతః ।
ప్రీతి మాప్నోతు మహతీం దానే నానేన మే ప్రభుః ॥

అను మంత్రము నుచ్చరించి దక్షిణాసమన్వితంబుగ ప్రతిమాదానంబును ధారాదత్తము గావించి సకలకలుషంబుల బాసి, సనాతనం బగు బ్రహ్మలోకంబు నొందగలరు. జన్మాంతరకృతంబులును, ఇహజన్మకృతంబులు నగు మహాపాతకోపపాతకంబు లన్నియు నాశ మొందును. బ్రహ్మాది దేవతలును, సనకసనందనాది మహాయోగిపుంగవులును, చరాచరంబులగు సమస్తభూతంబులును సంప్రీతినొందును. అగస్త్యమునిసంప్రీతికై యీవ్రత మాచరించి యథాశక్తిగ బ్రాహ్మణులకు భోజనము బెట్టి దక్షిణాతాంబూలాదుల సత్కరింపవలెను.

ఫల్గునా! యీవ్రత మాచరింప సమర్థత లేకుండిన నయ్యగస్త్యోదయదినంబును వ్యర్థము గానీయక బ్రయత్నపూర్వకంబుగ దన

శక్తి ననుసరించి యే తెరంగుననైనను శ్రద్ధాభక్తిసమన్వితుండై యాచరిత మాచరింపవలయును. కుంతీనందనా! కుంభసంభవపరిపక్వతపఃఫలం బగు సువర్ణముఖరీనది సురాసురు లందరిచేతను గొనియాడతగినదై యున్నది. మహానదీసముద్భవంబును, తత్ప్రభావంబును వింటివి. ఇక నేమి వినుట కిచ్ఛయించుచుంటివన, నర్జునుం డిటులనెను.

—: అగస్త్యతీర్థాగస్త్యేశ్వరప్రభావవర్ణనము :—

మునివర్యా! కర్ణాంజలులచే భవద్వాక్యామృతం బెంతగ గ్రోలినను నాచిత్తంబు తృప్తి నొందకున్నది. నీపలుకుల విన నిచ్ఛయించుచుండిన నాపయిం బరిపూర్ణకరుణాకటాక్షంబులం బరపి మనఃక్లేశంబు నొందక నాసంశయంబులం దీర్చి యానందకలితునిగా జేయుము. మహాత్మా! యిమ్మహానదియం దెచ్చటెచ్చట నేమహాతీర్థంబు లున్నవియో, యిమ్మహానదితో గలసిన నదు లెవ్వియో, యేప్రదేశంబున స్నాన మొనరింప నేయేకలుషంబులు నాశ మొంది యేమిఫలంబు సిద్ధించునో, యాతటినీతటద్వయంబున నెందెందు హరిహరాది దేవతాయతనంబులు భాసించుచుండెనో, యే యే క్షేత్రంబుల గావించిన స్నానదానాది శుభకర్మంబుల నేమేమి ఫలము గల్గునో నీవెరింగినవాడ వగుటంజేసి విన నుత్సుకుండ నగు నాకు విశదంబుగ దెల్పుమన, నమ్మునిచంద్రుం డిటు వచించెను. ధనంజయా! యగస్త్యతీర్థం బాదిగ నీనదీతీర్థవైభవంబును వివరించి వినుపించెద వినుము—

అఖండజ్ఞానగూపుండును, సకలలోకహితైషియు, సురాసురసంభావ్యుండు నగు కుంభసంభవుండు తద్ధరాధరంబునుండి ముందుగ నెయ్యెడకు సువర్ణముఖరీనదిం దోడ్తెచ్చెనో, యెచ్చోట స్నాన మొనరించినవారలు కృతార్థు లయ్యెదరో యయ్యది పావనం బగు నగస్త్యతీర్థం బని ముల్లోకంబుల బ్రసిద్ధి నొందియున్నది. అందలి స్నానమాత్రంబున మహాపాతకసమన్వితులగువార లందరును పరిశుద్ధి నొందగలరు. మరియు నందు స్నానరతు లగుజను లనేకజన్మార్జితంబు లగు కలుషంబుల బాసి సుఖింతురు. ఏనరులు నియతేంద్రియులై యగస్త్యతీర్థంబున స్నాన మొనరిచి గోభూతిలహిరణ్యాదిదానము లొనరింతురో వారలు గంగాద్వారంబున సమాహితచిత్తులై గావించిన దానంబుల లభించు ఫలముకంటె నూరురెట్లధికఫలంబు నొందగలరు. ఆప్రదేశంబున కుంభసంభవునిచే బ్రతిష్ఠింపంబడిన యగస్త్యేశ్వరుం డను నామంబున బ్రసిద్ధివడసిన భవానీవల్లభుండు కలండు. అగస్త్యతీర్థంబున స్నాన మాచరించి యగస్త్యేశ్వరలింగము నర్చించినవారలు దశాశ్వమేధఫలము నొందగలరు.

—: సువర్ణముఖరీస్నానకాలనిర్ణయము :—

భాస్కరుండు ధనూరాశిని విడిచి మకరరాశిం బ్రవేశింపనయ్యది యుత్తరాయణం బనం బరగు. అట్టి మకరసంక్రమణదినంబున నియతులై సుసమాహితచిత్తులై సువర్ణముఖరీనదీస్నాన మొనరిచి సకలామరనికరసమర్చితుండు, నగజామనోహరుండు నగు నగస్త్యేశ్వరు నర్చించినవార లగ్నిష్టోమసహస్రంబునను, హయమేధశతంబునను లభించు ఫలము నొందగలరు. మకరసంక్రమణకాలంబున శుభంబు నాశించువార లందరు నయ్యగస్త్యేశ్వరదర్శన మొనరింపవలయును.

—: దేవర్షిపితృతీర్థమాహాత్మ్యము :—

అయ్యగస్త్యేశ్వరతీర్థంబున కీశాన్యదిగ్భాగంబున నొక క్రోశపరిమితం బగు దూరంబున దేవర్షిపితృనామంబుల బ్రఖ్యాతిం గనిన తీర్థత్రయ మున్నది. అచ్చట దేవతలును, మునులును, పితరులును మునిచంద్రునిచే పూజింపబడి సంతసమంది సమస్తవాంఛితంబుల నొసంగిరి. నాడాదిగ నాతీర్థంబులు దేవతీర్థ, ఋషితీర్థ, పితృతీర్థ నామంబులచే బ్రసిద్ధి నొందుగాక యని వచించిరి. ఆతీర్థత్రయంబునం దవగాహన మొనరిచి తర్పణంబుల గావించినవారలు ఋణత్రయవినిర్ముక్తులై యక్షయంబు లగు స్వర్గసుఖముల నొందగలరు.

—: వేణాసువర్ణముఖరీసంగమవర్ణనము :—

సంక్రందననందనా! దేవర్షిపితృతీర్థంబుల కీశాన్యంబున యోజనద్వయంబున రయాహతనిపాతితతీరతరువరనికరయు, కుల్యావినిర్గతవారిపూరసంప్లావితసమీపారణ్యభూమండలయు, కోకకులసంకులపులినోత్సంగయు, పంకజామోదలోలాళిమాలారవాన్వితయు నగు వేణాతరంగిణి సముత్తుంగానేకనగగహ్వరంబుల నతిక్రమించి ప్రభూతవినిర్మలతోయమనోహరయై సువర్ణముఖరీనదిం గూడెను. ఆనదీద్వితయసంగమతలంబున స్నానమొనరించువారలు దశాశ్వమేధఫలము నొందగలరు. వేణానదీసంగతయగు సువర్ణముఖరీనదీగిరిదుర్గమమార్గంబున నుత్తరవాహినియై ప్రవహించెను. మహీధరమధ్యగతం బగు విషమమార్గంబున నాలుగు యోజనంబు లుత్తరంబుగ బ్రవహించి యచ్చట ప్రాగ్వాహిని యయ్యెను. ఆనదికి సార్థయోజనదూరంబున నుండెడు నొక పవిత్రస్థలంబునం దగస్త్యేశ్వరసమభిధానంబున విరాజిలు శివలింగ మొండు గలదు. ఎవ్వార లాలింగము నర్చింతురో వారల దురితనికరంబు పటాపంచలగును. ఎవ్వార లమ్మహానదీజలంబుల గ్రుంకి యగస్త్యప్రతిష్ఠితుండగు నగజామాత నర్చింతురో వారలు దురంతదురితంబుల బాసి సురావాసంబునం దఖండభోగంబుల ననుభవింపగలరు.

—: సువర్ణముఖరితో వ్యాఘ్రపాదానది గలియుట :—

అటనుండి యాసువర్ణముఖరి మరలనుదఙ్ముఖంబున యోజనార్థపరిమితదూరమునకుం బోవ నచ్చట హింతాలతాలసాలసమావృతం బగు దేశంబున దుర్వారభూరిదురితవినివారణకుశలయు, నీరంధ్రతీరవానీరమండలమండితయు, సిద్ధగంధర్వలలనాలీలావగాహనశాలినియు, తపస్వికన్యాసమర్పితబలిపుష్పవిరాజితయు, హంసకారండవక్రౌంచచక్రవాకజలవిహంగకులకోలాహల సమాకులయు, ప్రాక్ప్రవాహయు నగు వ్యాఘ్రపదాహ్వయ యగు మహానది శైలాంతరదుర్గమమార్గంబుననందు గలసెను.



—: శంఖతీర్థవర్ణనము :—

ఆనదీద్వయసంగమతలంబున స్నానమొనరించువారల సకలకలుషంబులును విలయ మొందగలవు. సకలలోకకలుషాపహం బగు నావ్యాఘ్రపాదతటంబున బ్రహ్మర్షినియతావాసంబును, సురగరుడోరగసేవితంబును, దర్శనస్నానపానాదులచే నత్యంతానందదాయకంబు నగు శంఖతీర్థం బున్నది. అచ్చట శంఖు డను మునివరుచే లింగరూపంబున బ్రతిష్ఠింపబడిన శంఖేశ్వరుం డనంబరగు పార్వతీకాంతుం గాంచి పూజానమస్కారంబు లొనరించినవారలు సురాలయంబు నొంది సుఖింపగలరు. ఇట్టి వ్యాఘ్రపదాభిధాన యగు నదిం గలసి యొక యోజనం బతిక్రమించి మునివరనికరసంసేవ్యమానయై శుభనిర్మలసలిలయై వృషభాచలనికటముం జేరె నని వినుపించి యాభరద్వాజుండు వెండియు నిట్లనియె.

—: సువర్ణముఖరీ కల్యానదీసంగమము :—

వాసవీసమస్తమంగళాలయయు, వృషభాచలసంజాతయు, కలుషౌఘవినాశినియు, వివిధతరువరలతాసంతానవిభూషితతటద్వయమనోహరయు, మునినికరసుఖసంవాసపుణ్యాశ్రమభాసమానయు, ధరణీసురదత్తార్ఘ్యవిలసత్కుశాక్షతలసత్తటయు, అప్సరస్తరుణీమణీకుచకుంభసమాలిప్తకస్తూరీపంకప్రక్షాలితపంకిలయు, దంతావళకటతటప్రసవన్మదధారాసురభీకృతయు, భూసురభూపాలకృతవితతయాగయూపవిభాసురయు, నిష్పంకజలపూరవిశేషసంతోషితాశేషమానుషయు నగు కల్యానామకం బగు నది సువర్ణముఖరిం గలసెను. ఆనదీద్వయసంగమప్రదేశంబున గావించిన స్నానంబున పౌండరీకశతంబున సంభవించు పుణ్యఫల మబ్బును. అంతియగాక బ్రహ్మహత్యాది మహాపాతకము లన్నియు నశించును.

—: సువర్ణముఖరీతీరస్థిత వేంకటాచలవర్ణనము :—

సురరాజనందనా కల్యాసమన్వితయగు సువర్ణముఖరీమహానది కుత్తరదిగ్భాగంబున క్రోశద్వయమాత్ర దూరంబున యోజనోత్సేధసమన్వి

తంబును, సమస్తతీర్థసమాశ్రయంబు నగు వేంకటాచలంబున్నది. అయ్యచలోత్తమంబునం దనేకంబు లగు నుపవనంబు లెన్నేని యున్నవి. మున్ను మధుసూదనుండు వరాహమూర్తియై యిందుండుటచే నిమ్మహీధరంబు వరాహక్షేత్రమని కీర్తింపబడుచున్నది. సువర్ణముఖరీతీరమందలి వేంకటాచలంబున కమలాలయాన్వితుండై కమలాక్షుండు నివసించి యున్నవాడు. ఆనగవరంబున మహాలక్ష్మీసహితుండై యుండు వేంకటేశుని సిద్ధగంధర్వమానవదానవులందరును సేవించుచుందురు. ఆ విహంగతురంగునియందు విన్యస్తచిత్తులై యుండు భక్తవరుల యభీష్టంబు లతిరయంబున సిద్ధించును. విపత్తుల బాసి సంపత్తు నొందగలరు. వేంకటాచల నివాసుండగు మాధవు నెవ్వారలు మనంబున దలంచుచుందురో వారలు విగతకల్మషులై శాశ్వతం బగు వైకుంఠపదంబు నొంది సుఖింపగలరన విని యర్జునుం డిటులనెను.

భూసురోత్తమా! వేంకటాచలంబున సురాసురనమస్కృతుం డగు కమలాకాంతుం డేమికతంబున నెపు డెట్లు ప్రాదుర్భావంబు నొందెనో యేపుణ్యాత్మునియెడ ప్రసన్నుండై భుక్తిముక్తిప్రదాయకం బగు తన దివ్యరూపంబు నగుపరచెనో వివరంబుగ దెల్పుమన భరద్వాజుం డిటులనెను.

—: శ్రీవేంకటాచలంబున వసియించు భగవద్వైభవవర్ణనము :—

కుంతీనందనా! వేంకటాచలేశ్వరుని మహిమంబును సవిస్తరంబుగ దెల్పుట కానలుమొగంబులవేల్పును సమర్థుండు కాడు. నేనెరింగినంతవరకు వినుపించెద వినుము. మధుసూదనుచరితంబును వినుట కుత్సహించు నీవు ధన్యుండవు. సకలభువనపాలకుండగు మాధవుని చరితంబును వచించుచుండుటచే నేనుగూడ ధన్యుండనైతిని.

తొల్లి భాగీరథీతీరంబున గ్రతుదీక్షాప్రసక్తుండును, వినిర్మలజ్ఞానసమన్వితుండు నగు జనకుండను రాజేంద్రునకు వాసుదేవుండను తాపసోత్తముండు వినుపించిన విష్ణుచరితపావనం బగు నొక కథను విను



పించెద. సావధానంబుగ వినుము. సకలచరాచరభూతముల కాద్యుండు శ్రీమన్నారాయణుండు. ఆతండు జగత్స్వరూపుండును, జగత్కర్తయునై యున్నవాడు. మరియు చిత్స్వరూపుండును, నిరంజనుండును, సహస్రశీర్షుండును, సహస్రాక్షుండును, సహస్రపాదుండును అగు నాతండు లేని ప్రదేశ మించుకయు లేదు. ఎవ్వని తేజంబున చరాచరం బగు జగంబంతయు బ్రకాశించుచున్నదో, దానికంటె పరంబగు తేజంబును, తపంబును, జ్ఞానంబును, యోగంబును, విద్యయు లేదని తెలియనగును. ఆదేవదేవుండు భూతము లన్నిటియందును సన్నిహితుండై యుండును. సమస్తభూతంబులు నాదేవునియందే సుఖమొందగలవు. యజ్ఞంబులును, యజ్వయు, యజ్ఞసాధనంబు లగు స్రుక్స్రువాదికంబులును గూడ నాపరమాత్మకంటె భిన్నంబులు గావు. యాగఫలంబును, తత్ఫలప్రదాతయు, దానిచే లభ్యంబగు నుత్తమగతియు గూడ నాదేవుండని యెఱుంగనగును. కర్మబంధంబును పశువునుగా నొనరిచి, జ్ఞానాగ్నియం దానారాయణు నుద్దేశించి హోమ మొనరించువారలు శ్రీమన్నారాయణ సాయుజ్యము నొందగలరు. హరియనియు, సదాశివుం డనియు, బ్రహ్మ యనియు, మహేంద్రుం డనియు, పిలువంబడు నామము లన్నియు నయ్యాదిదేవునకు పర్యాయపదంబు లని ప్రకీర్తితంబులై యున్నవి. ఏమానవుం డాదేవదేవునియందు భక్తి కల్గి వర్తించునో యాతండు మరల జన్మము నొందకుండును. చిదానందమయుండును, నిర్గుణుండును, నిరుపాధికుండును, నిత్యుండునై యుండియు స్వేచ్ఛగ నయ్యైయవస్థల నొందుచుండును. ఏనారాయణుండు పవిత్రము లన్నిటికిని పవిత్రమై, యగతికులకు పరమగతియై, దేవతలకు దేవతయై, శ్రేయంబులకు శ్రేయంబై, బోధ్యంబులకు బోధ్యుండై, ధ్యేయధ్యేయుండై, వినయంబులకు సమధికవినయంబై, తేజంబులకు తేజంబై, తపంబులకు ప్రకృష్టతరంబై, సమస్తభూతజాతంబున కాధారుండై, యాద్యంతశూన్యుండై యుండెనో, యట్టిజనార్దనుని భావవిజ్ఞా

వంబున బ్రహ్మాదిదేవత లందరును మూఢులైరి. అజుండయ్యు జననంబు నొందుచు సర్వాత్మకుండయ్యు శత్రుసంహార మొనరించుచు, స్వతంత్రుండయ్యు భక్తపరతంత్రుం డగుచు, కర్మసాక్షియై, సర్వజ్ఞుండై యుండెడు గరుడధ్వజునిరూపంబును మునిపుంగవు లందరును సమాహితచిత్తులై వెదకుచుందురు. సంకర్షణుం డనియు, వాసుదేవుం డనియు, ప్రద్యుమ్నుం డనియు, అనిరుద్ధుం డనియు, తన్మూర్తిచతుష్టయము ప్రసిద్ధి నొంది యున్నది. ప్రణవం బాదేవదేవుని హృదయం బని యెఱుంగనగును. ఆదేవుని బ్రకాశింపజేయునది వాసుదేవమంత్రము. ఆమంత్రరాజంబు నెవ్వారలు సమాహితచిత్తులై జపింతురో వారలు విష్ణుని కరుణాయోగంబున సిద్ధి నొందగలరు

—: భగవత్కృత భూతసృష్ట్యాదివర్ణనము :—

శతక్రతునందనా! సర్వాపన్నివారకుండును, సంపత్ప్రాపకుండును, భుక్తిముక్తిప్రదాయకుండు నగు మాధవుండు భూతము లన్నిటి నెటుల సృజియించెనో యాక్రమంబును దెల్పెద నాలకింపుము. సృష్టిగావింప నాలోచించుచుండు నాదేవదేవుని, విరించినామకం బగు రాజసగుణం బాశ్రయించెను. ఆనారాయణుని వదనంబున బురుహూతుండు పుట్టి బృందారకబృందంబునకు నాయకు డయ్యెను. పిదప ననలుం డుద్భవమంది పాకకర్మయందు సమర్థుం డయ్యెను. కరుణారసనిత్యశీతలం బగు మానసంబున సుధాకరుం డావిర్భవించెను. ఆతండు జగంబునకు చల్లదనంబు నొసంగువా డయ్యెను. లోచనంబుల లోకలోచనుం డుదయించి లోకంబులకు వెలుంగు, నుష్ణంబు నొసగుచుండెను. ఆతనిప్రాణంబున జగత్ప్రాణుం డగు సమీరణుండు బుట్టి మహాబలుండై గ్రహనక్షత్రస్వర్గంగావిమానంబులకు నాథుం డయ్యెను. ఆమహానుభావుని నాభిదేశంబునం దాకాశ ముత్పన్నమయ్యెను. వాని శీర్షంబువలన సకలచరాచరసముద్భవకారణం బగు పుష్కరంబు జనించెను. చరణసరసిజయుగళంబున భూతవ్రాతాశ్రయం బగు విశ్వంభరా



దేవి యుదయించెను. పరమపూరుషుని శ్రవణయుగళంబున దిశలన్నియు జనియించినయవి. భూస్స్వాది లోకము లన్నియును, రసాతలాది లోకంబులును, యక్షరాక్షసగణంబులు నాదేవుని స్మరణమాత్రంబున బుట్టెను.

ముఖబాహూరుపాదంబులవలన బ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును క్రమంబున బుట్టిరి. ఛందస్సముదయంబును, యాగంబులును, తురంగమంబులును, గోగణంబును, మేషాదికంబు లగు జంతువులు నాపరాత్పరుని యప్రతర్క్యవిభవంబున జనించెను. ఆదేవదేవుని సంకల్పంబున స్థావరజంగమాత్మకం బగు భూతజాతంబును, భూతభవిష్యద్వర్తమానరూపం బగు కాలమును సముత్పన్నమైనవి. బడబానలరూపంబున త్రావిన సముద్రజలంబును, కల్పాంతంబున మరల విడిచిపుచ్చి జగంబును ముంచును. ఉష్ణకిరణ, శీతకిరణరూపంబుల నొంది చీకటిని మాయజేసి కాలధర్మప్రవర్తనంబువలన భూతంబు లన్నిటిని వాని వృత్తులందు సంచరింపజేయును. కల్పాంతంబున జగము లన్నిటిని స్వోదరాంతరంబున నుంచి లీలాబాలాకృతి నొంది మహాంబుధినీరంబున వటపత్రశాయియై తరంగమాలికాడోలికల నూయల నూగుచుండును. పిమ్మట సుఖకరం బగు భోగీంద్రభోగతలంబున కమలాలయం గలసి యోగనిద్ర నొంది, నాభికాసారజాతసరసిజంబున జగన్నాథుండు చతుర్ముఖు నుదయింపజేయును. పార్థా! స్వేచ్ఛాయోగప్రవర్తి యగు ముకుందుని విలాసంబుల గనుంగొన నెట్టివారలకైన శక్యం బగునే!

ఏనాడు ధర్మము నాశనమై యధర్మం బభివృద్ధిం గాంచునో, యేకాలంబున సురనికరంబు లధికంబుగ పీడ నొందునో, యేసమయంబున సురవైరు లగు నసురులు దుర్వారగర్వసమన్వితులై యొడ లెఱుంగకుందురో, యెప్పట్టున భూతలంబునకును, భూలోకవాసులకును మహాభయం బుదయించునో, యెప్పట్టున సాధువు లగు భక్తజనుల

కనివారితంబును, దురంతంబు నగు విపత్పరంపర సంభవించునో యా సమయంబులం దెల్లవేళల తదనుగుణంబు లగు రూపంబుల నొంది యధర్మముం బోనడచి భువనంబులకు హితంబును జేకూర్చుచుండును. ఇంతియగాక శతానందనామంబున రాజసగుణసమన్వితుండై భువనంబుల సృజించును. దామోదరనామంబున సత్త్వగుణాన్వితుండై జగమ్ముల బాలించును. హరుండను నామంబున దామసవృత్తి నవలంబించి జగమ్ముల విలయ మొందించును. ఇట్టి మధుమథనుని మహిమంబుల నెఱింగినవా డొకరుండైన లేడు.

అర్జునా! లోకనాథుం డగు రమాధవుండు యజ్ఞాంగకృత సకలాంగసంధిబంధం బగు వరాహరూపము నొంది యియ్యచలరాజంబున నివసించిన చిత్రచరిత్రంబును వినుపించెద నాలింపు మని వెండియు భరద్వాజుం డిటుల వచించెను.

—: వరాహమూర్తి భూమి నుద్ధరించుట :—

మున్ను కమలాసననిశావసానసమయంబున మధుసూదనుండు ప్రబుద్ధుండై వెండియు భూతజాతసృష్టి గావింప మనంబున నిశ్చయించి యుండ, నాకమలానాథుని చిత్తంబున నొక సంశయం బుదయించెను. సృజియింపబడిన భూతవ్రాతంబును భరించుట కీవిశ్వంభరకంటె సమర్థులు గానరారు. అవ్వసుంధరయు బహుభయోద్విగ్నయై మహాజలపరీతయై పాతాళంబునం దున్నది. భూమి నుద్ధరింపకున్న భూతజాతంబు వసింప నాధారం బేమియు గానరాదని తలంచి ధరణీసముద్ధరణంబున కనువగు వరాహరూపంబు నొందెను. ఆరూపం బెట్టిదియో వివరింతును వినుము. ఉపకర్మం బోష్ఠంబును, హుతాశనుడు జిహ్వయు, ప్రణవంబు ఘుర్ఘురారావంబులును, చతుర్వేదంబులు చరణంబులును, ప్రాయశ్చిత్తంబులు డెక్కలును, ప్రాగ్వంశము శరీరమును, గర్భపుంజంబు రోమావళియును, ప్రవర్గ్య మావర్తంబును, దక్షిణాగ్ని యుదరంబును, స్రుక్కు తుండంబును, మరియు నయ్యజ్ఞసాధనంబు లింక నేమియున్నవో



యవి యన్నియు సర్వాంగసంధిబంధంబులును, దివ్యసూక్తము లన్నియు పటాజాలంబును, పరబ్రహ్మ శీర్షంబు నయ్యెను.

హవ్యకవ్యరయోపేతంబును, పరిశుద్ధపశుజానుకంబును, ఉక్తాత్యుక్తాదిక ఛందోమార్గమంత్రబలాన్వితంబునగు యజ్ఞవరాహరూపము నొంది వసుంధరాన్వేషణంబునకై ప్రళయసాగరసలిలాంతరంబున బ్రవేశించి వినిర్మలదంష్ట్రాజాలశశాంకోత్థితవిలసత్కాంతిపుంజంబులచే కల్పాంతసమయసముద్భూతం బగు తమిస్రంబును బారద్రోలుచు, ఘుర్ఘురధ్వానంబులచే భూమ్యంతరిక్షమధ్యభాగంబును ముఖరితంబు గావించుచు, ఖురవిన్యాసములచే జర్జరీకృతవిగ్రహుం డగు పన్నగాధినాథు నిటునటు బొరలించుచు, తీవ్రంబు లగు నిట్టూరుపువాయువులచే సరిత్పతికి నతలంబును సందర్శింప జేయుచు, మగ్నోన్మగ్నంబు నతిదీర్ఘంబు నగు ముఖాగ్రంబుచే జలనిధిజలంబుల సంక్షోభితంబులుగా జేయుచు, గ్రమంబుగ బోయి పోయి భయాకులయై సప్తపాతాళాధఃప్రదేశంబున వడవడ వణకుచు నుండెడు ధరణీరమణిం గాంచి సంప్రహృష్టమానసుండై యాభూదేవిని నిజదంష్ట్రాగ్రంబున నిల్పి జనలోకనివాసులగు మునివరులచే నుతింపబడుచు పారావారంబునుండి వెలికి వచ్చెను. సముద్రుం డావరాహమూర్తికి దివ్యఘోషణంబున మంగళతూర్యవాద్యధ్వను లొనరించెను. ఉత్తుంగతరంగశీకరంబులను ముక్తాఫలంబుల శుభాక్షతధారునిగా నొనరించెను. సలిలాప్లుతయై వరాహదేవునిచే నుద్ధరింపబడిన ధరణీకాంత గాఢానురాగస్వేదక్లిన్నగాత్రివలె బ్రకాశించెను.

మాధవుం డిత్తెరంగున భూమి నుద్ధరించి యంబునిధియందలి యంబువుల సుదృఢంబుగ నొనరిచి సాగరజలంబుల మర్యాద నతిక్రమించకుండ నీరుంచి, వసుంధర కాధారంబుగ నష్టదిగ్గజంబులను, కుండలీంద్రుం డగు శేషుని, కచ్ఛపరాజును నిలిపి తదాధారంబునకై యవ్యక్తరూపిణి యగు నిజమాయాశక్తిని నియోగించెను. ధరణీ

సముద్ధరణం బొనరించి యుండెడు కిటిరూపి యగు మధుసూదనుని జనలోకనివాసు లగు సనకసనందనసనత్కుమారసనత్సుజాతులం గలసి మహామును లందరు ననేకభంగుల నుతించిరి. ఆతరుణంబున చతురాననుం డాసూకరాకారుం డగు పురుషోత్తము నారాధించి తదాజ్ఞ నొంది భువనంబుల యథాపూర్వంబుగ సృజించె నన విని ధనంజయుం డిటులనెను. మహర్షిసత్తమా! కల్పాంతసలిలనిమగ్నయై యీభూదేవి యెటు లుండెనో, కల్పకాలపరిమాణం బెంతయో దానిరీతి యెట్టిదియో సమగ్రంబుగ వినిపింపుమన, భరద్వాజుం డిటులనెను.

-: కల్పవృత్తాంతవర్ణనపూర్వకం బగు శ్వేతవరాహావతారవర్ణనము :-

ఫల్గునా! అరువది విఘటిక లొకఘటిక యగును. ఘటిక లరువది యైన నొకదినం బగును. పదునేను దినంబు లొకపక్షమగును. రెండుపక్షము లొక మాస మగును రెండుమాసముల కొక ఋతు వగును. ఋతువులు మూడు గతించిన నొక యయనం బగును రెండయనంబులు నొకవత్సరం బగును. ఆవత్సరమును శతవర్షోష్ణసంమిశ్రితంబై యుండును.

మరియు నాసంవత్సరములు సురాసురులకు విపర్యయంబుగ నహోరాత్రమై యుండును. అయనంబులు రెండు నుత్తరాయణ దక్షిణాయనంబు లనంబరగుచుండును. నలుబదిలక్షల యిరువదివేల మానవాబ్దంబులు కృత త్రేతా ద్వాపర కలినామకయుగంబులం గలసి యొక మహాయుగం బగును. డెబ్బదియొక్క మహాయుగంబు లొక మన్వంతర మగును. ఈశ్వేతవరాహకల్పంబునం గలుగు మనువుల దెల్పెద వినుము. స్వాయంభువుండును, స్వారోచిషుండును, ఉత్తముండును, తామసుండును, రైవతుండును, చాక్షుషుం డను నామంబుల బరగు నార్వురు మనువులు సురేంద్రసమన్వితసురనికరమునివరులతోడం గూడి గతించిరి. ఇపు డేడవవా డగు వైవస్వతుం డను మనువు ప్రవర్తించుచున్నవాడు.



ఈ వైవస్వతమన్వంతరంబున వసురుద్రాదిత్యు లనంబరగునవి దేవతాగణంబులు తేజస్వి యనునాతం డశ్వమేధశత మొనరించి బృందారకేంద్రుం డయ్యెను. కశ్యపుడును, అత్రియు, భరద్వాజుడును, విశ్వామిత్రుడును, జమదగ్నియు, వసిష్ఠుండును, గౌతముండు ననువారలు సప్తమహర్షులు. మనుపుత్రులును, మహాబలులును, శూరులు నగు నిక్ష్వాకుప్రముఖులు ధర్మపరాయణులై మహీపాలన మొనరించిరి. సూర్య, దక్ష, బ్రహ్మ, ధర్మ, రుద్రసావర్ణి, రౌచ్య, భౌము లనువార లేడ్వురును కాబోయెడు మనువులు. బ్రహ్మ కొకపగ లగులోపల మనువులు పదునల్వురును గతించెదరు. ఆకాలంబున కొక కల్పమని పేరు ఇంతియే పరిమితమగు కాల మాబ్రహ్మ కొకరాత్రి యగును. చతుర్ముఖున కొకదినంబు గడచిన సమయంబున భూతలంబున నూరువత్సరంబులుగా నొక యవగ్రహంబు సంభవించును. అట్టి యవగ్రహదోషంబున ధరాతలం బంతయు రసవిహీనం బగుడు భూతసంచయ మంతయును నాశ మొందును.

ఆసమయంబున తప్తశిఖరాకారంబులును, హుతాశసదృశంబులు నగు ఘర్మదీధితిమయూఖంబులనుండి వెల్వడిన భీషణజ్వాలామాలికల వలన వినష్టగ్రామనగరతరునికరాదికం బగుచు నీభూమండలము కూర్మపృష్ఠోపమమై తప్తాయఃపిండసదృశమై యుండును. అటుపిదప గర్జితధ్వానబంధురంబును, సితపీతారుణశ్యామంబును, చిత్రవర్ణంబును, భీషణంబును, నగగజప్రాసాదతరులతాది నానారూపసమన్వితం బగు నంబుదం బుత్పన్నమై యాకసంబు నావరించి నూరేండ్లు ధారాసంపాతంబుగ వర్షించును. ఆజలం బంతయు దినకరకరనికరసముద్భూతం బగు ననలంబున శాంతి నొందును. వెండియు నానీరదంబులు నూరేండ్లు వర్షించును. ఆజలమువలన వననిధు లన్నియు వేలాతలంబుల నతిక్రమించి వికృతి నొందగలవు. కల్పాంతసముద్భవజలధరనిర్ముక్తంబు లగు నీరంబులచే లోకము లన్నియు నావరింపంబడును. భూర్భువస్స్వర్మహ

ర్లోకంబులందు గాఢాంధకారము వ్యాపించి భీతి నొందించుచుండును. ఆసమయంబున భూదేవి ప్రళయసలిలనిమగ్నయై పాతాళమునొంది బ్రహ్మశక్తి ననలంబనంబుగాగొని నష్టంబుగాక నెటులనో నిలిచి యుండును.

అటుపిమ్మట చతుర్ముఖనిశ్వాససముత్పన్నం బగు మారుతంబు కల్పాంతసముద్భూతంబు లగు మేఘంబు లవిరళంబులుగా జేయును. మరియు నావాయువు నూఱువత్సరంబులు గతించుదనుక దుర్నివార్యం బగు మహావేగంబున నిరంతరంబుగ వీచుచుండును. కమలసూతి యమ్మహోగ్రానిలంబును వీడి యయ్యుదకంబుల నుండు మాధవుని నాభికమలంబున యోగనిద్ర నొందియుండును. యోగనిద్రానుషక్తుం డగు పద్మసంభవునకు దినప్రమాణసమంబగు శర్వరియు గతించును. నిశావసానసమయంబున మరాళవాహనుండు పునరుత్థితుండై నారాయణశాసనంబున భూతజాతంబును యథాపూర్వంబుగ సృజించును. సకలభువనాధారుం డగు రమామానినీమనోహరుండు ప్రతికల్పంబునను సముచితంబు లగు రూపంబుల నొంది జగత్పాలన మొనరించుచుండును. ఈకల్పంబున గరుడధ్వజుండు శ్వేతవర్ణముగల యజ్ఞవరాహరూపము నొంది ధరణీతలంబున దిరుగుచు మున్ను తనకు నియతావాసం బగు వేంకటాచలంబున కేగి స్వామి పుష్కరిణీతీరంబున సంచరించుచు భక్తియుక్తుండై తనయెదుట నిలువంబడిన జలజాసనుం గాంచెను. అంత నాచతురాననుండు భూతభావనుం డగు భోగిశయనునకు విధ్యుక్తంబుగ బూజ నొనరిచి యిటుల ప్రార్థించెను.

స్వామీ ! పురాతనంబును, దివ్యమనోహరంబు నగు నీమంగళరూపంబు నొందుము. సూకరాకారంబును వీడుము. లోకంబుల నానంద మొనగూర్పు మనియెడు పలుకుల వెలందిమగండు పలికెడు పలుకుల నాలకించి సూకరరూపంబును విడనాడి యనన్యభజనీయంబును, సకలభువనాత్మకంబు నగు నిజమనోహరరూపము నొందెను.



ఇటుల దివ్యమనోహరాకారము నొంది యయ్యచలంబునందు వసియించి యుండు శ్రీకాంతుని గనుంగొన నెట్టివారలును సమర్థులు గాకుండి రన విని ధనంజయుం డిటులనియెను.

మహీసురోత్తమా ! దర్శనస్మరణాదుల కగోచరుం డగు గోవిందుండు మానవుల కెట్లు ప్రత్యక్షమయ్యెనో, యేపుణ్యాత్ముం డాజగన్నాథునారాధించి యీలోకంబునందాపరాత్పరునిగాంచగల్గెనో యాచరితంబును నా కెరిగింపుము. హరికథాశ్రవణంబును, పఠనంబును గూడ దురితాపహంబులుగదా ! మహాత్మా ! నీవు సకలాగమంబుల నెరింగిన వాడవుగాన నిన్నిటుల వేడుచుంటిని. నాపయింగినియక నాప్రార్థనము నంగీకరించి నాప్రశ్నల కుత్తర మిమ్ము. మునివర్యా ! నీదర్శనంబునం జేసి నేను పుణ్యపూరుషు లందరిలో నగ్రగణ్యుండ నైతి నన, భరద్వాజుం డిటులనెను.

## —: శంఖుం డను మానవనాయకుని చరిత్రము :—

పురందరనందనా ! జగన్నాథుం డీనగరాజంబున నెటుల ప్రకాశించెనో యట్టి పరమాశ్చర్యకరం బగు కథను వినిపించెద వినుము. హైహయవంశంబున బుట్టి శ్రుతుం డను నామంబున బ్రఖ్యాతిం గాంచిన రాజచంద్రుండు గలండు. ఆనరేంద్రుండు తన రాజ్యమందలి ప్రజల దన పుత్రులుగా దలంచి ధర్మమార్గము నించుకయు వీడక ధర నేలుచుండువాడు. ఆనరేంద్రునకు గుణరత్నాకరుండును, సర్వశాస్త్రవిశారదుండును, శంఖుం డను నామంబున బ్రసిద్ధుండు నగు కుమారుడు గలడు. ఆతండును జనకునికన్న మిన్నగ ధరాపాలన మొనరించెను. శంఖనరపాలునకు పుండరీకాయతలోచనుండును, సర్వజగన్నాథుండు నగు జనార్దనునియం దనన్యసంశ్రయంబును నిశ్చలంబు నగు భక్తి కలదు. అందువలన నానరనాథుండు మహాద్భుతవైభవుండును, అనంతుండు నగు పురుషోత్తముని చిత్తంబున ధ్యానించుచు ప్రతిదినంబును

మాధవసంప్రీతికరంబు లగు వివిధవ్రతంబులను, పుణ్యఫలప్రదంబు లగు దానంబులను గావించువాఁడు.

మరియు యథోక్తంబులగు దక్షిణ లొసంగి భూసురుల సంతృప్తుల గావించి హయమేధాదికంబులగు యాగంబుల నొనరించెను. భక్తవత్సలుం డగు మాధవునియందు చిత్తం బన్యథాయత్తంబు గాకుండ హత్తించి యిష్టాపూర్తాత్మకం బగు కర్మజాతంబును నిర్వర్తించెను. ఇంతియగాక యెల్లకాలములందు నాగోవిందునే స్మరించుచుండును. అవ్యయుం డగు నయ్యచ్యుతునే జపించుచుండును. కమలాక్షునే యర్చించుచుండును. చక్రధారినే సంకీర్తనంబు గావించుచుండును. సంతతంబుగ సంసారార్ణవతారకంబులును, పౌరాణికసమాఖ్యాతంబులు నగు విష్ణుకథ లాకర్ణించుచుండును. నారాయణసంప్రీతికై భూసురుల రావించి పూజించుచుండును. ఇటులెంతగ నాపరమేశ్వరు నారాధించినను శాశ్వతైశ్వర్యసమన్వితుండును, సర్వస్వతంత్రుండు నగు పురుషోత్తముఁడు గానరాఁడయ్యెను. సర్వక్రతురూపుండగు శ్రీధరుఁడు గానరాకుండుటం జేసి శోకాక్రాంతమానసుండై దుఃఖించుచు నిటు లనుకొనెను.

అక్కటా! వేలకొలందిగ జన్మంబు లెత్తి నేనాజన్మంబుల నెంతటి దారుణపాపకర్మంబుల నాచరించితినో, యటుల గాకున్న జగన్నాథుని దర్శనము గాకుండునే. పూర్వజన్మసముపార్జితంబు లగు పుణ్యంబులకు ఫల మామధువిరోధి సందర్శనమేగదా! కమలలోచనుండు నా లోచనంబుల కెన్నఁడు గోచరుండగునో? తద్వాక్యామృతపాన మేనాఁడు నా కర్ణయుగళంబునకు లభించునో! నేనంతటి పుణ్యాత్ముఁడ నగుదునే! దారుణంబు లగు పాతకంబుల నొనరించి క్రియాసాఫల్యరహితంబై నారాయణకరుణాకటాక్షవీక్షణంబులకు దూరంబై సంసారక్లేశగోచరంబై యుండెడు నాజన్మం బిది గాల్పనే యని పలు తెరంగుల విలపించుచు శంఖభూపాలకుండు జీవితనిస్పృహుండై యుండ, నా కేశవుం డదృశ్యమూర్తియై యటనుండెడు నందరకు స్వనుపించునటుల నిటు లనెను.



రాజా! విచారంబును మాని నావచించు వచనంబుల వినుము. మదేకశరణుండవై సాధుభావంబుననుండిన నిను గావక విడతునే? యీ వేంకటాచలంబు ముల్లోకములందును బ్రఖ్యాతి వహించి నేవసించియుండు వైకుంఠముకంటెను నాకు సంప్రీతికరంబై యున్నది. నీవాభూధరంబునకుం బోయి చిత్తంబన్యథాయత్తంబు గాకుండ మత్పదకమలాయత్తంబుగ నొనరిచి తపం బొనరించుచుండుము. వేయివత్సరంబులు గతించినపిదప నీవు నన్నవలోకింపగలవు.

ధరణీరమణా! నీవలె నయ్యగస్త్యమునిచంద్రుండును నాదర్శనమభిలషించి చతురాననుకడకుంబోయి కమలాసనా! విష్ణుసందర్శన మే ప్రదేశంబునం దగునో దెల్పుమన, నాహిరణ్యగర్భుం డాలోచించి నియతాత్ములగువారలకు వృషాచలంబున మాధవదర్శనం బగును. నీవటకు బొమ్మన, నాసరసిజాసను ననుజ్ఞ గైకొని వేంకటాచలంబునకుం జని తపం బొనరించెను. కావున నోశంఖనృపతీ! నీవుగూడ నామహీధరంబున నివాస మేర్పరించి నన్నారాధించుచు తపం బొనరించితివేని నా దర్శనము నీకును సులభసాధ్యం బగును.

—: భగవద్వచనానుసారంబుగ శంఖనరపతి
వేంకటాచలంబున కేగుట :—

సంశయ మొందకు మని దానవారాతిచే నాజ్ఞాపితుండై శంఖనృపుండు ధన్యత నొందితి నని మనంబున సంతస మంది తనయుండగు వజ్రాభిధానుం బిలచి ప్రజాపాలనకర్మంబున నియమించి, తాను గోవిందదర్శనాభిలాషంబున నారాయణనగంబునకు బోయి యానగోత్తుంగశృంగంబున దివ్యామృతోపమసలిలపరిపూర్ణంబును, సిద్ధగంధర్వదేవర్షిగణసేవితంబును, సమస్తతీర్థసమాశ్రయంబును, భవతాపోపశమనంబును, జలకాకబకక్రౌంచహంసకారండవప్రముఖవిహంగకులసమాకులంబును, కుముదోత్పలసరసిజసౌగంధికసుగంధమనోహరంబు నగు స్వామి పుష్కరిణీతీర్థతటంబునం దొకపర్ణశాల నమరిచి యందు వసించి

యీతీర్థజలంబుల స్నానపానాదు లొనరించుచు నిర్వికల్పమనోగతియై సకలకర్మంబుల బరిత్యజించి జగదీశ్వరుం డగు జనార్దనునియందు చిత్తము బొందుపరచి జపధ్యానపరాయణుండై గాఢతపం బొనరించెను.

—: భగవద్దర్శనంబునకై కుంభసంభవుండు వేంకటాచలంబున కేగుట :—

పురుహూతతనూభవా ! ఆసమయంబున చతురాననాజ్ఞానుసారంబుగ నయ్యగస్త్యముని యోగిగణంబులం గూడి వేంకటాచలంబున కేగి ప్రదక్షిణ మొనరింప గృతనిశ్చయుండై పశ్చిమదిగ్భాగంబున బ్రారంభ మొనరిచి యందందు పుణ్యఫలదంబులగు తీర్థంబుల గనుంగొనుచు జాలకాలము తిరిగి యచ్చటచ్చట శ్రీహరినిదర్శింప నభిలషించి నివసించియుండిన, కమలాసన, షణ్ముఖ, సహస్రాక్ష, విరూపాక్ష, విష్వక్సేనాదులం జూచి మరియు సనకుం డాదిగ గల్గు యోగిపుంగవులను, నారదాది దేవర్షులను, సిద్ధగంధర్వయక్షరాక్షసపన్నగులను గాంచి వారలచే ప్రశ్రయప్రియభాషణంబుల సమ్మానితుండై యాయాప్రదేశంబుల గల వింతల నరయుచు దిరుగుచుండెను. అన్నగవరంబునం గల కుమారధారాది సమస్తతీర్థంబుల స్నానాదిక్రియల నొనరించి యందందు జగత్పతి యగు గోవిందు నర్చించెను. ఇటుల దిరుగుచుండ వేయివత్సరంబులు గతించెను. పిమ్మట నామునిచంద్రుండు రమామానినీమనోహరుం గానక విచారాక్రాంతమానసుం డయ్యెను.

—: అగస్త్యు నుద్దేశించి గురువస్వాదులు వచించిన పలుకులు :—

ఆసమయంబున గురుశుక్రులును, ఉపరిచరుండగు వసువును, కుంభసంభవుని దరిజేరి మహాత్మా! రెండవనారాయణస్వరూపుడవగు నీదర్శనంబున మాజీవితములు సాఫల్యము నొందినవి. మే మచ్యుతాలోకనతత్పరులమై యుండు నవసరంబున లోకపితామహుం డగు చతురాననుండు మాకెరుకపరచిన వృత్తాంతము నాలింపుము. దక్షిణదిగ్భాగంబున వేంకటాచల మున్నదనియు నయ్యచలోత్తమంబు శ్వేత



ద్వీపముకంటెను మాధవున కతిప్రియమగు నివాసమనియు, నానగవరంబున శంఖభూపాలకునకును, కలశసంభవునకును దర్శన మొసంగునంచును, ఆసమయంబున సురగణంబులకును, మునిసంఘంబునకును, యక్షరాక్షసగణంబులకును, మాకును దేవదేవుని సందర్శన మబ్బుననియు, నదియు నచిరకాలంబున సంభవించుననియును, మీరందరును నారాయణాచలమందు వసించియున్న కుంభసంభవు నాశ్రయించి యుండుడనియు వచించెను. మేమిటు లాశతానందుని పలుకు లాలించి యిటకు వచ్చి మాభాగ్యంబున దివ్యతేజోవిభ్రాజమానుండ వగు నిను గాంచితిమి. నీతోడం గలసి పోయి స్వామిపుష్కరిణీతటంబున పరమభాగవతోత్తముం డగు శంఖమహీపాలుని గాంచగలమని సురగురుప్రముఖులు వచింపగ విచార ముడిగి వారలందరం గూడి పయనమయ్యెను.

—: అగస్త్యాదులు శ్రీవేంకటాచలమందలి మనోహర వస్తుజాతముం గనుట :—

ఇటుల నాకలశజునితో గలసి వెడలుచుండువార లందరును మార్గమధ్యంబున ఫలపుష్పభరితంబులై వినమ్రంబు లగు తరువరంబులను, సింహదంతావళవ్యాఘ్రాది జంతుసంతతులను, సువర్ణ, రజత, తామ్రాది ధాతుమండితంబు లగు సుందరశైలసానువులను, మహావేగసముద్ధృతశిలాతలంబులగు గిరినిర్ఝరులను కనుంగొనుచు కమలకల్హారపరిమళభరితంబును, మందగమనంబు నగు మారుతంబును సేవించుచు, శుకపికారావంబులనాలకింపుచు, నందందు విశాలశిలాతలంబుల సమాసీనులై పీతాంబరు గుణగణంబుల గాన మొనరించు సిద్ధగణంబుల బొడగాంచుచు గ్రమంబున బోయి వినిర్మలస్వాదుజలభాసురం బగు స్వామిపుష్కరిణి నవలోకించి తత్తీరంబున నివాసం బేర్పరచి మనోవాక్కాయకర్మంబులపరమపూరుషునిచరణసరసిజసేవానిరతుండై తదేకధ్యాననిష్ఠాగరిష్ఠుడై యుండెడు శంఖనరపాలుం గాంచిరి. నరనాథుండు నావచ్చిన సంశితవ్రతులగువారలం గాంచి సత్వరంబున నెదురుగ జని ప్రణామ

స్తుతిపురస్సరముగ సముచితార్చనల గావించి నిజాశ్రమమునకు దోడ్తెచ్చెను. వారలు నన్యోన్యసంభావనల గావించుకొని సముచితాసీనులై గోవిందసంకీర్తనపరులై కృతార్థత నొందిరని వచించి వెండియు భరద్వాజుం డిటుల నెను.

—: శంఖాగస్త్యాదు లొనరించిన తపంబునకు సంతుష్టి నొంది భగవంతుండు బ్రత్యక్ష మగుట :—

బృందారకేంద్రనందనా! చిత్తంబుల నయ్యుత్తమపూరుషుని పదకమలంబుల హత్తించి తత్పూజాస్తోత్రపరాయణులై యుండు నమ్మునిసత్తములకు మూడుదినములు గతించెను. మూడవనాటిరాత్రి వారలందరును నిదురించుచుండ నాల్గవయామం బవసానంబునొందు సమయంబున శంఖచక్రగదాపాణియు, స్మేరాననుండును, మందహాససుందరవదనారవిందుండు నగు కమలానాథుండు ప్రసన్నుండయి వరము లొసగుటకై వారల యెదుట నిలువంబడి మందహాస మొనరించు దివ్యమూర్తిం గాంచినటుల స్వప్నముం గని సంభ్రాంతమానసులై సత్వరమ్ముగ లేచి పావనంబులగు స్వామి పుష్కరిణీజలంబుల నవగాహన మొనరిచి దివసముఖోచితకర్మకలాపంబును సాంగంబుగ నెరపి యాశ్రమతలంబునుండి దేవతాయతనంబునకు బోవుచు మార్గమధ్యంబున విహంగమకూజితసూచితంబులును, శ్రేయస్కరంబులు నగు శుభశకునంబులం గాంచి పుండరీకలోచనప్రసాదమును కరగతమైనదానిగా దలంచిరి.

పిదప వార లందరు నయ్యచ్యుతు నారాధించి వేదవర్ణితంబులును, పవిత్రంబులు నగు వివిధస్తోత్రంబుల నయ్యాదిదేవు నుతియించిరి. సంక్రందననందనా! యాస్తోత్రావసానంబున లోపాముద్రాప్రాణవల్లభుండు శంఖనరపాలసమన్వితుండై యష్టాక్షరమంత్రమునుజపించెను.

అంతలోన సమస్తజగదాధారుం డగు మాధవునియందు లయ మొనరించిన చిత్తంబులు గలవారలయెదుట సూర్యచంద్రహుతాశనకోటిప్రభాభాసురంబగు నొక తేజస్సు గాంచనయ్యెను. పిదప పరమానందవిగ్రహుండును, అవాఙ్మానసగోచరుండును, మహైశ్వర్యభాసురుండును,సహస్రశీర్షుండును,సహస్రాక్షుండును, సహస్రపాదబాహుసముపేతుండును, తప్తకాంచనసమానపరిస్ఫురత్కాంతిశోభితుండును, దంష్ట్రాకరాళవదనుండును, దుర్దర్శనుండును, కౌస్తుభమణివిరాజమానవిపులవక్షస్థలుండును, అచింత్యుండును, అవ్యక్తుండును, ఆదిమధ్యాంతశూన్యుండును, అత్యంతభయదాకారుండును, సర్వాంతర్యామియు, అనేకకోటిబ్రహ్మాండనాయకుండు నగు వరాహమూర్తిగా నెరింగి పరిహృష్టాంతరంగులై యయ్యగస్త్యశంఖనృపాలప్రముఖు లగువారలందరు ననేకసాష్టాంగవందనము లాచరించిరి. ఆసమయంబున లోకరక్షాక్షమంబులగు దేవదేవుని యాయుధము లన్నియును మింట బరిభ్రమించుచు జగన్నాథుని సేవింప దరలి వచ్చుచుండెను. దారితదానవచక్రంబగు చక్రంబును, కౌమోదకి యను గదయు, నందకం బను ఖడ్గంబును, చంద్రధవళంబును, మహోగ్రరవసంకలితం బగు పాంచజన్యనామకం బగు శంఖంబును, రయంబున వచ్చి యాజగదీశుని సేవించినవి. అపు డాశంఖరాజంబు నిజధ్వానంబుచే బ్రహ్మాండము నంతను పూరించెను. సకలాసురభయంకరంబును, నితాంతాశ్చర్యభీషణంబు నగు పాంచజన్యనినదంబు నాలించి సుర లందరును వారివారి వాహనంబుల నధిరోహించి మాధవుని దర్శింప జనుదెంచిరి. చతురాననుండును, వృషధ్వజుండును, పురందరుండును, సనకాది యోగిపుంగవులును, వసిష్ఠప్రముఖులగు మునిసత్తములును, గంధర్వోరగకిన్నరులును, విష్వక్సేనుండును, విహంగపుంగవుం డగు గరుడుండును, జయవిజయాదు లగు విష్ణుభృత్యులును, విష్ణుసారూప్యము నొంది శ్వేతద్వీపంబున నివాసంబుగ నుండువార లందరును విచ్చేసిరి. ఆసమయంబున మేదురామోదమోదితాశేషమానసంబును, సురతరుసముద్భూతంబు నగు పూలవాన గురిసెను. సురసుందరీమణులు నాట్య మొనరించిరి. కిన్నరులును గానంబు నెరపుచుండిరి. సురచారణగంధర్వనరులు వివిధంబు

లగు స్తుతు లొనరించుచుండిరి. ప్రసన్నుండును, భక్తవత్సలుండు నగు రమాకాంతునికి బ్రహ్మాదిదేవత లందరును సాష్టాంగదండప్రణామము లాచరించి యిటుల నుతించిరి.

శ్లో॥ జయ విష్ణో కృపాసింధో జయ తామరసేక్షణ ।
జయ లోకైకవరద జయ భక్తార్తిభంజన ॥
అనంత మక్షరం శాంత మవాఙ్మనసగోచరం ।
కో వా భవంతం జానాతి చిదానందమయాత్మకమ్ ॥
అణోరణుతరం స్థూలా త్స్థూలం సర్వాంతరస్థితం ।
త్వామామనంతి పురుషం ప్రకృతేః పర మచ్యుతమ్ ॥
వేదాంతసారరూపం త్వాం సర్వాంతర్బాహ్యవర్తినం ।
కో హి వర్ణయితుం శక్తో మాయాయత్తేషు దేహిషు ॥

ఈరీతిగ నుతించి, దేవదేవా! మహాభయంకరం బగు నీ రూపముం గాంచి మేమందరమును భయకంపితగాత్రుల మైతిమి. నీ వీరూపంబును విడిచి శాంతంబగు రూపము నొందుము. మము దయ గాంచు మనియెడువారల ప్రార్థనం బంగీకరించి ప్రసన్నుండై మేఘ గంభీరభాషణంబుల నిటులనెను.

—: చతురాననాదులొనరించిన ప్రార్థన నంగీకరించి భగవంతుండు సౌమ్యరూపము నొందుట :—

ఓ మునులారా! భయావహం బగు నీరూపంబును విడిచి, మీకందరకును ప్రియం బై యుండు సుందరాకారము నొందెద. నిరాకులచిత్తులై ననుగాంచు డని పలుకుచు నంతర్ధానమునొంది మరియొక ముహూర్తకాలంబున రాకాసుధాకరప్రతిమాననుండై, నీలనీరదాకార శరీరుండై, కనకవసనధరుండై, మణిగణఖచితభూషణవిభూషితుండై, శంఖ చక్ర గదాపద్మవిరాజమానకరచతుష్కుండై సుఖదర్శనుండై రత్నవిమానవరంబు నధిరోహించి ప్రత్యక్షమయ్యెను. ఆమనోహ



రాకారుండగు రమాకాంతుని గనుంగొని వార లందరు పరాత్పరునకు వందనము లొనరించిరి. ఆపరాత్పరుం డభీష్టప్రతిపాదనంబుల బ్రహ్మాది దేవతల బ్రహృష్టాంతరంగుల గావించి యెదుట వినమితకంధరుండై నిలిచియున్న కుంభజు నవలోకించి యిటుల వచించెను. మునీంద్రా! కఠినంబులగు వివిధవ్రతంబు లొనరించి నన్నారాధించుచు నీవపార మగు క్లేశము నొందితివి. నీకు వలయువరంబులనొసగెద. కోరుమనియెడు శ్రీకాంతుని పలుకుల నాలించి పులకీకృతాంగుండై యగస్త్యముని యిటులనెను.

—: అగస్త్యప్రార్థనంబున రమాకాంతుండు సువర్ణముఖరీనదికి సర్వనదీప్రాశస్త్య మొసగుట :—

జగన్నాయకా! నీవు నాయం దింతటి యాదరముం జూపుటం జేసి నేనొనరించిన జపతపంబులును, నేపఠించిన వేదశాస్త్రంబులును, సాఫల్య మొందినయవి. ఎల్లకాలములందును, మనంబున నిను ధ్యానించుచుండు నను వెదకికొనుచు వచ్చి దర్శనమిచ్చినకతంబున సకలభువనంబుల నాకంటె ధన్యుడు లేడని సంతసించితిని. నీయనుగ్రహంబున నా మనోరథము లన్నియు నింతకుమున్న సిద్ధించినయవి. నేనెంతగ నాలోచించినను ప్రాప్యంబగు వస్తు వేదియు గానరాకున్నది. అయినను చాపల్యంబున నొక విన్నప మొనరించుచుంటిని. ఎల్లపుడు నీపదకమలములందలి భక్తి యిటులనే నిలిచియుండుగాక.

మాధవా! అమరులు ప్రార్థింపగ స్నాతాఘౌఘవినాశనకారిణి యగు సువర్ణముఖరీనదిని దోడ్తెచ్చితిని. ఆనదియు నీయస్యాచలకటకతటంబున భాసిలుచున్నది. నీవానదిని కృతార్థత నొందింపుము. సువర్ణముఖరీతోయంబుల స్నాన మొనరిచి వేంకటాచలమందలి నిను గాంచినవారలు భుక్తిముక్తులకు భాజనంబు లగుదురు. అల్పాయుష్కులును, బలాఢ్యులును, జ్ఞానయోగపరిభ్రష్టులు నగువారలు నిను గాంచుటకు సమర్థులు గాకుందురు. సర్వకాలంబులందును నీవీశైలవర్యంబున

ప్రసాదసుముఖుడవై నిలిచి నిను సేవించువారలకు కాంక్షితార్థప్రదుండ వగుచుండు మనియెడు కుంభోద్భవుని పలుకుల నాలకించి లక్ష్మీకాంతుం డిటు వచించెను.

మునిసత్తమా! నీకోరిక లన్నియు నాతీరున జరుగగలవు. నీవు నాయందు నిలిపిన భక్తి యనన్యసామాన్యమైనది. గంగానదివలె నీసువర్ణముఖరీనదియు నమరులకుగూడ వాంఛితార్థప్రదాయినియై యుండును. ఈమహానది పావనంబులగు ననేకనదులంగలసి దివ్యనదిని సంక్రమింపగలదు. నీకోరిక ననుసరించి నేఁడాదిగ సర్వకాలములందును, నేనీవైకుంఠనగంబున నివసించియుండెద. ఎవ్వారలు సువర్ణముఖరీనీరంబుల స్నాన మొనరిచి క్షపితాఖిలకల్మషులై యీవైకుంఠనగంబున నను గాంచి నమస్కృతు లొనరింతురో వారలు పుత్రపౌత్రాది సంపత్సమువేతులై యఖండభోగంబుల ననుభవించి దేహావసానంబున త్రివిష్టపంబున కల్పాంతంబుదనుక నివసించి యటుపిమ్మట కేవలానందసంధాయకంబును, పునరావృత్తిరహితంబు నగు నానిలయము నొందగలరు. నీవచనగౌరవంబున నను గాంచ వచ్చినవారల మనోరథంబుల దీర్చెద. సంతానాపేక్షగలవారలకు సంతతిని, ధనాకాంక్షుల కపరిమితధనంబును, రోగపీడితులకు రోగశాంతిని, తీవ్రాపత్సంభూతుల కాపన్నివారణంబు నొడగూర్చెద. దుర్లభంబు లగు నభీప్సితంబుల నొందుటయు నను గాంచుట కగు ఫలముగా నెఱుంగుము.

ఎచ్చట నుండినను నను ధ్యాన మొనరించు నాభక్తవరులు వారివారి వాంఛితంబుల నొందగలరు.

—: భగవంతుండు శంఖనరపతికి వరముల నొసగి యంతర్హితుం డగుట :—

ఈతీరున కుంభసంభవు నుద్దేశించి వచించి, పిదప శంఖనరవరుం గాంచి యిటులనెను. శంఖభూపతీ! నీభక్తికి నేనెంతయు సంతసించితిని. నను నుద్దేశించి దారుణతపం బొనరిచి మిక్కిలి క్లేశ మొందితివి.



నీయెడ బ్రసన్నుండనై నీకు వరముల నీయదలంచి వచ్చినాడను. వరముల గోరుమన, శంఖనరపతి శంఖచక్రధరునకు వందన మాచరించి యిటు లనెను. దేవా! భవత్పదనీరజసేవనంబుకంటె గోరున దేమున్నది! నీభక్తవరు లొందెడు నుత్తమగతినే నేనును గోరుచుంటి నన గరుడగమను డిటులనెను. నరేంద్రా! నీయభీప్సిత మటులనే నెరవేరగలదు. మత్సేవాసంసక్తచిత్తులగువారల కలభ్యం బగున దేదియు లేదు. నీవు కల్పాంతంబుదనుక నింద్రలోకంబున నుండి యచట నప్సరోగణసేవితుండవై యఖండభోగముల ననుభవించి పిదప నాలోకంబు నొందగలవు.

ధనంజయా! యీచందంబున శంఖభూపతికి వరముల నొసంగి జగత్కారణుండును, భక్తకల్పకంబు నగు నారాయణుండు చతురాననాది సురనికరంబుల విడచి యంతర్ధాన మొందెను.

—: భరద్వాజవర్ణిత వేంకటాచలమాహాత్మ్యనిగమనము :—

అర్జునా! వేంకటాచలప్రభావమును వినుపించితిని. ఈపావనచరితంబును వీనుల విందుగ వినినవార లందరును పాపవినిర్ముక్తు లగుదురు. మాధవుం డిచ్చట వరాహరూపంబు నొంది యద్భుతాకారుండై నిజమాయాజాలంబున భువనంబుల మోహంబున ముంచి పిదప బ్రహ్మాదిదేవతలచే సంప్రార్థితుండై నరవరసురనికరమునివర్యులకు నితాంతమనోహరంబును, శాంతంబును, సమస్తభోగాత్మకంబు నగు మంగళవిగ్రహముం గనుపరచి వారలు కోరిన వరంబుల నొసంగెను. వేంకటాచలంబును, అందు వసించియున్న శ్రీమన్నారాయణమూర్తిని, స్వామిపుష్కరిణీతీర్థంబును తలంచుచుండువారల కలుషంబులు విలయ మొందును. వేంకటాచలసమాన మగు పర్వతమును, వేంకటేశ్వరున కెనయగు దైవతంబును, భూతభవిష్యద్వర్తమానకాలంబుల నింకొకటి యెందును గానరాదు. ప్రాతఃకాలంబున లేచి వేంకటేశ్వరుని సంస్మరించినవారలకు మోక్షలక్ష్మీకరగ్రహణమగు నని యెఱుంగుము. స్వామి

పుష్కరిణీతీర్థంబున స్నానమును, వరాహాచలవాసుండగు మాధవుని దర్శనంబును, సహస్రహయమేథఫలంబును, శతవాజిమేథఫలంబును నొడగూర్చును. వేంకటాచలమహిమంబును వినినవార లిహంబున సమస్తసుఖముల ననుభవించి పరంబున ముక్తి నొందగలరు. మునివరులారా! వేంకటాచలమహిమంబును సంక్షేపంబుగ వినుపించితిని. మీకిక మహానదీవిభవంబును వినుపించెద నని సూతుం డిటు వచించెను.

—: పుత్రునికై యంజనాదేవి తపం బొనరించుట :—

సంతానహీనురా లగు నంజనాదేవి పుత్రసంతానముం బడయ గోరి తపం బొనరింపదొడంగెను. మునిసింహుండును, విష్ణుభక్తాగ్రేసరుండు నగు మతంగమహర్షి యయ్యతివం గాంచి దేవీ! నీ వెందులకై యిటుల తపం బొనరించుచుంటి వన, నయ్యంజన యిటుల నెను. మునిచంద్రమా! నాపలుకుల నాలింపుము. నాజనకుండు శివభక్తాగ్రేసరుడగు కేసరి యను రాక్షసుండు. ఆతండు పుత్రుని బడయు తలంపున ఘోరంబగు శైవవ్రత మవలంబించి తపం బొనరించెను. శంకరుం డాతపంబునకు సంతసించి పార్వతీసహితుండై ధవళవృషతురంగము నధిరోహించి నాజనకునియెదుట బ్రత్యక్షమై నిలిచి యిటు వర మొసగెను. రాక్షసనాయకా! నాపలుకుల నాలింపుము. నీకీజన్మంబునం దపుత్రత్వము విధినిర్మితమై యున్నది. అయినను నీకొక వర మొసగెద. లోకము లన్నిటను బ్రసిద్ధి గాంచిన యొక పుత్రిక జనింపగలదు. ఆబాలికకు జనించిన పుత్రుండు మహామేధావియై, నీకెంతేని ప్రియ మొనగూర్పగలడు. నీ వీదారుణతపంబును విరమించి సుఖంబుగ నుండుమని వర మొసంగి శంకరుం డంతర్ధానము నొందెను. పిమ్మట నన్నుం గని నాతండ్రి కృతార్థుం డయ్యెను.

అటుపిమ్మట కొంతకాల మతిక్రమింప కేసరి యను కపివరుండు నీతనయను నాకు వివాహ మొనరింపుమని నాతండ్రిని కోరెను. నాతండ్రియు నందుల కామోదమునొంది నన్నాకపీంద్రున కొసంగి



నా కరణంబుగ లక్షసహస్రసంఖ్యాకంబు లగు గోవులను, లక్ష మత్తమాతంగంబులను, అర్బుదసంఖ్యాకంబు లగు నుత్తుంగతురంగములను, అన్నియ యరదంబులను, దాసదాసీజనంబుల నసంఖ్యాకంబులగను, వివిధభూషణాంబరంబులను, నృత్యగీతవిశారదలగు సుందరులను అంతఃపురపరిచారిక లగు గమణీమణులను నావెంబడిన పంపించెను. నేనాపతిం గూడియుండ చాలకాలము గతించినది. పుత్రుండు జనింపడాయెను. ఆకారణంబున మిగుల జింతించుచు కిష్కింధానగరంబున వివిధంబులగు వ్రతముల నొనరించితిని.

మునిసత్తమా! మాఘ వైశాఖ కార్తికమాసంబుల స్నానదానాదికంబుల నొనరించితిని. చాతుర్మాస్యవ్రత మాచరించితిని. పరమేశ్వరు నుద్దేశించి ప్రదక్షిణనమస్కారము లొనరించితిని. అన్నదాన, సాలగ్రామదాన, దీపదాన, గోదాన, తిలదాన, వస్త్రదాన, భూదాన, వారిదాన, పుష్పదానాది దానంబుల నొనరించితిని. సత్పుత్రావాప్తికై ముఖ్యము లగు వైష్ణవవ్రతంబుల గావించితిని. మహాత్ము లగు భూసురోత్తములు నా కెరుకపరచిన వ్రతము లెన్నిటినో మధువిరోధిసంప్రీతికై యొనరించితిని. ఎన్ని దానంబు లెన్ని వ్రతము లాచరించినను పుత్రుం బడయనేరక దుఃఖించుచు తుద కిట్టి దారుణతపం బొనరింప సమకట్టితిని. మహానుభావా! కరముల జోడించి దీనురాలనై వేడుకొనుచుంటిని. ముల్లోకంబుల బ్రసిద్ధినొందునంతటి తనయుం డెటుల లభించునో దెలియబరుపు మనియెడు నయ్యతివ దీనాలాపము లాలించి యమ్మునిచంద్రుం డిట్లనెను.

కల్యాణీ! పుత్రపౌత్రప్రదం బగు నావచనంబు వినుము. ఇచ్చటకు దక్షిణదిగ్భాగంబుగ బదియోజనంబులు పోవ నచట నృసింహనివాసస్థానంబగు ఘనాచలమున్నది. ఆనగోత్తమంబున మనోహరమగు బ్రహ్మతీర్థ మున్నది. అయ్యచలంబునకు పూర్వదిగ్భాగంబున బది యోజనంబులు బోవ సువర్ణముఖరి యను మహానది యున్నది. ఆ

సరిద్వరంబున కుత్తరంబున వృషభాచల మున్నది. అన్నగోత్తుంగ
శృంగంబున స్వామిపుష్కరిణీతీర్థ ముండెను. నీవటకు బోయి యా
తీర్థముం గాంచితివేని మనశ్శుద్ధి నొందగలవు. ఆతీర్థంబున విధ్యుక్తం
బుగ స్నాన మొనరించి వరాహదేవునకు ప్రణామంబు లాచరించి వేంక
టేశ్వరుని గాంచి సాష్టాంగదండప్రణామంబు లాచరించి యాస్వామి
తీర్థంబున కుత్తరదిగ్భాగంబున మనోహరంబును, సింహశార్దూలాది
మృగసమన్వితంబును, చూతపున్నాగపనసవకుళామలకచందనాగరునింబ
తాలహింతాలకింశుకకపిత్థాశ్వత్థప్రముఖ తరువరనికరభాసురంబు నగు
నాకాశగంగ యను తీర్థముం జేరి యందు సంకల్పపూర్వకంబుగ స్నాన
మొనరించి యాపావనమంగళతోయంబుల ద్రావి యాతీర్థరాజంబున
కభిముఖంబుగ నిల్చి వాయుదేవు నుద్దేశించి తపం బొనరింపుము. నియ
మంబుగ నీవటు లొనరించినచో సురాసురులకును, భూసురులాదిగ గల్గు
మానవులకును, తపోనిధు లగు మునిముఖ్యులకును, సింహాది మృగంబు
లకును, విహంగమజాతులకును, కీటకసముదయంబునకును, వివిధశస్త్రా
స్త్రంబులకును గూడ నవధ్యుం డగు పుత్త్రుం డుదయించును. సంశ
యంబు వలదనియెడు మునిశేఖరుపలుకుల నాలించి ఆమహీసురో
త్తమున కనేకవందనము లాచరించి ప్రాణనాథుం డగు కేసరిం గూడి
వేంకటాచలంబునకు పయనమై పోవుచు ముందుగ కపిలతీర్థంబున
గ్రుంకి నిర్మలచిత్తయై శేషాచలము నధిరోహించి స్వామిపుష్కరిణీ
జలంబుల నవగాహన మొనరిచి, వరాహమూర్తిని దర్శించి, వందన
మొనరిచి వేంకటేశు నవలోకించి నమస్కరించి నుతు లొనరించి,
మతంగముని వచనంబుల దలంచి యంజనాదేవి వియద్గంగాతోయంబున
మున్కలిడి యందలి నీరంబుల గ్రోలి యయ్యాకాశగంగాతటంబున
నియతవ్రతయై కొంతకాలము ఫలముల భుజించుచు, మరికొంతకాల
ముదకంబును ద్రావుచు, నికగొంతకాలము నిరాహారయై నాసాగ్రం
బున దృష్టి నిల్పి వేయివత్సరంబు లావాయుదేవు నుద్దేశించి గాఢతర



తపం బొనరించెను. తపం బొనరించిన కాలంబున విఫుల యను చెలిమి
కత్తియ యామెకు శుశ్రూషగావించెను. అంత నవ్వాయుదేవుం డామె
గావించిన తపంబునకు సంతసమంది ప్రత్యక్ష మయ్యెను.

మునిశేఖరులారా! వాయుదేవుం డాలలనామణికి దర్శన
మొసంగిన దిన మయ్యది దినకరుండు మేషరాశిగతుండగు పిదప జను
దెంచిన చిత్రానక్షత్రంబున గూడిన పూర్ణిమయై యుండెను. పవ
మానుం డాపడతికి దర్శన మొసంగి సుందరీ! నీయభీష్ట మెద్దియో
వచింపుము. నీకోరిక దీర్చెదనన నాతలోదరి యిటు లనెను. వాయుదేవా!
నాకొక సత్పుత్రు నొసంగు మింతకంటె నేను కోరున దెద్దియు లేదన,
నాసుందరిపలుకుల నాలకించి ప్రభంజను డిటువచించెను. తరుణీమణీ!
నీకు తనయుండనై నేనే సముద్భవమందెదను. అందున నీవీభువనంబు
లన్నిట మిగుల బ్రఖ్యాతినొందగలవు. సంశయ ముడుగుమని వర
మొసగి మహాబలు డచటనే నిలిచియుండెను. ఆ సమయంబున
కమలాసనుం డాదిగగలుగు నమరులును, మహేంద్రాది దిక్పాలురును,
వసిష్ఠ ప్రముఖులగు మహర్షులును, సనకాదు లగు యోగిపుంగవులును,
వ్యాసాది మహీసురోత్తములును, కమలాలయం గూడిన కమలా
క్షుండును, మునిసతులును, దేవతరుణులును కిన్నరకింపురుషాది దేవ
యోనివిశేషులును వారివారి వాహనంబుల నధిరోహించి దారభృత్య
సుతాదులం గలసి చనుదెంచి దారుణతపశ్చర్యానిరత యగు నంజనా
దేవిం గాంచిరి. వారలందరు సంబరంబున నిలిచి యామె గావించిన
గాఢతరం బగు తపశ్చర్యను కొనియాడుచు పరస్పరసంభాషణము
లొనరించుకొనుచుండి రని మరల సూతుం డామునుల కిటు వచించెను.

మునిశేఖరులారా! వాయువరప్రసాదమునం జేసి మహానంద
సాగరనిమగ్న యగు నయ్యంజనాదేవి తన నియమంబునకు సంతసించి
తన్నుం గాంచ వచ్చిన విరించి ప్రముఖు లగు విబుధుల నవలోకించి
విస్మయాక్రాంతమానసయై నిజనాథుం గూడి వారలందరకును వందన

మాచరించి నిలిచి యుండునంత, వేదవేదాంగవిశారదుం డగు వ్యాస మునీంద్రుం డు బ్రహ్మాదిదేవతానుజ్ఞాతుండై మేఘనిర్ఘోషగంభీరభాషణంబుల నిటు వచించెను. సుందరీ! సకలభువనంబుల కుపకారకములగు నాపలుకుల వినుము. మతంగమునిపుంగవుని పలుకులకు విశ్వాస ముంచి వేంకటాచలంబున కరుగుదెంచి దుష్కరంబగు తపంబొనరించితివి నీవా తపఃప్రభావంబున సకలభువనవిశ్రుతుండును, మహాశూరుండును, ప్రజ్ఞాధురంధరుండునగు తనయుని బడయగలవు. నీవు తపం బొనరించి యేతీర్థ తటంబున మనోభీష్టసిద్ధి నొందితివో యట్టి యాతీర్థ మన్నితీర్థంబుల నుత్తమంబై వెలయగలదు. గంగాదిపుణ్యతీర్థము లన్నియు నిందు గలవు. ఈజగంబున వేంకటాద్రి కుద్దియగు నద్రివర మింకొకటి లేదు.

ఈనగమందలి తీర్థము లన్నిట నుత్తమ మగు స్వామి పుష్కరిణి పుణ్యఫలప్రదమై యున్నది. అంతకంటె సమధికఫలప్రద మగు నది వియద్గంగ యని తెలియనగును.

మేషసంక్రమణంబున చిత్రానక్షత్రయుతంబగు పూర్ణిమా దినంబున నిందు స్నాన మొనరించువారలకు గల్గు ఫలంబును వచించెద వినుము. ద్వాదశహాయనంబులు గంగాది సమస్తతీర్థంబుల గావించిన స్నాన మొకమారీజలంబుల స్నాస మొనరించువారల కబ్బును. ఈతీర్థ జలంబులం దవగాహన మొనరిచి యిచట గావించిన దానంబుల గల్గు ఫలమును వర్ణింప నేరును సమర్థులు గారన విని యంజనాదేవి యిటు లనెను.

మహాత్మా! వేంకటాచలంబునం దేయేదానములు ప్రశస్తములో దయయుంచి వినుపింపు మన, నామునీంద్రుం డిటుల బల్కెను.

—: వ్యాసమునీంద్రుండు వేంకటాచలంబున గావింపదగిన దానముల దెల్పుట :—

శేషాచలమునం దన్నదాన వస్త్రదానములు ప్రశంసనీయంబులు. ఆరెంటికంటెను సమధికఫల మొసగునట్టిది పితృశ్రాద్ధమని

యెఱుంగుము. అందు హిరణ్యదాన మొనరించినవారలు సామ్రాజ్యాధిపత్యము నొందగలరు. సాలగ్రామదానము జన్మరాహిత్య మొనరించి శాశ్వతం బగు విష్ణులోకముం జేర్చును. కుటుంబవంతుండును, దరిద్రుండు నగు భూసుర శ్రేష్ఠునకు గోదానం బిచ్చినవార లాగోవు శరీరంబునం దెన్నిరోమము లుండునో యన్నిసంవత్సరములు గతించుదనుక విష్ణులోకమున నుండగలరు. ఇయ్యచలంబున గావింపబడిన భూదానమున గల్గు ఫలమును వర్ణింప నలవికాదు. శ్రోత్రియుండగు ధరణీసురునకు కన్యాదాన మొనరించినవారలు వారల పితరులతోడ గలసి విష్ణుమందిరమున వసింతురు. ఈ నగోత్తమంబున శీతలోదక సమన్విత మగు ప్రపాశాలను నిర్మించిన వారల ఫలమును వర్ణింప నయ్యాదిశేషుండును సమర్థుండు గాడు.

తిలదానంబున సకలకలుషంబుల విడిచి విష్ణులోకము నొందగలరు. ధాన్యదానము నొనరించినవారలు బహుపుత్రకు లగుదురు. గంధ చంపక పుష్పాదులను, ఛత్రచామరవ్యజనంబులను, తాంబూలఘనసారాదికంబులను, ధరణీసురులకు దాన మిచ్చినవారలు చిరకాల సుఖండభోగంబుల ననుభవించి దేహావసానంబున స్వర్గలోకముం జేరి యచట ననేకదివ్యవర్షసహస్రంబులు గతించుదనుక ననేకభోగంబుల ననుభవించి మరల ధరణీతలంబున సార్వభౌములై జనించి చిరకాలము మహీపాలన మొనరించి, పిదప నాదేహమును వీడి భూసురులై పుట్టి వేదవేదాంగముల కుశలురై మాధవానుగ్రహము న్వడసి ముక్తి నొందగల్గుదురు. రమణీమణీ! యిట్టి వేంకటాచలవైభవంబు నెఱుంగ నెవ్వారలు సమర్థు లగుదురు ?

ఎవ్వార లీనగవరచరితంబును పఠింతురో, యెవ్వారలు వినియెదరో వార లందరును పాపనిర్ముక్తులై విష్ణులోకంబున శాశ్వత సుఖం బనుభవించుచు నుండగలరు.

శౌనకాదిమునిశేఖరులారా ! యీతెరంగున మున్నా వ్యాసమునిచంద్రుం డీవేంకటాచలవైభవంబును వినుపించెను. ఈచరితంబును వినినవారలును, చదివినవారలును, వారివారి వంశముల జనన మొందిన వారలును గూడ ముక్తి నొందగల్గుదు రనుటకు సందియము లేదు.

స్కాందపురాణమందలి వైష్ణవ ఖండాంతర్గతంబగు

వేంకటాచలమాహాత్మ్యము

సమాప్తము.

శ్రీః శ్రీః శ్రీః



శ్రీ విజయలక్ష్మీ పవర్ ప్రెస్, భట్నవిల్లి, అమలాపురంతా॥